అకురాతి చలమయ్య
సంపాదకుడు

శాంతినిలయ గ్రంథమాల
ద్వితీయ పుష్పము

# మహర్షి
# మహోపదేశములు

(ప్రథమ భాగము)

(ఉపనిషత్సూత్రముల వ్యాఖ్యానములకు ఆంధ్రానువాదము)



మహర్షి
దేవేంద్రనాథఠాకూరుగారు



ప్రకాశకులు:

అకురాతి చలమయ్య,
శాంతినిలయ గ్రంథమాల,
కాకినాడ,

1943

# తొలి పలుకు

ఈ మహోపదేశములు ఉపనిషత్సూత్రముల ననుసరించి మహర్షి దేవేంద్రనాథ ఠాకూరుగారిచే బ్రహ్మమందిరమున నొసగబడినవి. వీరు జగత్ప్రసిద్ధకవిసార్వభౌము లగు శ్రీ రవీంద్రనాథ ఠాకూరుగారి తండ్రిగారు. వీరు గొప్ప రాజకుటుంబమునందును, మహత్తరవిలాసవైభవములందును, జన్మించియు, తమ ప్రతిభావిశేషముచేతను, సాధనసంపత్తి చేతను, బ్రహ్మానుభూతిచేతను, మహర్షులైనారు.

దేవేంద్రనాథుడు సాధకుడుగా మహర్షి ఎట్లు కాగలిగెనో, వారి తపోమహత్త్వము, వారి బ్రహ్మమయజీవితము, ఎన్నివిధముల వికసించి సంపూర్ణత్వము నొందినదో, వారి "స్వీయచరిత్రము" చదివినవారికి సుబోధము కాగలదు.

వారి స్వీయచరిత్రము నెన్నిసార్లు చదివినను తృప్తి లేకున్నదనియు, చదివినకొలది గంభీరార్థప్రపూర్ణమై విలసిల్లుచున్నటుల తోచుననియు, పరమపూజ్యులు బ్రహ్మర్షి శ్రీ వేంకటరత్నం నాయుడుగారు పలుమారులు నుడివియుండిరి.

ఇట్టి మహానుభావులు ప్రసాదించిన మహోపదేశములలోని ప్రతివాక్యమును సిద్ధపురుషు లగు వారి అనుభవములను వెల్లడి చేయుచున్నది. వేదకాలమునందలి ఋషులు ఈశ్వరుని అంతర్బాహ్యములయం దెట్లు దర్శించిరో అట్లే వీరును నవయుగమునందు పరమేశ్వరుని దర్శించిన ఋషిశ్రేణ్యులు. అందువలననే వీరు మహర్షు లని జగత్ప్రసిద్ధి నొందియున్నారు. పూర్వపుఋషులు ఈశ్వరుని దర్శించినప్పుడు వారి మనోభావము లెట్లుండెనో మనము పూర్ణముగా నెరుంగజాలము.

వేలకొలది సంవత్సరములు గడచిపోవుటచే వారి భావములలో అత్యల్పాంశములు మాత్రమే మనకు నిలిచియున్నవి.

ఆధునికు లగు మహర్షిగారి భావములు మనము కొంత వఱకు గ్రహింపగలిగినయెడల పూర్వపుమహర్షులు సంవత్సరముల కొలది తపస్సు చేసి ఏ మేమి భాసించి యుండిరో, మనకు కొంతవఱకు తెలియును.

ఈ గ్రంథము ఒకసారి చదివి వేయవలసినది కాదు. ధర్మబుద్ధిగల ప్రతివారును, కొంత కాలము వఱకు, అనుదినము, రాత్రి జగ మంతయు నిద్రావస్థయం దుండి నిశ్శబ్దముగా నున్నపుడు, ఏ యున్నత ప్రదేశమునకో, ఏ సౌధోపరి భాగమునకో పోయి కూరుచుండి, ఇందలి యొక్కొక్క ఉపదేశమునందు గల భావములను తీసికొని, ఒకప్పుడు బాహ్యమునందనంతాకాశము వంకను, మఱియొకప్పుడు అంతర్ముఖముయి, తన హృదయము వంకను, మనస్సును లగ్నము చేసి, ప్రతిభావమును మననము చేసి అనుభవమునకు తెచ్చుకొనవలయును.

ఇట్లు కొంత కాలము చేయునప్పటికి ఈశ్వరసాక్షాత్కారమన నేమో కొంతవఱ కర్థమగును. ఇట్లు సాధన చేసిన కొలది అది యొక తీరని ధర్మపిపాసగా మారి జీవిత మంతయు ఈశ్వరసాక్షాత్కారము గల ధర్మజీవనముగా మారిపోవును.

నానావిధముల దుశ్చింతల యందును, సాంసారికాశాంతియందును దగుల్కొని జీవితములు తల్లడిల్లుచున్నపుడు ఒక్కొక యుపదేశమును జదువుచుండినయెడల హృదయతాపములు చల్లారగలవు. ఆత్మలు శాంతించగలవు. ఆంధ్రసోదరులీ మాధుర్యమును గ్రోలి ధన్యు లయ్యెదరుగాక !

ఈ మహోపదేశములు ప్రప్రథమమున భక్తవరేణ్యులును, స్వర్గీయులు నగు శ్రీ పాలావర్ఘు లక్ష్మీనారాయణ గారు అనువదించి కొన్ని సంవత్సరముల క్రిందట వారు ప్రచురించుచుండిన బ్రాహ్మధర్మప్రకాశిక యను పత్రికకు ననుబంధముగా ప్రచురించి యుండిరి. అవి కొన్ని మార్పులతో నిపుడీ పుస్తకరూపమున ప్రకటింపబడినవి

'శాంతినిలయగ్రంథమాల'లో ప్రథమ సంపుటముగా 'శాంతి నికేతనము' అను గ్రంథమును ప్రకటించి గ్రంథమాలలో కొందరిని చందాదారులనుగా జేర్చితిని. కారణాంతరములచే ద్వితీయసంపుటమును వెంటనే ప్రచురించి చందాదారులకు అందజేయ లేకపోయినందుకు విచారించుచున్నాను.

ద్వితీయసంపుటము ప్రచురించుటకు సహాయముచేయ నేను కోరిన వెంటనే నాయందత్యంత ప్రేమాదరములతో తమ అంగీకారమును వెలిబుచ్చి, కాగితము, అచ్చుఖర్చులు సహా పెట్టుబడి పెట్టి యీ గ్రంథమును తయారు చేయించియిచ్చిన దయార్ద్రహృదయులు శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య పంతులు గారికి నా హృదయపూర్వకవందనశతము లర్పించుచున్నాను. వారి కార్యదీక్ష, వారి దేశసేవ, వారి గ్రంథాలయ ప్రచారము, ఆంధ్రులకు సువిదితములు.

ఈ గ్రంథముద్రణమునం దనేకవిధముల సహాయము చేసినవా రందరికిని నా కృతజ్ఞతాపూర్వకవందనము లర్పించుచున్నాను.

శరణాలయము,<br>
కాకినాడ,<br>
5—4—43

ఇట్లు విన్నవించు,<br>
ప్రకాశకుడు<br>
ఆ. చలమయ్య.

# అభిప్రాయము



ఈ మహోపదేశములను గురించి మహాభక్తులగు శ్రీ విజయకృష్ణ గోస్వామిగా రిటుల నుడివియుండిరి:—

"సాయంకాల మగుసరికి మందిరమున ప్రవేశించితిని. భక్తిభాజనులు దేవేంద్రనాథ ఠాకూరుగారు స్వర్గీయ భావముతో ఉపదేశించుచుండిరి. పాపుల దుర్దశ, ఈశ్వర విశేష కారుణ్యము విషయమై వింటిని నా సమస్తశరీరము పులకాంకితమై కంపించుచుండెను. అశ్రుజలముచే హృదయము సిక్తమయ్యెను. దేవేంద్రబాబుగారిని లోలోపల ధర్మజీవితమునకు గురువుగా స్వీకరించి, భక్తిపూర్ణ హృదయముతో ప్రణమిల్లి బ్రహ్మమందిరమునుండి బయటికి వచ్చితిని."



# సమర్పణము

"పరమేశ్వరుడు —
ప్రాణమున కారామము
మనస్సున కానందము
ఆత్మకు శాంతి"
శాంతినికేతనమునందు

## మహర్షి

ధ్యానధారణములవలన, తపస్సువలన సిద్ధి పొందిన సప్తపర్ణ వృక్షచ్ఛాయ క్రింద నున్న వేదికపై పైన నుదహరించిన వాక్యములు గలవు. పరమపూజ్యులు శ్రీ శ్రీ శ్రీ పీఠికాపురాధీశ్వరులు శాంతినికేతనమునకు దయచేసినపుడు ఆ వేదికపై శిరస్సు నుంచి మహర్షి యొక్క పవిత్రసిద్ధజీవితమును స్మరించుకొని ఆ సాధకశ్రేష్ఠుని యెడల తమ యపార ప్రేమను, గౌరవమును, భక్తిని వెలిబుచ్చిరి. అట్టి సిద్ధపురుషు లగు మహర్షి యొక్కయు, ప్రేమావతారమూర్తి లగు బ్రహ్మర్షి యొక్కయు పవిత్రప్రేమధారలచే జీవితమును పునీతము గావించుకొని, 'దయాసాగరులై' తనరారుచున్న పరమపూజ్యులు శ్రీ శ్రీ శ్రీ పీఠికాపురమహారాజా వారికి "ఈ మహోపదేశము" లను భక్తిప్రపూర్ణప్రణతులతో సమర్పించు కొనుచున్నాను.

విధేయ సేవకుడు,
చలమయ్య.

# వి ష య సూ చి క

## ప్రథమ ప్రకరణము

ఓం తత్సత్

# మహర్షి మహోపదేశములు



## ౧ వ ఉపదేశము

"తం వేద్యం పురుషం వేద యథా మా వో మృత్యుః పరివ్యధాః—"

మృత్యువు మిమ్ము బాధింపకుండునుగాక! అందు కొఱకయి మీరు తెలిసికొనదగినవాడును అందరిచేతను భజింపదగినవాడును అగు ఆయమృతపురుషుని తెలిసికొనుడు, ఆయనను శరణముపొందుడు. ప్రపంచమునం దుండెడు సమస్త విధములయిన విపత్తులలోను మృత్యువు మిగిలిన యన్నిటికంటెను అత్యంతభయానక మయినది. మృత్యువుయొక్క భయంకర స్వరూపము సర్వదా మనయెదుట కనుపించుచున్నది. ఈ ప్రపంచము మృత్యువుయొక్క ప్రతిబింబమే. ఈ ప్రపంచమునందు జన్మించినవారి కెల్లను మరణము నిశ్చయము. ఎచ్చట వృద్ధియో అచ్చటనే క్షయము. వర్తమానకాలమునందలి చంచలములును అనిత్యములును అగు విషయము లన్నియు, అస్థిరము లయి నిరంతరమును మారుచుండు స్వభావము గల సమస్తకార్యములును మృత్యువునే స్మరణకు దెచ్చుచున్నవి. ఈ మృత్యుభయమునుండి, ఈ మరణబాధనుండి ఎట్లు తప్పించుకొనగలము? ఎచ్చటజూచినను మృత్యువుయొక్క ప్రతిబింబమే. కాని ఆ యమృతస్వరూపుని ఆశ్రయమును పొంది మనము

మృత్యుభయమునుండి విముక్తులము కాగలము. ప్రపంచము నందే మృత్యుభయము. ప్రపంచముయొక్క అవతలిగట్టున అమృతధామము కలదు. ఇచ్చటనే మృత్యుభయముచే భీతిల్లుచున్నాము. ఇచ్చటనే ఆ యమృతపురుషుని ఆశ్రయమునుపొంది భయరహితుల మగుచున్నాము. ఏమి ఆశ్చర్యము! మనము మృత్యుమధ్యముననే నివసించుచు ఆ యమృతపురుషుని తెలిసికొనగలుగుచున్నాము. అతిక్షుద్రుల మయినను రాజుల కెల్ల రాజును, దేవతల కెల్ల దేవుడును అగు ఆ మహామహుని ఆశ్రయమును పొందగలుగుచున్నారము. ఈ సమస్త విచిత్రఘటనల మధ్యమునుండి మన మాయన మంగళోద్దేశమును నెఱవేర్చుచున్నాము. ఈ ప్రపంచమునందు ఎన్ని పశువులు, పక్షులు, సింహములు, ఏనుగులు, జలచరములు, ఖేచరములు, ఎన్నివిధములగు జీవరాసులు కలవు! అవియన్నియు తమ సృష్టికర్తను సంరక్షకుని తెలిసికొనజాలవు. అవి యన్నియు ఆయన యనుగ్రహమువలన సుఖముగా జీవితమును గడుపుచున్నవి. కాని ఆయన యనుగ్రహమును తెలిసికొనజాలవు. అవి ఆయన కార్యములను నెరవేర్చుచున్నవి. కాని ఆయన యాజ్ఞానుసారముగా తాము తమ కర్తవ్యముల నెఱవేర్చుచున్నా మని అవి యెఱుగవు. అవి తెలియకనే ఆయన యిచ్ఛానుసారముగా ప్రవర్తించుచున్నవి. తెలిసి, విని, గ్రహించి తన యిచ్ఛను ఆయన మంగళాభిప్రాయముతో నేకీభవింపజేయు ప్రశస్తమగు ఉన్నతాధికారము మనుష్యుని కొక్కనికే కలదు. మనుష్యు డొక్కడే మృత్యు

మధ్యమున నుండియు ఆ యమృతపురుషుని పొంద గలుగు చున్నాడు. ఈ భయానకస్థానమునం దుండియు ఆ యభయ ప్రదాతయొక్క ఆశ్రయమును పొందగలుగుచున్నాడు. ఇచ్చ టనే ఆయనతోడి సంబంధమును స్థాపించుకొను చున్నాడు. అమృతుని పుత్రుడయి అమృతుని ఆశ్రయమును పొంది నిర్భయుడగుచున్నాడు. ఆయనమీదనే భారమును వేసినయెడల మనయందు నూతనజీవనసంచారము కలుగును. నవజీవనము కలిగినయెడల మన ఆత్మానందము చేనివలనను వినష్టము కాజా లదు. మన శరీరము, మనస్సు బడలియుండవచ్చును, విపత్తులు వచ్చి అలముకొనవచ్చును, రోగములు బాధించవచ్చును, కాని, ఎన్ని కష్టములు తటస్థించినను ఆత్మానందము రవ్వంత యయినను తఱిగిపోదు. ఆ యమృతనికేతనుని ఆశ్రయమును పొందినయెడల భయానకములలో నెల్ల భయానకమగు మృత్యువు సహితము మనలను భయపెట్టజాలదు.

కనుకనే ఈ ఘోరతరప్రపంచమునం దుండియు ఈశ్వ రుని పరిత్యజింపకుడు. "మాహం బ్రహ్మ నిరాకుర్యాం మా మా బ్రహ్మ నిరాకరోదనిరాకరణ మస్తు" బ్రహ్మము నన్ను విడిచిపెట్టడు, నేను ఆయనను విడిచి పెట్టకుందునుగాక! ఆయనను విడిచి జీవనయాత్రను నిర్వహింప దలంపకుందునుగాక! ఎవనినుండి మనము సకలభోగములను, సకలసుఖములను పొందుచున్నామో, క్షణకాలమయినను ఎవడు మనలను విస్మ రింపడో, ఆయనను నేను పరిత్యజింపకుందును గాక! ఆయన మనలను పరిత్యజించినయెడల మన కెట్టి దశ సంప్రాప్త

మగునో ఒకసారి భావించి చూడుము. మన మెక్కడ నుండి యుందుము? మన మిదివరకే వినాశమును పొందియుందుము. "కో హ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్ యదేష ఆకాశ ఆనందో న స్యాత్." ఈ యానందస్వరూపుడగు పరబ్రహ్మమే ఆకాశము నందు నిండియుండి మనతో గూడ తోడునీడవలె నుండని యెడల, ఎవరు శరీరవ్యాపారములను చేయగలిగియుందురు! ఎవరు జీవింపగలిగియుందురు? ఆయనయే అందరికి ఆనంద మును పంచి పెట్టుచున్నాడు. భూపతన మయినది మొదలు మనము ఎవని ప్రేమచే లాలించి పాలింపబడుచున్నామో, అనంతకాలమువరకు మనము ఎవని ఆశ్రయమం దుందుమని ఆశించుచున్నామో, ఆయనను మనము పరిత్యజింతుమా? ఆయన మనలను విస్మరింపడు. మన మాయనను విస్మరింప కుందుముగాక! ఆయన మనవలన నెన్నడును విడువబడకుండును గాక! ఎవడు మనకొఱకు ధర్మమును అర్థమును సుఖమును నిరం తరమును వేర్పరణచేయుచున్నాడో ఆయన నెట్లు పరిత్యజింప గలము? అట్లు చేయుట మనుష్యధర్మమా? ఆయన నెందుకు పరిత్యజింపవలెను? అందువలన మనకు మంగళ మగునా? ఈ ప్రపంచమున మన కెట్టి బాధలును లేవా? ఎట్టి విఘ్నములును లేవా? మనశరీరము కృశించుటలేదా? మనస్సు వైకల్యము నొందుటలేదా? ఆయన యాశ్రయమును పొందక మనము జీవింపగలుగుదుమా? మన కిచ్చట ఏ భయమును లేదా? ఆ యభయప్రదుని యాశ్రయమును పొందవలదా? మన మిచ్చట పాపములచే తపించుచుండ లేదా! మన మా పతితపావనుని

శరణాపన్నులము కావలదా? తపించుచున్న మన హృదయము లను ఆయన గాక మరి యెవ్వరు చల్లబరుపగలరు? భయాకీర్ణ మగు ఈ ప్రపంచమునందు మనము భీతచిత్తుల మయినయెడల మరెవరు మనకు అభయప్రదాన మియ్యగలరు? కేవలము మోహ మొక్కటియే వచ్చి మనలను ఆయననుండి దూర ముగా విడదీయుచున్నది. ఆయనను విడిచినయెడల మన కే మాత్రమయినను మంగళము కలుగగలదా? ఆయనను విడిచిన యెడల మనధర్మకార్యము లన్నియు స్వార్థపరత్వమును సూచిం చును. మనసుఖసంభోగములు కృతఘ్నతను వెల్లడిచేయును. ఇక్కడ ఈ యుపదేశమును విన్నవా రందరును కేవల శ్రవణ మాత్రముచేతనే సంతుష్టు లయినయెడల, ఇక్కడకు వచ్చుట వృధాశ్రమయగును. ఇండ్లకు బోయి పరమేశ్వరుని మరచినయెడల వారి కేమిలాభము? వారి హృదయము విశాలము కాని యెడలను, వారి హృదయములయందు ఈశ్వరానురాగము ప్రజ్వలింపనియెడలను, విషయసుఖములయందు ఆయనను మర చిన యెడలను ఇక్కడకు వచ్చిన ప్రయోజన మేమి? వా రిచ్చ టకు కేవలము చదువుటకును వినుటకును మాత్రమే వచ్చి నారా? పరబ్రహ్మముతోడి తమకు గల సంబంధమును మరింత దృఢముగా చేసికొనుటకు గాదా? సుఖము లనుభ వించునప్పుడు ఆయన యనుగ్రహమును విస్మరించినయెడలను, అన్నపానములచే పుష్టినందుచు ఆ యన్నదాతను మఱచి పోయినయెడలను, వా రేమి చేయగలరు? ఆ పవిత్రజలనుండి విచ్ఛిన్నమయిన యెడల, మ రెచ్చటనుండి పవిత్రతను పొంద

గలుగుదురు? ధర్మాశ్రయుని విడిచి తా మెట్లు ధార్మికులు కాగలరు? ఆ మంగళాలయుని విడిచి తాము భద్రనామమున కెట్లర్హు లగుదురు. ఈ క్షణమునుండియు ఆయనయందు ఆత్మ సమర్పణము చేయుడు. ఈ క్షణమందే మీరు నవజీవనమును పొందుదురు.

ఆయన నెట్లుపాసింపవలయునో తెలిసికొనుటకు ఉపదేశము కావలయునా? ప్రాణము, ధనము, విద్య, బుద్ధి మొదలగు సమస్త అమూల్యపదార్థములను ఎవరినుండి పొందితిమో ఆయనయెడల కృతజ్ఞత చూపుటకు ఉపదేశము కావలెనా? జన్మమెత్తినది మొదలు ఎవని ప్రసాదమును అనుభవించుచున్నామో, అనంతకాలమువరకు ఎవని యాశ్రయము నుందుమో, ఆయన నుపాసించుటకు ఉపదేశము కావలయునా? పాపములచే తపించుచుండు మనము ఆయన యాశ్రయమును పొంది మనోమాలిన్యమును పోగొట్టుకొనవలదా? గురువుల కెల్ల గురువును తండ్రుల కెల్ల తండ్రియు అగు ఆ పరమపురుషుని ఆరాధింపవలదా? ధర్మబల ముపార్జనచేయుటకు ఆయనసాన్నిధ్యమును పొంది ప్రార్థింపవలదా? మన స్వభావము వికారము నొందనియెడల ఆయన నుపాసించుట యందు మనకు అశ్రద్ధ కలుగదు. ఆత్మను స్వస్వభావము నొందనిండు. నేటిరాత్రి మొదలు ఆయన నుపాసించుట కారంభింపుడు. కేవల శ్రవణమువలన నెంత మాత్రమును ప్రయోజనము లేదు. ఆయనకు శరణాపన్నులమే కానియెడల మన దేశమునకు మంగళ మెక్కడిది? ఏ దేశమునందు ఈశ్వ

రాధన లేదో, ఏ కుటుంబమధ్యమున ఆయన పవిత్రనామ ముచ్చరింపబడదో, ఏ హృదయమునందు ఆయనకు పవిత్ర ఆసనము వేయబడియుండలేదో, ఆ శూన్యదేశము, ఆ శూన్య కుటుంబము, ఆ శూన్యహృదయము కేవలము దుఃఖాలయము. నేడు మొదలు ఆయన నాశ్రయింపుడు. ఆయన యుపాసన నారంభింపుడు. మీకు వినుటకు ఉపాయములు లేకపోలేదు. మీరు జ్ఞానముద్వారా అనేకసంగతులను తెలిసికొనియుంటిరి. జ్ఞానమునందును కార్యములయందును విశ్వాసమునందును ఆచరణమునందును సామంజస్య మేల లేదు? మీరు నేడు మొదలు కొని ఆయన యుపాసన నారంభింపుడు. అచిరకాలములోనే దాని ఫలమును పొందుదురు. ఆయన ప్రసాదమువలన మీ జీవితమునందు సమస్త సుఖములను భోగించుచున్నారు. కృతజ్ఞతాభావముతో ఆయనకు నమస్కరింపుడు. భయవిహ్వలు లయినప్పుడు, కష్టములు తటస్థించినప్పుడు, ఆయన యాశ్రయమును పొందుడు. తల్లియొడిలో జేరి శిశువు ఎట్లు నిర్భయముగా నుండునో అట్లే మీరును భయరహితు లగుదురు. పాపముచే తపించుచున్నయెడల పశ్చాత్తప్త హృదయులయి కన్నీటిధారలతో ఆయనకు శరణాపన్నులు కండు. ఆయన శరణాగతవత్సలుడు. ఆయన మిమ్ము పాపమునుండి విముక్తి నొందించును. ఎవడు జగదీశ్వరుడో, ఎవడు రాజాధిరాజో, ఎవడు దేవతలకు దేవతయో, ఆయన యారాధనము చేయుడు. విన్నను, తెలిసికొన్నను ఎవరికి ఉపాసనయందు ప్రవృత్తి కలుగదో వారు తమ్మును పవిత్రులనుగా చేసికొనుడు. ఈశ్వ

రుని యెదుట మీ హృదయములను విప్పి ప్రార్థింపుడు. ప్రయత్నింపుడు. తప్పక ఆయన ప్రసాదము ననుభవింతురు. 'బ్రహ్మము మనలను విడువదు. మన మాయనను విడువకుందుము గాక.' ఈ వాక్యార్థమును హృద్గతము చేసికొనుడు.

'ఓమ్. ఏకమేవాద్వితీయమ్.'

---

ఓమ్ తత్సత్.

# మహర్షి మహోపదేశములు



## ౨వ ఉపదేశము

"ఆనన్దరూప మమృతం యద్విభాతి—"

భూలోకమునందు, ద్యులోకమునందు, ఆకాశమునందు, అంతరిక్షమునందు, ఉషఃకాలమునందు, సంధ్యాకాలము నందు, భక్తిశ్రద్ధలుగల తదేకనిష్ఠులగు ధీరులు స్వప్రకాశుడును ఆనందస్వరూపుడును అమృతస్వరూపుడును అగు పరమేశ్వరుని సమస్త ప్రదేశములయందును చూడగలరు. ఉషోదయమయిన వెంటవెంటనే సూర్యుడుదయమయి రాత్రియంతయు అచేతనములయి పడియున్న సమస్తప్రాణులను ఎప్పుడు సచేతనములుగా చేయునో, రూపహీనములై పడియున్న సమస్తపదార్థములను రూపవంతములుగా జేయునో, అప్పుడు

ఆ జ్యోతిష్మంతుడగు సూర్యునిమధ్యమునసే, ప్రకాశవంతు డును, వరింపబడదగిన వాడును అగు పరమపురుషుని వారు దర్శింపగలరు. ఉషోదయ మయిన వెంటవెంటనే మన హృద యాకాశమునందు ఆయన ప్రకాశమును చూడగలము. రాత్రి యంతయు అంధకారావృత మయి యున్న జగత్తు ఉదయకాలముననే పునఃప్రకాశిత మయిన వెంట వెంటనే, ఎవడు సూర్యునియొక్క అంతరాత్మయో; ఎవడు మనయొక్క అంతరాత్మయో, సకలభూతములయొక్క అంతరాత్మయో ఆ మహాపురుషుడు కూడ ప్రకాశించును. తరుణసూర్యకిరణ ములయందు జ్యోతులకెల్ల జ్యోతియగు ఆయన ప్రకాశమును చూడవచ్చును. ఉషఃకాలసౌందర్యమునందు ఆ సౌందర్యము నకు సౌందర్యము నిచ్చెడు సుందరపురుషుని చూడవచ్చును. ప్రాతఃకాలమున మనము నేత్రములను తెఱచుటతోడనే, ఆయన నేత్రము మనమీద అదివరకే స్థాపితమయి యున్నదని మనము తెలిసికొందుము. ఎక్కడ చూచినను ఆయన మహి మయే. మనకు ఆయన దర్శనము చేయవలయునను వ్యాకులతే ఉన్నయెడల, ఆయనను సరళహృదయముతో, నిష్కపట చిత్తముతో ప్రార్థించినయెడల, ఈశ్వరుడు వినా మరి దేని వలనను మన క్షుత్పిపాసలు శాంతింపనియెడల, మనలోపలను వెలుపలను, దూరమునందును సమీపమునందును, సకలస్థాన ములయందును, ఆయన ప్రకాశము కానవచ్చును. కాని అపవిత్రవిషయములలో మునిగియుంటిమేని, ఆత్మను అచేత నముగా నిస్సారముగా చేసివేసితిమేని, ఈశ్వరసాక్షాత్కారము

కొఱకు మన మనోద్వారమును తెఱచి యుంచకపోతిమేని, అప్పుడు జనశూన్యములగు కాననములకు పోయినను, జనాకీర్ణములగు పట్టణములకు పోయినను, తీర్థస్థానములకు పోయినను, దేవమందిరములకు పోయినను, ఎచ్చటను ఆయన దర్శనమును చేయజాలము. ఎప్పుడు మనలను పవిత్రముగా చేసికొందుమో, ఈశ్వరునియెదుట మన హృదయద్వారమును తెఱచియుంతుమో, తృష్ణార్తులమయి ఆయనను అన్వేషింతుమో, అప్పుడు గిరిగుహాలయందును, ఉద్యానకాననములయందును, నిర్జనసజన ప్రదేశములయందును, సకల స్థానములయందును ఆయన ఆవిర్భావమును దర్శింపగలము. సూర్యు నడుగుదము, 'ఆయన యెక్కడ నున్నా'డని. అప్పుడు సూర్యుడు మన కాయనను చూపించును. నిర్జనవనమునం దుండెడు వృక్షము నడుగుదము, 'ఆయన యెక్కడ నున్నా'డని. అప్పుడు, వృక్షము ఆయనను చూపించును. అప్పుడు, "స ఏవాధస్తాత్, స ఉపరిష్టాత్, స పశ్చాత్, స పురస్తాత్, స దక్షిణతః, స ఉత్తరతః" అను ఋషివాక్యము యొక్క అర్థమును గ్రహింపగలము. అధోలోకములయందును ఆయనయే, ఊర్ధ్వలోకములయందును ఆయనయే, ఎదుటను ఆయనయే, వెనుకను ఆయనయే. దక్షిణపార్శ్వము నందు ఆయనయే, వామపార్శ్వమునందు ఆయనయే. భూలోకమునందును ఆయన మహిమయే, ద్యులోకమునందును ఆయన మహిమయే. ఆయన, ఆనందస్వరూపుడయి, అమృతస్వరూపుడయి సర్వత్ర ప్రకాశించుచున్నాడు. వజ్రకఠిన మగు మన హృదయ

కవాటమును మనము బంధించుకొని యుండుటచేతనే, జ్యోతుల కెల్ల జ్యోతియయిన ఆయన దివ్యప్రకాశమును చూడ జాలము. సూర్యోదయ శోభామధ్యమున ఆయన యావిర్భావము. సూర్యాస్తమయ శోభామధ్యమున ఆయన యావిర్భావము, ఉషఃకాలకాంతులయందు ఆయన సుందరమూర్తి ఎట్లు ప్రకాశించుచున్నదో, సంధ్యాకాలప్రభలయందును ఆయన ప్రసన్నమూర్తి ప్రకాశించుచున్నది. ఎప్పుడు రాత్రి నీడలు వచ్చి వసుంధరామండలమును శాంతి విశ్రామముల యందు ముంచివేయునో, ఎప్పుడు సుధాకరుడు సహస్ర సహస్ర కిరణములతో నుదయమయి, జ్యోత్స్నసుధను వర్షించునో, ఎప్పుడు అసంఖ్యాకము లగు నక్షత్రరాసులు నిద్రా పరవశమయియున్న భూమండలముపయిన, రాత్రి నాలుగు జాములును గస్తీ తిరుగుచున్న తలారులో యనునట్లుగా, నీలాకాశమునందు రత్నప్రభలతో ప్రకాశించుచుండునో, అప్పుడు వీనియన్నిటిమధ్యను ఎవని ప్రకాశమును చూడగలుగుదుము! "య శ్చన్ద్రతారకే తిష్ఠ న్, చన్ద్రతారకాదంతరో, యం చంద్రతారకం న వేద, యస్య చంద్రతారకం శరీరం, య శ్చన్ద్రతారక మంతరో యమయతి."— ఎవడు చంద్రతారకలలో నుండి చంద్రతారకలకు అంతరాత్మయై, చంద్రతారకల యొక్క గమనాదిక్రియాకలాపములను నియమించుచున్నాడో, అయినను చంద్రతారకలు ఎవని నెఱుగవో, చంద్రతారకలు ఎవనియొక్క శరీరమో, అయినను

చంద్రతారకలు ఎవనిని తెలిసికొనజాలవో, ఆయన ప్రకాశ మునే చూడగలుగుచున్నాము.

ఉషఃకాలమునందు ఆ యానంద స్వరూపమే, అమృత స్వరూపమే, ప్రదోషకాలమునందు ఆ యానందస్వరూపమే, అమృత స్వరూపమే, నిశాకాలమునందు ఆ యానందస్వరూపమే, అమృత స్వరూపమే, ప్రకాశించుచున్నది. కేవలము ఈ సమస్తవస్తువులలో మాత్రమే ఆయన ఆవిర్భావము కలదా? మనుష్యునియందు ఆయన ఆవిర్భావము లేదా? ఉషఃకాలసౌందర్యము, సంధ్యాకాల సౌందర్యము, చంద్ర తారకల సౌందర్యము, వీని యన్నిటి యందును, ఆ సత్య సుందర మంగళస్వరూపుని యొక్క శోభను దర్శింపగలిగిన యెడల, మనుష్యునియొక్క ముఖలక్ష్మియందు ఆయన యావి ర్భావమును మరింత స్పష్టముగా దర్శింపవచ్చును. మనుష్యుని యందే ఆయన యావిర్భావమును మనము చూడలేని యెడల మరెక్కడ ఆయనను దర్శింపగలము? మృత్యుస్వరూ పిణియగు కేవలజడపదార్థమధ్యముననే ఆయనప్రకాశ మును చూడగలమా? కేవలము పశుప్రకృతియందే ఆయన ఆవిర్భావమును దర్శింపగలమా? మానవుని ముఖసంపద యందు ఆయన సౌందర్యమును దర్శింపలేమా? ధర్మాత్ముల యొక్క అనురాగసురభితముఖమండలమునందు ఆయన దివ్యజ్యోతిని చూడలేమా? ఈశ్వరభక్తుడును, ప్రసన్నహృద యుడును అగు పుణ్యాత్ముడు, తనకు ప్రియతముడయిన ఈశ్వ రునికొరకు ఎప్పుడు ప్రేమాశ్రువులను విడుచునో, అప్పుడు ఆ

పుణ్యపురుషుని ఉజ్జ్వలమూర్తియందు ఆయనప్రకాశమునుఆయన యావిర్భావమును చూడలేమా? భక్తులయొక్క హృదయార విందములయందు, ప్రసన్నమూర్తులయందు, వికసిత ముఖ మండలములయందు, ఎట్టి అద్భుతజనకమగు ఈశ్వర ప్రకాశ మును చూడగలమో, అట్టి ప్రకాశమును, మహోన్నతము లగు పర్వతరాజములయందు గాని, మహాగంభీరములగు సముద్రములయందుగాని, దూరాతిదూరములును మహాతేజో రాసులును అగు సూర్యాదినక్షత్రమండలములయందుగాని, చూడజాలము. ఈశ్వర ప్రేమికులయొక్క వ్రతములు అసి ధారావ్రతములు. వారి ధర్మసాధన ఎంత కఠోరము! వారి హృద యము ఎంతకోమలము! ఎంత పవిత్రము! ఆ యమృత పురుషునియొక్క వాసస్థలములు, క్రీడారంగములు అగు ధర్మ సాధకుల హృదయములు, ఎంత శీతలములు, ఎంతపవిత్రములు! వారియందు ఆయన యావిర్భావము ఎంత సుస్పష్టము! అట్టి సుందరదృశ్యము మరెచ్చట గలదు? ఆకాశమునందు లేదు. పృథివియందు లేదు. సముద్రమునందు లేదు. బ్రహ్మపరా యణులును పుణ్యాత్ములును అగు సాధుపుంగవులయొక్క ముఖ సంపదయందు ఆయన ఆనందస్వరూపుడుగ, అమృత స్వరూ పుడుగ ప్రకాశించుచున్నాడు. ఎచ్చట, ఏయుపాసనాస్థలము నందు పుణ్యాత్ము లందరును ఏకాసీనులయి ఆయనను ఆరాధించు చున్నారో, ఆ పవిత్రస్థానమునందు ఆయన ఆనందస్వరూపు డుగ, అమృత స్వరూపుడుగ, ప్రకాశించుచున్నాడు. ఈపవిత్ర బ్రాహ్మసమాజమునందు మనకు ప్రియతము డగు పరమాత్మ

యొక్క ఆవిర్భావము కలదు. ఈ బ్రహ్మమందిరముయొక్క తేజఃకిరణములయందు ఆయన పవిత్రజ్యోతి ప్రకాశించుచున్నది. ప్రతిపురుషుని హృదయమునందును ఆయన మరింత ఉజ్జ్వలరూపముగా, మఱింత ప్రసన్న భావముతో ప్రకాశించుచున్నాడు. ఎప్పుడు ఇచ్చట ఆయనయొక్క దేదీప్యమానమగు ఆవిర్భావమును చూచుచున్నామో మరియు ఆయనయొక్క ప్రసన్నమూర్తిని మన హృదయములయందు అంతకంటెను గాఢముగా, సుస్పష్టముగా అనుభవించుచున్నామో, అప్పుడు మన మందరము కలసి ఆయన పవిత్రపాదారవిందములయందు ప్రీతిపుష్పములను అర్పింతము. ఆ పరమేశ్వరుని నిర్వ్యాజ కరుణాకటాక్షముచేత, మనకు లభించిన ఈ దుర్లభ మానవ జన్మమును కృతార్థము గావించుకొందము.

ఓమ్, ఏకమేవాద్వితీయమ్.

---

ఓమ్ తత్సత్.

# మహర్షి మహోపదేశములు



## ౩ వ ఉపదేశము

"త మాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరాః,
తేషాం శాన్తిః శాశ్వతీ, నేతరేషాం."

సచ్చిదానంద స్వరూపుడగు పరబ్రహ్మమును తమలో నున్నవానినిగా ఏ ధీరులు చూతురో, వారికే శాశ్వతమయిన

శాంతి కలుగును. ఇతరులకు కలుగదు. అంతరమునందు పరమేశ్వరుని దర్శింపక, బాహ్యమునందు సూర్యాదినక్షత్రములయందు, భూమ్యాది గ్రహములయందు, చంద్రాది ఉపగ్రహములయందు, ప్రకృతియందలి మహత్తమమయిన వస్తువులయందు, మహాపురుషులయందు మాత్రమే, పరమేశ్వరుని దర్శించువారికి తాత్కాలికశాంతి కలిగిన కలుగును గాక! కాని పరమేశ్వరుని తమ హృదయములయందు దర్శింపగల ధీరులకే శాశ్వతమయిన మనశ్శాంతి లభ్యమగును. ఇతరులకు ఆ పరమపదము అలభ్యము.

పరమేశ్వరుడు మనలోపల నుండు, ప్రాణము, బుద్ధి, మనస్సు మొదలయిన వానికంటెనుగూడ లోపల నుండువాడు. అతడు అంతరతముడు. మనకు ప్రియులగు పుత్రమిత్ర కళత్రాదుల కంటెను ప్రియమయినవాడు. అట్టి, అంతరతముడును, ప్రియతముడును అయిన పరమేశ్వరుడు మాకు దూరముగా నుండునుగాక, మే మాయనకు దూరముగా నుందుముగాక అను కోరిక ఎన్నడయినను మనము కోరదగినదా? అట్టి ప్రార్థన ఎప్పుడయినను ప్రార్థనీయమా? ఆయన సకల ప్రాణులకును ప్రాణస్వరూపుడు, జ్ఞానప్రదాత, పరమ మిత్రుడు, సమస్త సుఖసంధాయకుడు. నేను దేనిని దేనిని 'నాది' అని చెప్పుచున్నానో అదంతయు ఆయన ఇచ్చినదే. నాశరీర మాయనది, నా ప్రాణ మాయనది. నా ఆత్మ ఆయనది. ఇక నాకేమి మిగిలినది? 'నేను' అనునది మిగిలినది. మనకు ఆయన ఇయ్యనిది ఒకటియును లేదు. ఆయన కరుణను మనము అజస్రము భోగించు

చున్నాము. ఆయన మనపయిని కృపావర్షము కురిపించని కాలము క్షణమయినను లేదు. ఇట్లుండగా, 'ఆయనకు నేను దూరముగా నుందునుగాక! నాకు ఆయన దూరముగానుండును గాక!' యను నిట్టి యభిలాష ఎప్పుడయినను ఎవరి కయినను కలుగవచ్చునా? మనుష్యజన్మ మెత్తిన ఎవని హృదయము నందయినను ఇట్టి కోరిక ఉదయింపవచ్చునా? ఒకడు ఘోర మయిన పాపములచే కళంకిత మయిన హృదయము కలవాడను అగును గాక! అపవిత్రవిషయములయందు నిమగ్నమయిన చిత్తవృత్తులు కలవా డయినను అగునుగాక? అయినప్పటికి అట్టి పాపియొక్క ఆత్మ సహితము 'ఈశ్వరునకు నేను దూరముగా నుందును గాక, ఈశ్వరుడు నాకు దూరముగా నుండునుగాక!' అని యిచ్ఛయించునంత నిస్సారము కాగలదా? హృదయాంతరాళమునందు ఈశ్వరకాంక్ష సంపూర్ణముగ చల్లారునంత దురవస్థ మనుష్యునకు ఎన్నడయినను తటస్థింపగలదా? ఒకడు ఘోరపాతకములు చేసిచేసి భయకంపితహృదయు డయి ఆయనయొక్క రుద్రమూర్తిని దర్శించుటకు జంకవచ్చును. ఆయన 'ఆర్తులకు కరుణా సముద్రుడు, పాపులకు భీకరుడు' అన్నమాట కొంతవరకు నిజమే. పాపియొక్క దృష్టికి ఆయన వజ్రాయుధమును చేతఁబూని భయానకముల కెల్లను భయానకుడయి, విశ్వము నంతను తన తీక్ష్ణదృష్టిచేతనే, నిమిషమాత్రములో భస్మీపటలము చేయునేమో అనునంత భయంకర స్వరూపముతో కనపడవచ్చును. నిజమే, అట్టి భయంకరస్వరూపమును చూచు

టకు ఎవరు సాహసింపగలరు ? అయ్యో! పాపము, అట్టి మహాపాపి కంపమాన హృదయముతో ఒక్కొకసారి, 'నేను ఈశ్వరునకు దూరముగా నుందును గాక, ఈశ్వరుడు నాకు దూరముగా నుండును గాక !' అని యనుకొనవచ్చును. కాని, అట్టి యిచ్ఛ అతని హృదయమునందు జనించిన వెంటనే, దానితో పాటు మేఘగంభీరభాషణములతో 'నీ వెక్కడికి పారిపోయెదవు ? నిన్ను ఇంకెవ్వరు రక్షింపగలరు. జగదీశ్వరుని ఆశ్రియమును విడిచి, ఇంకెవ్వరి యాశ్రయమును పొందగలవు?' అను దివ్యవాణి ప్రతిధ్వనింపదా ? సోదరా! నీవు పాపముచే భీతచిత్తుడ వయితివా ? అట్లయిన యెడల ఆ జగదేకపితయొక్క శరణ్యమును పొందుము. ఆయన కరుణాసముద్రుడు, పతిత పావనుడు,ఆయన వలన సమస్తపాపములనుండియు విముక్తుడ వగుటకు అభిలషింపుము. ఆయన సన్నిధిని చేరి, నీ తప్పిద ముల నొప్పుకొని ఏడ్వుము. నీ కన్నీటిధారలతో ఆయన పాదపద్మములకు అభిషేకము చేయుము. ఆయనతో వియో గము నొంది, ఆయనకు దూరమయిపోయిన నీ కేమి లాభము? ఒకవేళ పోవలె ననుకొన్నను, ఎట్టి పాపాత్ముడయినను ఆయ నకు దూరముగా పోజాలడు. మహోన్నతములగు పర్వత శృంగముల నధిరోహించునుగాక, గిరిగుహాంతరాళముల యందు దాగియుండును గాక, మహారణ్యమధ్యమున ప్రవేశిం చును గాక, మహాసముద్రమధ్యమున నణగియుండునుగాక ! ఎక్కడికి పోయినను సరే, పాపి పరమేశ్వరుని రాజ్యమునుండి పారిపోగలడా! ఇహలోకరాజ్య మాయనదే. పరలోక రాజ్య

మాయనదే. ఎచ్చటకు పోయినను సరే - ఆయనను శరణు నొందని యెడల హృదయాంతరాళమున నుండి వేపుకొని తిను చుండెడు భయమునుండి విముక్తుడు కాజాలడు. కావున, సోదరా! 'పాపము చేసితిని గదా'యని ఆయనకు దూరముగా బోవలయునని ప్రయత్నింపకుము. వ్యాకుల హృదయముతో, శోకాతురచిత్తముతో, ఆయనను సమీపించి కన్నీరు ఓడిక కట్టునట్లు ఆ కరుణాసముద్రుని ప్రార్థింపుము. 'ప్రభో! నేను నిన్ను అవమానించితిని. నా అవజ్ఞను క్షమింపుము. నన్ను గ్రహింపుము. నా హృదయము అజ్ఞానాంధకారముచే ఆవృతమయి యున్నది. నీవు జ్యోతుల కెల్లను జ్యోతివి. నా హృదయమునందు నీ జ్ఞానజ్యోతిని వెలిగించి నా యజ్ఞానమును పోద్రోలుము. నీవు నేను చేసిన పాపములకయి నన్ను సహస్ర విధముల దండింపుము. ఆ దండనను అనుభవించుటకు నేను సంసిద్ధుడనయి యున్నాను. కాని, నా హృదయమును పీల్చి పిప్పి చేయుచున్న కుటిలపాపములనుండి నన్ను విముక్తి నొందింపుము. నీ రుద్రావతారమునుజూచి నేను భరింపజాలను. నీ ప్రసన్న ముఖమును నాకు ప్రదర్శించి నన్ను నీదాసునిగా జేసుకొనుమని శోకమనస్కుడవయి వ్యాకులచిత్తముతో కృపాభిక్ష కొరకు ఆయనను యాచించిన యెడల, కరుణారసపూరితుడగు తండ్రి నీపయిన అవిరళధారగా కృపావర్షమును వర్షించితీరును. పాపానలముచే దహింపబడుచున్న నీ హృదయమునుచల్లబఱచి తీరును. పాపముచేయనివారెవరు? —ఈశ్వరుని శరణ్యమును వేడుటకుఇష్టపడనివారుఈశ్వరుడు లేకపోయిన, పరలోకము లేక

పోయిన ఎంత బాగుండును! అనుకొని దానికి అనురూపములయిన సిద్ధాంతములను చేసుకొని మనస్సును సమాధానపరచు కొనుటకు ప్రయత్నింతురు. అట్టి ఆత్మఘాతుకులు, 'ఈశ్వరుడు మాకు దూరముగా నుండునుగాక, మేము ఈశ్వరునికి దూరముగా నుందుము గాక!' అని కోరుకొందురు. భయమునకును మోహమునకును వశులయి, వారు తమ హృదయములందు అనేక కుటిల సంశయములకు స్థాన మిత్తురు. వారి దశ ఎంత దుర్దశ! వా రెంత కృపాపాత్రులు! వారి స్థితి ఎంత జాలికర మయినది? 'ఈశ్వరుడు లేడు' అని వారి హృదయము చెప్ప సాహసింపదు. అయినను వారు బధిరప్రాయు లయి వారి హృదయముల యందు ధ్వనించుచున్న దివ్యవాణిని విననొల్లరు. 'అంతర్బాహ్యములయందుండి పరమేశ్వరుడు పాపపుణ్యములను చూచుచునేయున్నాడు. అతడు రెప్పపాటు లేనివాడు, నిర్నిద్రుడు, చిర జాగృతుడు, అని వారు ప్రత్యక్షముగ చూచుచుండియు, అంధప్రాయు లయి యున్నారు. వారు చెవు లున్నను వినుట లేదు. కన్నులున్నను చూచుటలేదు. వారి హృదయమునందు భయము పొడముచున్నది. కాని, పాపశిక్షకు డగు పరమేశ్వరునికి భయపడనొల్లక మొండికెత్తి జూచుచున్నారు. పరమపిత వారిని 'రండు, నా వద్దకు రండు, మీ కష్టములను నా దగ్గర చెప్పుకొనుడు. నేను మిమ్ము రక్షించెదను. ముందు వెనుకలు చూడకుడు. ఉన్నపాటున నా ఒడిలో వచ్చి కూర్చుండుడు' అని ఆహ్వానించు చున్నాడు. వారు ఆ పిలుపును పెడచెవిని పెట్టుచున్నారు వినిపించు కొనుటలేదు. సోదరులారా, మీ

రును అట్లే ఆయన శిక్షించు నను భయముచే వెనుక వెనుకకు తగ్గుచున్నారా? ఎన్నటికిని అట్లు చేయకుడు. ఆయన మనకు చేయు సమస్తశిక్షయు మనలను పట్టి పీడించుకొని తినుచున్న పాపరోగములకు సిద్ధౌషధము సుమండీ. ఈ క్షణమునుండియు ఆయనకు శరణాపన్నులు కండు. సమస్త బాధలనుండియు విముక్తు లగుదురు, సమస్తభయమునుండియు పరిత్రాణము నొందుదురు. మీ యాత్మ మరల నవజీవనమును పొంది పుణ్య జ్యోతియొక్క స్పర్శచే జ్యోతిష్మంత మగును. ఈశ్వరవాణిచే మనస్సు ఆకర్షింపబడును. ఆ పవిత్రస్వరూపు డగు పరమపిత సహవాసము కు యోగ్యు లగుదురు. సోదరా! ఎప్పుడు మరణ కాలము సన్నిహితమగునో, ఎప్పుడు ఈశ్వర సమక్షమున నిలువ బడవలసిన దినము ఉపస్థితమగునో, ఆ దినమును గురించి క్షణకాలము యోచింపుము. అప్పుడు కొందరు ఇట్లనుకొన వచ్చును. 'నే నొకప్పుడు ఈశ్వరునికి దూరముగా నుండి దుష్ప థమునందు సంచరించుచుంటిని. అప్పుడు నేను ఉద్ధరింప బడుదు నను ఆశ, నా కెంతమాత్రము లేకపోయెను. అప్పుడు ఈశ్వ రుడే నాపయి కరుణించెను. ఆయన యనుగ్రహము వలననే, నేను దుష్పథమునుండి తొలగి ఆయన సాన్నిధ్యమును పొంద గలిగితిని. అట్లు ఆయన నాపయి కృప చూపనియెడల నే నేమయి యుందునో!' మరికొంద రిట్లనుకొనవచ్చును, 'ఇప్పుడు నాపని ఏ మగును, నా కెవరు దిక్కు, ఈ శోకభారము నెట్లు సహింపగలుగుదును? ఈ మనోవేదన నెట్లు భరింతును? నే నెక్కడికి పోదును? నాగతి ఏమగును? అయ్యో, నా జీవితకాల

మంతయు, నా మరణానంతరజీవితమును గురించి, కొంచెమయి నను ఆలోచించనైతిని గదా! ఎన్నిసార్లు నేను సన్మార్గమున నడుచుటకు పరమేశ్వరుడు నా కవకాశము లిచ్చెను? వాని నన్నిటిని నేను నిర్లక్ష్యము చేసితిని, నిరసించితిని. ఈశ్వరుడు న న్నెన్నిసార్లు మేలుకొలిపి యుండెను? ఆయన వాణిని నేను లక్ష్యపెట్టనయితిని. ఆయన యాదేశమును పాలించనయితిని. ఇప్పుడు నాకు రక్షకు లెవ్వరు!' అని పరిపరి విధముల శోకింప వచ్చును. (సోదరా! వీరిలో నెవ్వరితో నీవు చేరదలతువు? 'మృత్యు కాలము బహుదూరముగ నున్నదిగదా, అప్పటిమాట చూచు కొందము' అనుకొనకు సుమీ. ఈ నశ్వరప్రపంచమునందు ఏది స్థిరము? నీకన్నులార ప్రత్యక్షముగ చూచుచుండియు, చెవులార వినుచుండియు అట్లనుకొనెద వేల? 'ఇప్పుడు యౌవనమునందు సమస్తేంద్రియసుఖములను తృప్తిపఱతును, సమస్త భోగము లను అనుభవింతును. తరువాత వార్ధకదశయందు ధర్మసాధన చేతును. అప్పుడు ఈశ్వరునియందు మనసు నిలిపెదను' అని అనుకొనకుసుమా. సమస్తశక్తులు ఉడిగిన తరువాత నీ వేమి చేయగలవు?) సోదరా! ఎన్నడును అట్టిభ్రమలో చిక్కుకొన కుము. నేడు చేయగలిగిన దానిని, రేపటికి దాచి యుంచ కుము. కామక్రోధాదిరాక్షసులు సమయము చూచి నీ పయి బడి నిన్ను లోబఱచుకొన జూతురు. నేడు నీవు ఒక్క ప్రలో భనమును జయింప గలిగినయెడల, ఒక్క దుష్టవాంఛను అణచుకొన గలిగిన యెడల, 'నేడు మాత్రము, ఈ ప్రలోభ నమునకు లోబడెదను, నేడు మాత్రము ఈ దుష్టవాంఛను

తీర్చుకొనెదను. ఇది ఈవేళమట్టుకే. రేపటినుంచి ఎట్లు ఉండ వలెనో అట్లు ఉండెదను' అని అనుకొనకుము. అవి నిన్ను నాశనమునకు దింపు ప్రలోభనము లనియు, అధఃపతనము నొందించు దుష్టవాంఛ లనియు, నీకు ఒక్కసారి తెలిసిన తరు వాత, మరల ఒక్కరోజుమట్టు కయినను, వానితో నీవు సఖ్యము చేసుకొనుటకు ఇష్టపడిన యెడల, నీ వింకను మోహ పాశమునుండి విముక్తుడవు కాలే దనియు, నీ మనస్సునుండి ఇంకను దుష్టవాంఛలు దూరముగా తొలగిపోలేదనియు, స్పష్ట ముగా తెలుసుకొందువు. ఎవని కయినను అపవిత్రతయన్న కొంచెమయినను అసహ్యము కలిగిన యెడల, అతడు దాని నుండి విముక్తు డగువరకు ఊరకుండగలడా? ఆ యపవిత్రతను తొలగించుకొనువరకు అతనికి నిద్రపట్టునా? ఆహారము రుచిం చునా? ఒక్క గడియ యయినను అపవిత్రముగా నుండి మనః స్తిమితము కలిగియుండగలడా? మీలో నెవ్వరు పాపమునుండి విముక్తులగుటకు ఇష్టపడుదురో, పరాజయము నొందిన ధర్మ మును పునరుద్ధరణ చేసి జయావహ మగునట్లు చేయ దలం తురో, వారు ఈ క్షణమే పరమేశ్వరుని యెదుట చేతులు జోడించి నిలువబడుడు. అనుతాపముచే తప్తమగుచున్న హృద యముతో ఆయన పాదపద్మముల మీద అశ్రుధారలను ప్రవ హింపజేయుడు. హృదయవేదన శమించును. పాపముయొక్క ఆకర్షణశక్తి తగ్గిపోవును. శోకముయొక్క తీవ్రత అణగిపోవును. అప్పుడు 'ఈశ్వరుడు నాకు దూరముగా నుండును గాక, నేను ఈశ్వరునికి దూరముగా నుందునుగాక!' అని యనుకొనజాలరు.

అప్పుడు హృదయములయందు గాఢమయిన అనుతాపము జనించి, 'అయ్యో, ఒకప్పుడు పరమేశ్వరునికిని నాకును గల, ఈ నిగూఢసంబంధమును ఈ మధుర బాంధవ్యమును, ఈ దగ్గర చుట్టరికమును, నేను తెలుసుకొన జాలకపోతిని. అప్పుడు నాజీవనము ఎంత శూన్యమయి యుండెను! ఎంత అపవిత్రమయియుండెను! అయ్యో! నా జీవితము ఎంత వ్యర్థమయినది? కాని, యీశ్వరప్రసాదమువలన ఈక్షణమునందు ఆయన దర్శనము నాకు లభించినది. ఆయన నా యందలి అవ్యాజమయిన అనుగ్రహముచేతనే నా యెదుట ప్రకాశించెను. ఆ దివ్యమూర్తిని దర్శించి ధన్యుడ నయితిని' అని ఆనందపరవశులగుదురు. అప్పుడు వారు, తమపూర్వజీవనమును పరజీవనమును పరీక్షించి చూచుకొని, 'ఏజ్ఞానులు, ఆ పరమపురుషుని తమ ఆత్మ హృదయములందు దర్శింపగలరో వారికే నిత్యశాంతి, ఇతరుల కది యలభ్యము అను సత్యవాక్యము యొక్క అర్థమును స్వానుభవమువలన తెలుసుకొనగలుగుదురు. అప్పుడు వారు, 'నే నొకప్పుడు ఈశ్వరునికి దూరముగా నుంటిని. అప్పటి నా యవస్థ ఏమని చెప్పను? నా దుఃఖమునకు మేర లేకుండెను. ఇప్పుడు నే నాయనను సమీపించితిని. ఇప్పుడు నాకు సమస్తము జ్యోతిర్మయము, జ్యోత్స్నామయము, సుధామయము,' అనుకొందురు. అప్పుడు వారు ఈ రెండు అవస్థలకును ఎంత ప్రభేద మున్నదో చూడగలరు. పూర్వము వారు ఈశ్వరునికి దూరముగా నుండి, ఎట్టి సుఖమువలనను మనశ్శాంతి నొంద రయిరి. ఎట్టిసుఖమును వారికి మనశ్శాంతి

నియ్యకపోయెను. ఇప్పుడు వారు పరమేశ్వరుని తమ హృదయమునందే దర్శించి, ఎట్టికష్టమును కష్టముగా తలచరు. ఎట్టి విపత్తును వారి మనశ్శాంతికి భంగము కలిగింప జాలదు. వందలకొలది, వేలకొలది బాహ్యశత్రువులు వచ్చి వారిని ముట్టడించినను, వారి మనస్సు చలింపదు. వారి యాత్మశాంతిని ఎవరును హరింపజాలరు. ఎందుచేతననగా, వా రిప్పుడు సమస్త శోకనివారకుడును, సకలసుఖసంధాయకుడును, పరమశాంతి నికేతనుడును అగు జగదీశ్వరునే ఆశ్రయించి యున్నాడు. ఆయన సమీపమున శోకము తన తీవ్రతను చూపజాలదు. మృత్యువు తన భయంకరస్వరూపమును ప్రదర్శింపజాలదు. పాపము స్పృశింపజాలదు. స మోదతే మోదనీయగ్ంహి లబ్ధ్వా । తరతి శోకం, తరతి పాప్మానం, గుహాగ్రన్థిభ్యో విముక్తః, అమృతో భవతి'' భక్తుడు మోదనీయుడగు పరబ్రహ్మమును పొంది, ఆనందము నొందుచున్నాడు. శోకము నతిక్రమించుచున్నాడు, పాపమును దాటుచున్నాడు, హృదయమునందలి అజ్ఞానమోహము లనెడు ముడులు విడి బ్రహ్మానందపదవి నొంది అమృతు డగుచున్నాడు.

'ఏకోవశీ సర్వభూతాన్తరాత్మా, ఏకం రూపం బహుధా యః కరోతి । తం ఆత్మస్థం యేనుపశ్యన్తి ధీరాః, తేషాం సుఖం శాశ్వతం నేతరేషాం॥' ఎవడు ఒక్కడో, అన్నిటిని నియమించుచున్నాడో, సర్వభూతములయందును అంతరాత్మగా ప్రకాశించుచున్నాడో, ఎవడు ఒకరూపమును బహురూపములుగా ప్రకాశింపజేయుచున్నాడో, ఆ పరబ్రహ్మమును

విజ్ఞానులు తమ హృదయములయందు ప్రత్యక్షముగా దర్శింతురో, వారి కే నిత్యమయిన సుఖము కలుగును. ఇతరులకు అది సాధ్యము కాదు. "నిత్యః అనిత్యానాం, చేతనః చేతనానాం, ఏకః బహూనాం, యః విదధాతి కామాన్, తం ఆత్మస్థం యేనుపశ్యంతి ధీరాః, తేషాం శాన్తిః శాశ్వతీ, న ఇతరేషాం" ఎవడు సమస్తమయిన అనిత్యవస్తువులలో ఏకమాత్రనిత్యుడో, ఎవడు సమస్తప్రాణులకును ప్రాణము నిచ్చువాడో, ఎవడు అన్నిటిలో ఏకాకియైయున్నాడో, ఎవడు జీవులకు సమస్త కామ్యవస్తువులను అమర్చుచున్నాడో అట్టిపరమపురుషుని విజ్ఞానులు తమ హృదయమునందు ప్రత్యక్షముగా దర్శింతురో వారే శాశ్వతమయిన శాంతిని పొందగలరు. ఇతరులకు అది అసాధ్యము. ఈ ప్రకారముగా, సమస్త మునిపుంగవులును పరబ్రహ్మమును స్వీయహృదయమునందే దర్శింపవలెనని సాక్ష్యమిచ్చుచున్నారు. ఈ బ్రహ్మమందిరము నందలి వెలుగునందును ఆయనయొక్క జాజ్వల్యమాన ప్రకాశమును చూచుచునే యున్నాము. కాని, ఇదియును ఒకవిధముగా ఆయనయొక్క దూరదర్శనమే; పరోక్షానుభూతియే. మన ఆత్మలయందు ఆయనను దర్శించుట మాత్రమే ప్రత్యక్షదర్శనము. అపరోక్షానుభూతి. ఈ ఉపాసనామందిరమునందు ఆయనయొక్క ఆవిర్భావమును చూచుచున్నాము. కాని, ఆయన మనకు ఇంతకంటెను సమీపముగా నున్నాడు. ఆయన మన ఆత్మలకు అంతరాత్మయై యున్నాడు. ఆయన మన శరీరమందిరములయందలి పరమదేవత. బాహ్యమునందు, విశ్వమునందలి సమస్త

వస్తువులయందును ఆయన ప్రకాశమును చూడగలము కాని అది యును ఆయనను దూరముగా చూచుటయే. ఆయనను మన హృదయమునందు చూచినప్పుడే మన మాయనను సమీప ముగా చూచుచున్నాము. ఆయన మన హృదయ మందిర ములయందలి అధిష్ఠాన దేవత. ఆయన మన స్వంతధనము. గాలి, వాన, అగ్ని, సూర్యుడు, ఇవి కేవలము ఒకరిధనములు కావు. ఇవి సర్వజనసామాన్యములు. ఇవి అందరి ధనములు. వానివలె పరమేశ్వరుడు సర్వసాధారణధనము కాడు. అతడు ప్రతివారికిని ఎవరిమట్టుకు వారికే స్వంతధనము. ప్రతి ఆత్మ కును ఆయనతో విశేషసంబంధము కలదు. అతడు 'మన కందరికిని తండ్రి' అంతేకాదు; మనలో ప్రతివానికిని తండ్రి. అతడు ప్రతి శరీరమునకును రాజు, ప్రతివానికిని గృహదేవత. నాతండ్రి. నాతల్లి, నాసోదరుడు నాసోదరి, అని మన బంధు వుల నందరిని, నావాడు, నావాడు, అని ఎట్లు చెప్పుకొను చున్నామో, అట్లే ప్రతివారును ఈశ్వరుని సహితము, నా ఈశ్వరుడు, నా హృదయ దేవత, నా ప్రాణనాథుడు, అని ఎవరి మట్టుకు వారు చెప్పుకొనగలరు. 'య ఉదర మన్తరం కురుతే అథ తస్య భయం భవతి'. ఎవడు తనకు పరమేశ్వరుడు అత్యల్ప దూరమునందయినను ఉన్నాడని భావించుచున్నాడో, అతని జీవనము భయావహము. ఎప్పు డతడు పరమేశ్వరుని ఆవిర్భావ మును తన హృదయమునందే దర్శించుచున్నాడో, అప్పు డతడు పరమేశ్వరుని యొక్క సఖ్యమును పొంది నిర్భయుడగుచున్నాడు. నిగ్రహానుగ్రహసమర్థుడును, అనంతకోటిబ్రహ్మాండములకు

ఏకమాత్రాధిపతియును అయిన అద్వైతపర బ్రహ్మము తనవాడయి యుండగా, ఇక భయ మెందుకు? ఇహలోకము నకు అతడే రాజు, పరలోకమునకు అతడే రాజు. అతని సఖ్యము మనకు లభించినది. అతడు మన చెలికాడు. ఇక భయ మెందుకు? అహో! ఏమి ఆశ్చర్యము? బాహ్యమునందు అంతరమునందు, సర్వత్ర ఆయన ప్రకాశమును చూడగలుగు చున్నాము. ఎప్పుడు కన్నులు తెరతుమో, అప్పుడు ఊర్ధ్వ భాగమునందు, అధోభాగమునందు, వామపార్శ్వమునందు, దక్షిణపార్శ్వమునందు, ఎదుట, వెనుక, సర్వదిశలను ఆయ ననే చూచుచున్నాము. ఎప్పుడు కన్నులు మూతుమో అప్పుడు హృదయాకాశమునందు, దేదీప్యమానమయి, స్వ ప్రకాశముతో విరాజిల్లెడు ఆయనదివ్యమూర్తినే సందర్శించు చున్నాము. ధన్యులము, ధన్యులము!

ఓమ్ ఏకమేవాద్వితీయమ్.

---

ఓమ్ తత్సత్.

# మహర్షి మహోపదేశములు



## ౪ వ ఉ ప దే శ ము

**హిరణ్మయే పరే కోశే విరజం బ్రహ్మ నిష్కలం:**

**తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతి స్తద్ యదాత్మవిదో విదుః.**

నిర్మలుడును, అవయవములు లేనివాడును, పరిశుద్ధు డును, జ్యోతులకు జ్యోతియు అయిన పరబ్రహ్మమును బ్రహ్మ

వేత్తలు జ్ఞానతేజముచే జాజ్వల్యమానముగా ప్రకాశించు చున్న తమ ఆత్మకోశమునందే దర్శింతురు. పరమేశ్వరుడు మన శరీరనగరములకు అధిపతి. మన గృహదేవత. మన ఆత్మలకు అంతరాత్మ. ఎవరు ఆయనను తమ హృదయాకాశమున వెలుగు జ్ఞానజ్యోతిగా దర్శించుచున్నారో, వారే నిశ్చయముగా ఆయన యొక్క నిజస్వరూపమును దర్శింపగలుగుచున్నారు. ఎవరు ఆయన కొరకు తమ హృదయమునందే వెదకుదురో, వారి ప్రయత్న మెన్నడును విఫలము కాజాలదు. ఇట్లు మనము వినియున్నాము. కాని, ఈ ప్రకారముగా ఆయనను తమ హృదయముల లోపల వెదకువారు అల్పసంఖ్యాకులే. అనేకులు బాహ్యావిషయములయందు మునిగియుండి, తమ్ము తాము మఱచిపోవుచున్నారు. ఇంద్రియ సుఖములే పరమార్థములుగా ఎంచుచున్నారు. విషయవాంఛలను తృప్తినొందించుకొనుట కయి తమ సమస్త శక్తులను ధారబోయుచున్నారు. ఐహికభోగముల కయి తమ సర్వస్వమును బలిగా సమర్పించుచున్నారు. ఇది బహువిచారకరమయిన సంగతి. మనము ఆయనకొరకు బాహ్యమునందు ఎంత వెదకినను, ఆయన నిజస్వరూపమును ఎన్నటికిని దర్శింపజాలము. ఆయనను బాహ్యమునందు, మనకు సమీపమందున్న వానినిగా ఎప్పటికిని చూడజాలము. నూలు పడుగై పేకయై, ఆధారమై ఆధేయమై, ఓతప్రోతభావముగా వ్యాపించి ఎట్లు వస్త్రరూపముగా ప్రకాశించుచున్నదో, అట్లే పరమేశ్వరుడు అనంతాకాశమునందు ఓతప్రోతభావముగా వ్యాపించి ప్రకా

శించుచున్నాడు. నిశ్చయమే కాని, ఆకాశమునందు ఆయనను దర్శించుట ఆయనను సమీపించి చూచుట కాదు. సమస్త జగత్తునందును కానవచ్చునది ఆయనయొక్క ప్రతిరూపమే, ప్రతిబింబమే కాని, నిజరూపము కాదు. ఆత్మయందు మాత్రమే ఆయనయొక్క నిజరూపము ప్రకాశించుచున్నది. సృష్టియందలి హృదయాకర్షకము లగు సమస్తసుందరవస్తుజాలముల యందును, సోదరీ సోదరుల యొక్క ముఖారవిందములందును, ధార్మికుల యొక్క ధర్మానుష్ఠానము నందును, ఆయన యొక్క ప్రతిబింబము మాత్రమే కానవచ్చుచున్నది. కేవలము ఆత్మయందు మాత్రమే ఆయన సాక్షాద్దర్శనము విరాజిల్లుచున్నది. ఆత్మయందు మాత్రమే ఆయన సత్యస్వరూపు డయి, ఆనంద స్వరూపు డయి, అనంతస్వరూపు డయి ప్రకాశించుచున్నాడు. ఆత్మయందు మాత్రమే ఆయన శాంతాకారుడయి, శివస్వరూపు డయి, పవిత్రమూర్తి యయి, అద్వైత పరబ్రహ్మమై ప్రకాశించుచున్నాడు. ఆయన ప్రతిబింబము విశ్వమునందలి సకల స్థానములయందును గలదు. తల్లిదండ్రుల యొక్క అనురాగము, సోదరీ సోదరులయొక్క సౌహార్దము, సంతానము యొక్క భక్తి, భార్యాభర్తల యొక్క పవిత్ర ప్రేమ, వీని అన్నిటియందును ఆయన ప్రతిరూపమే. ప్రకృతియం దంతటను ఆయన ప్రతిబింబమే. కాని, కేవలము, ఆత్మయందే ఆయన నిజరూపము ప్రకాశించుచున్నది. ఆ హిరణ్మయకోశమునందే ఆయన సాక్షాద్దర్శనము లభించుచున్నది. ఆయన సత్య స్వరూపము, ప్రేమ స్వరూపము, అమృతస్వరూపము, ప్రత్య

క్షముగా దర్శింపవలె నన్న ఆత్మయందే దర్శింపవలెను. ఈ అనంతవిశ్వము ఆయనయొక్క మలినదర్పణము. దుమ్ముచే ఆవరించబడిన అద్దమునందు, వస్తువులు ఎట్లు అస్పష్టముగా కనబడునో, అట్లే ఈ అనంతవిశ్వమునందు ఆయనస్వరూపము అస్పష్టముగా కనబడుచున్నది. ఆయనయొక్క విమలనిరవయవదివ్యమూర్తి,ఆత్మయందు ప్రకాశించినట్లు మఱియెక్కడను ప్రకాశించదు. ఎవరు ఆయనను తమ ఆత్మలయందే. తమ హృదయములయందే వెదకుదురో, వారి ప్రయత్నము లన్నడును నిష్ఫలములు కావు.

ఆత్మయందు ఆయనయొక్క ఆవిర్భావ మెట్టిది? అక్కడ ఆయన ఏప్రకారముగా విరాజిల్లుచున్నాడు? కొంచెము ఆలోచించిచూతము. కొందరు ఇట్లనవచ్చును: "నే నున్నాను, అను సంగతి నాకు ఎంత నిశ్చయముగా తెలియవచ్చుచున్నదో, నా శరీరములోపల నే నున్నానని నేను ఎంత స్పష్టముగా తెలుసుకొనుచున్నానో, పరమేశ్వరుడు నాలో ఉన్నాడని, నాకు అంత స్పష్టముగా తెలియుటను లేదు'' అనవచ్చును. ఎవడు ఆత్మలకు ఆత్మయో, ఎవనికి ఆత్మ లన్నియు శరీరములో, ఆ పరమపురుషుని వారు తమ హృదయములయందు దర్శింప లేకున్నారు. ఆయనను ఎట్లు దర్శింపవలెనో వారు ఎఱుగకున్నారు. అపరిమితమయిన వస్తువుగాని సమస్త పరిమితవస్తువులకు ఆశ్రయముగా నుండజాలదు. స్వయముగా ఆశ్రయమును అపేక్షించు ఒక పరిమిత వస్తువు, మఱియొక పరిమిత వస్తువునకు ఆశ్రయ మియ్యజాలదు. పరిమితము

లగు సమస్త జీవాత్మలకును, అపరిమితుడగు ఆ పరమాత్మయే ఆశ్రియు డని జ్ఞానమువలన స్పష్టముగా తెలియవచ్చు చున్నది. మూలకారణమును, ఆశ్రియమును అగు పరమేశ్వరుని విడిచి, జీవాత్మ ప్రత్యేకముగా నుండజాలదు. నాకు ఆశ్రియు డయిన వానికి దూరముగా నే నెట్లుండగలను? మనము ఒక చెట్టుయొక్క మ్రాను, శాఖలు, ఫలములు, పుష్పములు, చిగురుజొంపములు చూచుచున్నాము. దానిమూలము భూమియందు కప్పబడి యుండుటచే మన కన్నులకు గోచరమగుటలేదు. అందుచలన ఆ చెట్టునకు మూలమే లేదని చెప్పగలమా? అట్లే పరిమితము లగు మన ఆత్మలు ఆ మూలకారణుని విడిచి విడిగా నుండజాలవు. నేను నన్ను గురించి ఎప్పుడు తెలుసుకొనుచున్నానో, అప్పుడే నేను పరిమితుడను; ఆశ్రియము నపేక్షించు వాడను. నాకు ఆశ్రియుడయిన మహాపురుషు డొకడు కలడు. ఆయనకు నేను ఆశ్రితుడను, అని-తెలుసుకొనుచున్నాను. సోదరీ సోదరులారా! మీజ్ఞానము వైపునకు ఒకసారి మీ దృష్టిని మరల్చిచూడుడు. అది నలువయిపులను పరిమితమయి, సీమబద్ధమయి యున్నది. కాని, అదియే అనంత జ్ఞానమును ప్రకాశింప జేయుచున్నది. మీ జ్ఞానము పరిమితమనుటయే, దానికి ఆశ్రియమయిన అపరిమితజ్ఞానమును స్మరణకు తెచ్చుచున్నది. మీ యిచ్ఛాశక్తులను ఒకసారి పరీక్షించి చూడుడు. అవి స్వాతంత్రములే. కాని, అల్పములు; బలహీనములు. కోరిన కోర్కె లన్నియు ఈడేరవు. మీరు కోరెడు కోరికలను కొంతవఱకే తీర్చుకొనగలరు గాని, పూర్ణముగా

తీర్చుకొనజాలరు. మీ యిచ్ఛలు ఆ పరమేశ్వరుని యొక్క మహత్తమమయిన ఇచ్ఛకు అధీనములయి యున్నవి. అపరిమిత శక్తిసంపన్నుడయిన ఆయన యాశ్రయమును పొంది యుండ బట్టియే కొంతవఱకయినను మీ యిచ్ఛానుసారముగా మీరు కార్యములను చేయ గలుగుచున్నారు. మీ శ్రద్ధ, భక్తి, ప్రేమ, మొదలయిన సమస్త మంగళ భావములను పరీక్షించి చూడుడు. మీరు ఆ యమృతభావములను, ఆ యనంతునియందు స్థాపింపక మరియొక పరిమిత వస్తువునందు స్థాపించిన యెడల ఆ మధురభావములు తృప్తినొందజాలవు. పరిమితములును, అనిత్యములును అయిన వస్తువులను ప్రేమించిన యెడల, ఎన్నడును శాశ్వతమయిన తృప్తి కలుగజాలదు. 'యోవై భూమా తత్సుఖం, నాల్పే సుఖమస్తి, భూమైవ సుఖం భూమాత్వేవ విజిజ్ఞాసితవ్యః॥ ఎవ్వడు మహత్తైన పరబ్రహ్మమో అతడు సుఖస్వరూపి. బ్రహ్మ వ్యతిరేకమగు ఏ అల్పవస్తువు నందును సుఖము లేదు. మహత్తైన ఈశ్వరుడే సుఖస్వరూపి. మహత్తైన ఈశ్వరుడే తెలుసుకొనబడవలసిన వాడు. క్షణభంగురమగు విషయసుఖము మన ఆత్మలకు తృప్తి నియ్యజాలదు. ఆ యనంతుని యాశ్రయమే శాశ్వతసుఖసంధాయకము. మన ఆత్మ లన్నియు ఆ పరమేశ్వరుని ఆశ్రయమునందే యున్నవి. మనలను మనము తెలుసుకొన్నప్పుడే, మనకు మూలకారణుడును, ఆశ్రయుడును అగు ఆ పరమాత్మను గూడ తెలుసుకొనగలము. జగత్తునందలి వస్తుసముదాయ మంతయు, ఆకాశమును ఎట్లు ఆశ్రయించియున్నవో, తనలో నున్న సమస్తవస్తు

సముదాయములతో ఆకాశము పరమేశ్వరుని ఎట్లు ఆశ్రయించి యున్నదో, అట్లే సమస్తమయిన జీవాత్మలును పరమేశ్వరుని ఆశ్రయించియున్నవి. "పరే అక్షరే ఆత్మని, సర్వే ఏ తే ఆత్మానః ప్రతిష్ఠితాః'' నాశరహితుడగు ఆ పరమాత్మయందే సమస్త జీవాత్మలును ప్రతిష్ఠితము లయియున్నవి. 'తద్యథా రథనాభౌచరథ నేమౌచ అరాస్సర్వేసమర్పితాః। ఏవమేవ, అస్మిన్ ఆత్మని సర్వాణి భూతాని, సర్వే దేవాః సర్వే లోకాః, సర్వే ప్రాణాః, సర్వే ఏ తే ఆత్మానః, సమర్పితాః॥ బండిచక్రము యొక్క ఆకులు చక్రముయొక్క నాభియందును వలయము నందును ఏ ప్రకారముగా అమర్చబడియున్నవో, ఆ ప్రకారమే సమస్తభూతములు, సమస్తదేవతలు, సమస్త లోకములు, సమస్త ప్రాణులు, సమస్త జీవాత్మలు, పరమేశ్వరుని ఆశ్రయమును పొందియున్నవి. జీవాత్మ, పరమాత్మలు, ఒకదాని కొకటి అతిసమీపమందున్నవి. వాని మధ్య ఆకాశమున కయినను ఎడము లేదు. జీవాత్మకు పరమాత్మతో ఎంత సమీప సంబంధము కలదో చూడుడు. మనము ఆశ్రితులమయి యుండియు మన కాశ్రయదాన మిచ్చిన ఆ పరమపురుషుని తెలుసుకొనజాలమా? మన మాయనకొఱకు బాహ్యమునందు ఎంత వెదకినను తెలుసుకొనజాలము. ఆయనను తెలుసుకొనవలె నన్న అంతరమునందే వెదుకవలెను. ఎవరు ఆయనను అంతరమునందు దర్శించుటకు ప్రయత్నింతురో, వారు ఒక్కడును, అద్వితీయుడును, సమస్త జగత్తునకును ఆశ్రయుడును, తమకు ఆశ్రయదాతయు నగు అద్వైతపరబ్రహ్మమును,

తమ హృదయములయందు తప్పక దర్శింపగలరు. 'ద్వా, సుపర్ణా, సయుజా, సఖాయా, సమానం వృక్షం పరిషస్వజాతే, తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి, అనశ్నన్, అన్యః అభిచాకశీతి॥' సుందరమయిన రెక్కలు గల జీవాత్మ పరమాత్మ లనెడు రెండు పక్షులు, జంటగాను, స్నేహముగాను శరీర మను ఏక వృక్షమును ఆశ్రయించియున్నవి. వానిలో నొకటి యగు జీవాత్మ తనకర్మఫలములను రుచికరముగా భుజించుచున్నది. రెండవది యగు పరమాత్మ తాను భుజింపనిదయి, జీవాత్మకు కర్మఫలముల నిచ్చుచు, తాను సాక్షిస్వరూపముగా చూచుచున్నది. జీవాత్మ పరమాత్మలు రెండును ఒక్కచోటనే ఉన్నవి. ఉభయులును ఒకరి కొకరు పరమమిత్రులు. వీ రిద్దరును సర్వదా ఒక్కచోటనే ఉందురు. ఎన్నడును ఒకరిని విడిచి ఒక రుండరు. ఒకరు ఆశ్రయులు, ఇంకొకరు ఆశ్రితులు. ఒకరు ఫలప్రదాతలు, ఇంకొకరు ఫలభోగులు. పరమాత్మకును మనకును ఎంత సమీపసంబంధ మున్నదో చూడుడు.

కొందరు ఇట్లనవచ్చును, 'మనకు ఆయనతో సహవాసము ఎట్లు సంభవింపగలదు? ఒక మనిషికి ఇంకొక మనిషికి ఉభయులకు ఎంతభేద మున్నను, సహవాసము కుదురవచ్చును. కాని, మహద్వస్తువులలో కెల్ల మహత్తముడును ఆద్యంతరహితుడును అగు ఆ పరమపురుషు డెక్కడ; నానా అభావములతో నానాదుర్గతులతో నిండియున్న క్షుద్రజీవుల మగు మన మెక్కడ ? ఉభయులకును సహవాస మెక్కడ?'' అనవచ్చును. ఇట్లనుకొనుట కేవలము పొరపాటు. వీరెంత సదుద్దే

శముతో ఇట్లనినను, దీనియం దెంతమాత్రమును సత్యము లేదు. వీరు ఆ పరమపురుషుని యొక్క మహాద్భాగమును తమ నీచభావమును తలచుకొని, ఆయనను సమీపించుటకు సంకో చించుచున్నారు. కాని మనకు ఆయనతో నిత్య సహవాసము. 'సహవాసము' అనగా నేమి? కలిసియుండుటే గదా! దూరపు వస్తువుతో సహవాసము కుదురుట అసంభవమే. కాని, పర మాత్మ మనకు దూరపువస్తువా? కాదు. ఎంతమాత్రమును కాదు. అతడు మనకు అంతరతముడు, హృదయాంతర్వర్తి. అంతరతముడయిన పరమాత్మతో కలిసియుండుట ఎందుకు సంభవము కాదు? అంత సన్నిహితసంబంధముగల పరమాత్మతో మన కేల సహవాసము కుదురదు? ఆశ్రయమునుండి ఆశ్రితుడు దూరముగా నుండగలడా? పూర్వకాలమునందలి మహర్షులు ఆయన సహవాసము ననుభవించి, ఆనందరసనిమగ్నులయి, ఆయనను గురించి చెప్పుచు, ఆయన 'కరతలన్యస్త ఆమలకవత్' అఱచేతిలోని ఉసిరికాయవంటి వాడని వర్ణించియున్నారు. మనము ఉసిరికాయను ఎట్లు అరచేతితో స్పృశించుచున్నామో, ఆయననుగూడ, మనము అట్లే మన ఆత్మలతో స్పృశించు చున్నాము. మన కాయన, మన ఆత్మలు ఆయనను స్పృశించి తెలుసుకొనగలుగునంత సమీపముగా నున్నాడు. మన ఆత్మలు నిరంతరము ఆయనచేత స్పృశింపబడుచున్నవి. మనకాయన ఇంత సమీపవర్తియయి యుండగా, ఆయనతో మనకు సహవాస మేల లభింపదు? ఇట్టి సంబంధముకంటె మఱి దేనికి సహవాస మని చెప్పుదుము? మనము మన హృదయములను విప్పి ఆయన

యెదుట బెట్టి మనలను పరిశుద్ధులనుగా జేయుమని ప్రార్థించు చున్నాము. మన ప్రార్థనలను ఆయన వినుచున్నాడు. ఆయన మనకు జ్ఞానోపదేశమును చేయుచున్నాడు. మన మాయన యమృత వాక్యములను వినుచున్నాము. ఇది ఆయనతో సహ వాసము చేయుట కాదా? నే నెప్పుడు ఏది చెప్పినను అది ఆయన వినుచున్నాడు. ఆయన నాకు దేనిని ఆదేశించు చున్నాడో ఆ యాజ్ఞలను నేను వినుచున్నాను. ఇంతకంటె సహ వాస మనగా మరేమిటి? ఆయన ప్రసన్నముఖమును దర్శించు చున్నాను. ఆయన జ్ఞానోపదేశములను వినుచున్నాను. ఆయన దగ్గరనుండి నా ప్రార్థనవాక్యములకు సహాయము పొందు చున్నాను. ఇంతకంటె సహవాసమను దానికి అర్థమేమి? ఆయ నతో మనకు సహవాసము సరిపడ దనువారు పయి సంగతులను గురించి కొంచెము ఆలోచించినయెడల, ఇంత సన్నిహిత సహ వాసము ఆయనతోతప్ప, మనకు మరెవ్వరితోను కుదరదని తెలుం సుకొనగలరు. ఆయన యుపదేశవాక్యములు శబ్దరూపమున మనచెవులకు వినబడుటలేదు. అయినను మనము వానిని గ్రహించుచున్నాము. ఆయనతోడి సహవాసముచేయుటకు ఈ సమస్తమయిన స్థూలములగు ఇంద్రియములును మనకవసరము లేదు. ఈకళ్లు, ముక్కు, చెవులు మొదలయిన స్థూలేంద్రియ ములతో మనకు పనిలేదు. 'అపాణిపాదో జవనో గృహీతా, పశ్యత్యచక్షుః, సశృణో త్యకర్ణః। స వేత్తి వేద్యం నచ తస్యాస్తి వేత్తా, తమాహు రగ్ర్యం, పురుషం మహాన్తం'' పరమేశ్వరుడు చేతులులేనివా డయినను పట్టుకొనగలడు, కాళ్లులేని వాడయినను

నడువగలడు, కన్నులు లేకయే చూడగలడు, చెవులు లేకయే వినగలడు, అతడు తెలుసుకొనదగినదాని నెల్లను తెలుసుకొనుచున్నాడు. అతనిని పూర్ణముగా తెలుసుకొనగలవాడు ఒకడును లేడు- అతడు పురాణపురుషు డనియు, పూర్ణుడనియు, గొప్పవాడనియు చెప్పుదురు. అతడు స్వయముగా కన్నులు లేకనే ఎట్లు చూచుచున్నాడో, చెవులు లేకనే ఎట్లు వినుచున్నాడో, అట్లే మనమును ఈ కన్నులతో పనిలేకయే ఆయన మనోహరస్వరూపమును చూచుచున్నాము. ఈ చెవులతో పనిలేకయే ఆయన యమృతవాక్యములను వినుచున్నాము. ఈ ప్రకారముగా ఆయన సాక్షాత్కారము పొందుచున్నప్పుడు, ఆయన వాక్యములను వినుచున్నప్పుడు, ఆయనను స్పృశించుచున్నప్పుడు, 'సహవాసము' అనుమాటతో గాక మరేమాటతో మనభావము స్పష్టము కాగలదు.? 'రసో వై సః, రసం హ్యేవాయం లబ్ధ్వా, ఆనందీ భవతి.' అతడు రసస్వరూపుడు. ఆనందకారణుడు. ఆ యానందకారణుని పొందియే జీవుడు ఆనందమును అనుభవించు చున్నాడు. నేత్రములు లేకయే జ్ఞాననేత్రముతోనే ఆయనను ఎట్లు చూచుచున్నామో, స్పర్శనేంద్రియ సహాయము లేకయే ఆయనను ఆత్మతోనే ఎట్లు స్పృశించుచున్నామో, అదేమోస్తరుగా ఆయన యొక్క అమృతానందరసమును జిహ్వతో పని లేకయే ఆస్వాదనము చేయుచున్నాము. నిరుపమానమయిన ఆయనయొక్క ప్రేమానందరసమునందు ఆత్మ నిరంతరము స్నానమాచరించుచున్నది. ఆయనయొక్క పవిత్ర ఆనందము మన హృదయమునందు

ఎప్పుడు ఉదయ మగునో, అప్పుడు ఆయనను రసస్వరూపుడని చెప్పినంత మాత్రమున మనకు ఆయనను గురించి కలుగు సమస్తభావములు పూర్ణముగా వ్యక్తము కావు. ఆయనను మన హృదయము నందు దర్శించినప్పుడు కలుగు ఆనంద రసముతో లోకములోని మరి యే రసములు కలియవు. ఆ బ్రహ్మానందరసముతో పోల్చుటకు పృథివియందు మరియొక రసము లేదు. ఆయనతో సహవాసము చేయుటకు ఇంద్రియముల సాహాయ్య మవసరము లేదు. ఆయన స్వయముగా ఇంద్రియా తీతుడు. ఆయనతోడి సహవాసమును ఇంద్రియాతీత మే. జీవాత్మ ఆయనను స్పృశించునప్పుడు, ఆయన ప్రసన్నముఖ మును దర్శించునప్పుడు, ఆయన యుపదేశ వాక్యములను విను నప్పుడు, ఆయన యమృతరసమును పానము చేయునప్పుడు మన కన్నులు, చెవులు మొదలయిన ఏ యింద్రియములును, అవ సరములేదు. జీవాత్మ పరమాత్మలు రెండును తమ మధ్య ఆకాశ మున కైనను వ్యవధానములేనంత సన్నిహితముగా నున్నవి. ఎందుచేతనన్నచో అవి రెండును ఆకాశమునకు అతీతములే. జీవాత్మ పరమాత్మలు రెండును, ఒకదానినుండి ఇంకొకటి విభ జించుటకు వీలు లేనట్లుగా, అంటియున్నవి. ఎక్కడ జీవాత్మను చూతుమో అక్కడనే పరమాత్మను చూతుము. బాహ్య ప్రపంచమునందు ఎక్కడ చూచినను ఆ పరమపురుషుని ప్రతి బింబమేగాని నిజరూపము కానరాదు. సూర్యచంద్రులయందు, నీలాకాశమున వజ్రపురాసులవలె ప్రకాశించు నక్షత్రరాసుల యందు, మేఘమాలలయందు, మెరుపుతీగెలయందు, మలయ

మారుతమునందు, పూలగుత్తులయందు, నదీనదములయందు, పర్వతోపరి భాగములందు, మహోదధులయందు, మనుష్యుని యొక్క మంగళకరమయిన కార్యములయందు, బంధుమిత్రులు దుల ఆదరణప్రేమలయందు ఆయన మంగళభావముయొక్క ఏ సమస్తమయిన ఆదర్శములు కలవో అవి యన్నియు జూచి మనము కృతార్థుల మగుచున్నాము. కాని, మన హృదయముల యందు ఆయనయొక్క ప్రత్యక్షదర్శనమును చేయగలుగుటయే మనకు గల మహత్తమమయిన అధికారము. అదే మనకు గల భాగ్యములలో కెల్ల పరమభాగ్యము. బాహ్య ప్రపంచము నందు ఆయనయొక్క ప్రతిబింబమును మాత్రమే చూడ గలుగుచున్నాము. ఆంతరప్రపంచమునందు ఆయన జగన్మో హనాకారమును జూచి ధన్యుల మగుచున్నాము. మన హృదయ పద్మములయందు ఆయనను దర్శింపగలిగినప్పుడే 'ఆయన రస స్వరూపుడు, ఆనందకారణుడు, తృప్తిహేతువు' అను వాక్య ములకు అర్థము స్పష్ట మగుచున్నది. ఆరసస్వరూపుని పొందియే జీవుడు ఆనందసాగరమునందు ఓలలాడుచున్నాడు. ఈ ప్రపం చమునందు మనము ఏయేసుఖములను అనుభవించుచున్నామో, అవియన్నియు మనకు ఆయన ప్రసాదమువలననే లభించినవి. "ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి, సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః, ద్యావా పృథివ్యౌ విధృతే తిష్ఠతః, నిమేషాః, ముహూర్తాః, అహోరాత్రాణి అర్ధమాసాః మాసాః, ఋతవః సంవత్సరాః, ఇతి విధృతాః తిష్ఠన్తి ప్రాచ్యః, అన్యాః నద్యః స్యన్దన్తే శ్వేతేభ్యః పర్వతేభ్యః ప్రతీచ్యాన్యాః." దివ్యమంగళ

స్వరూపుడగు ఆ చండశాసనుని ఆజ్ఞచేతనే, సూర్యచంద్రాదులు గతులు తప్పక విధ్యుక్తకాలమున ఉదయాస్తమయము లగుచు సమస్తజీవరాసులకును వెలుతురును, వేడిమిని, చైతన్యమును ఇచ్చుచున్నవి. ఆ అక్షరపరబ్రహ్మముయొక్క అనుగ్రహము చేతనే, మనము నివసించు భూలోకము, సూర్యచంద్ర నక్షత్రాది జ్యోతులతో గూడిన ద్యులోకము, ఈ రెండులోకములు కూడ ఏవిధమయిన ఛిద్రము లేక నిలబడియున్నవి. ఆ సచ్చిదానందమూర్తియొక్క నియమముచేతనే నిముసములు, ముహూర్తములు, రాత్రింబగళ్ళు, పక్షములు మాసములు, ఋతువులు, సంవత్సరములు మొదలయిన కాలముయొక్క అవయవములు నిష్కర్షింపబడుచున్నవి. ఆ పరమదయాకరుని యొక్క శాసనము చేతనే, మంచుకొండలనుండి నదులు నలువైపులను ప్రవహించి సమస్త జీవరాసులకును ప్రాణధారకము లగుచున్నవి. సూర్యచంద్రాదులును, మేఘములును, పృధివ్యాది సమస్త భూతములును, ఇవియన్నియును కలిసి ఆయన యాజ్ఞలను శిరసావహించి ఆయనయొక్క ఔదార్య ప్రసాదమును సహస్ర సహస్రహస్తములతో పంచిపెట్టు చున్నవి. కాని, ఇవి యన్నియు ఎంత ఆనందసంధాయకము లయినను, పరమేశ్వరుని మన హృదయములయందే దర్శించునప్పుడు కలుగు ఆనందమునకు ఎంతమాత్రమును సరిపోవు. ఆయన స్వయముగా మన హృదయములయందు సచ్చిదానందస్వరూపుడై న్యాయమూర్తియయి, ప్రేమనిధి యయి, పరిశుద్ధజ్యోతియయి ప్రకాశించి, తన సాక్షా

ద్దర్శనమును మనకు లభింపజేసి మనపయిన ఎంతప్రేమను, కరు ణాళుత్వమును కనబరుచుచున్నాడో, అట్టి సుందరదృశ్యము, అట్టి అద్భుత అమృతప్రదర్శనము నురెచ్చటను కానరాదు. ఆయన తన ప్రసన్నముఖమును మనకు ప్రదర్శించుచున్నాడు. తన ప్రేమను మనపయిన అజస్రము వర్షించుచున్నాడు. మన హృదయములయందు పవిత్రస్వరూపుడయి ప్రకాశించుచు మనలను సమస్త అపవిత్రతలనుండియు, సమస్తపాపముల నుండియు సంరక్షించుచు, తనపవిత్రమార్గమున నడిపించు చున్నాడు. ఇదియే మనకును ఆయనకును గల ప్రధాన బాంధ వ్యము. ఆయన స్వయముగా తననే మనకు దానముక్రింద ఇచ్చివేసికొనుట - ఆయన మన కిచ్చిన సమస్తదానముల లోను శ్రేష్ఠదానము. ఆయన మనలను తన ఆనందామృత మును గోలుటకు, అర్హులనుగా, అధికారము గలవారినిగా చేయుట, ఆయన మనకు దయచేసిన అధికారములలో నెల్ల ప్రధానాధికారము. "ఏషాస్య పరమాగతిః, ఏషాస్య పరమా సంపత్, ఏషోస్య పరమో లోకః, ఏషోస్య పరమ ఆనందః। ఏతస్యైవానందస్య అన్యాని భూతాని మాత్రా ముపజీవన్తి॥. ఏ ఆనందస్వరూపునియొక్క ఆనందలేశమును పొంది, సమస్త భూతములు ఆనందము ననుభవించుచున్నవో అతడే మనకు పరమగతి. అతడే మనకు మహైశ్వర్యము, అతడే మనకు ప్రశస్తమయిన లోకము, అతడే మనకు శ్రేష్ఠమయిన ఆనం దము, అని మనము ఇప్పటినుండియు, ఈ నశ్వర శరీరములతో

నుండియు, తెలుసుకొన గలుగు చున్నారము. అహో, ఏమి భాగ్యము! ఏమి ఆశ్చర్యము!

ఓమ్. ఏకమేవాద్వితీయమ్.

---

ఓమ్ తత్సత్.

# మహర్షి మహోపదేశములు

## ౫వ ఉపదేశము

న చక్షుషా గృహ్యతే, నాపి వాచా, నాన్యైర్దేవైః
తపసా కర్మణా వా। జ్ఞానప్రసాదేన విశుద్ధసత్వః,
తతస్తు తం పశ్యతి, నిష్కలం ధ్యాయమానః.

పరబ్రహ్మము రూపము లేనివాడగుటచే మన మాయనను కంటితో చూడలేము. పేరు లేనివాడగుటచే వాక్కుతో గ్రహింపలేము. ఇతర ఇంద్రియములతోను ఆయనను గ్రహింపజాలము. తపస్సు చేతను ఆయనను పట్టుకొనజాలము. యజ్ఞములు వ్రతములు మొదలయిన కర్మానుష్ఠానముల ద్వారా, ఆయనను గ్రహింపజాలము; బ్రహ్మమును పొందుటకు ఇవేవియు మార్గములు కావు. మానవుడు జ్ఞానస్వరూపుడయిన పరమేశ్వరుని యనుగ్రహముచే, పరిశుద్ధమయిన అంతఃకరణము గలవాడయి, శుద్ధసత్వస్వరూపుడయి, ధ్యానయుక్తుడయి,

ఏ అవయవమును లేనివాడును, సత్యస్వరూపుడును అగు అద్వైత పరబ్రహ్మమును పొందుటకు సమర్థు డగుచున్నాడు. సహజ జ్ఞానముచేతనే మానవు లందరును బ్రహ్మమును గురించి తెలుసుకొనుటకు సమర్థు లయి యున్నను, వారి హృదయములు ఇంద్రియ సుఖములయందు అమితానురాగము మొదలయిన దోషములచే కలుషిత మయి యుండుటచే జ్ఞానాలోచన వలనను, ధర్మానుష్ఠానము వలనను ఈశ్వరానుగ్రహమును పొంది శుద్ధసత్వ హృదయు లయిన గాని బ్రహ్మ దర్శనమునకు అర్హులు కాజాలరు.

జీవాత్మకును పరమాత్మకును గల సంబంధ మెట్టిది? ఆయనతో మనకు సహవాస మెట్లు లభించును? ఈ విషయ మయి మన మిదివరలో ఆలోచించియుంటిమి ఆయన మన నేత్రములకు గోచరుడు కాడు. జ్ఞానస్వరూపు డగు ఆయన యొక్క ప్రకాశమును మనము మన ఆత్మయందే చూచు చున్నాము. ఆయన మన శ్రవణేంద్రియమునకు అతీతుడు. ఆయన మాటలు మన చెవులకు వినబడవు. కాని, ఆయన ఉపదేశములను, ఆదేశములను మన హృదయము ద్వారా విను చునే యున్నాము. ఆయన సకలేంద్రియములకును అతీతుడే. ఏ ఇంద్రియముచేతను ఆయనను మనము గ్రహింపజాలము. అయినను సత్యములును, సుందరములును, మంగళకరము లును అయిన ఆయన భావములను మనము జ్ఞానముద్వారా గ్రహించుచునే యున్నాము. ఆయనయొక్క అమృతానంద రసమును పానము చేసి సంతృప్తుల మగుచున్నాము. ఆయన

మన ఇంద్రియములకు గ్రాహ్యా మగువాడు కాడు. నిశ్చయమే. కాని, మన ఆత్మకును ఆయనకును అతిరహస్యమయిన దుర్భేద్యమయిన సంబంధము కలదు. మనము ధ్యానయుక్తుల మయి, శుద్ధ సత్వగుణప్రధానుల మయి, మన ఆత్మలయందు ఆయనను చూడగలుగుచున్నాము. మహాత్ముడగు ఆయనతో సహవాసము చేయుటచే మన క్షుద్రజీవనము సార్థక మగుచున్నది. ఆయన జ్ఞాననేత్రము మన పయిన ప్రసన్నభావముతో వికసించియున్నదని మన మెప్పుడు చూడగలుగుదుమో, సహస్ర సహస్ర నేత్రములతో ఆయన మనలను కనిపట్టి చూచుచు మన యోగక్షేమములను అరయుచున్నాడని మన మెప్పుడు తెలిసికొందుమో, అప్పుడే ఆయనతో మనకు శుభసమ్మేళనము లభింపగలదు. ప్రియసోదరులారా! మీరా సంగతిని ఒక్కసారి అనుభవమునకు తెచ్చుకొనుడు. ఒక్కసారి మీ ఆత్మలను విషయసుఖముల నుండి మరల్చి, ఆయన వంకకు త్రిప్పుడు. అప్పుడు మీపయిన జాజ్వల్యమానముగా వెలుగుచున్న ఆయన నేత్రమును మీరు చూడగలుగుదురు. ఆయన కటాక్షవీక్షణము మన పయిన ప్రేమామృతమును వర్షించుచున్నది. ఆయన హృదయము ఎట్లు ప్రేమపూరిత మయి యున్నదో మన హృదయమును అట్లే యున్నది. ఆయనను ప్రేమనేత్రములతో దర్శింపుము. అప్పుడే ఉదారమును అపారమును అగు ఆయన ప్రేమను మీరు అనుభవింపగలరు. ఆయనను మీరు ఉదాసీనభావముతో చూచిన యెడల, శూన్యహృదయముతో ఆయనను దర్శింప యత్నించిన యెడల,

నిర్లక్ష్యభావముతో ఆయన వైపునకు మీ ముఖమును త్రిప్పిన యెడల ప్రేమమయుడగు ఆయన ప్రేమను మీ రెంత మాత్రము తెలుసుకొనజాలరు. మీ రాయనను అనురాగ పూరిత హృదయములతో, ప్రేమరంజిత నేత్రములతో చూచినయెడల ఆయన యొక్క ఒక అపరూపపు ఆవిర్భావము, ఒక నూతన మూర్తి, ఒక దివ్యసుందర స్వరూపము, మీ హృదయ ద్వారమున నవనవ ప్రభలతో ప్రకాశించును. జీవాత్మ పరమాత్మలలో ఒక్కరు మాత్రమే ప్రేమించిన యెడల ప్రేమభావము సంపూర్ణము కాజాలదు. ఉభయులును ఒకరి నొకరు ప్రేమించవలెను. తల్లి బిడ్డను ప్రేమించిన చాలదు. బిడ్డ తల్లిని ప్రేమించవలెను. అప్పుడే బిడ్డ తల్లి ప్రేమను గ్రహింపగలదు. ప్రేమలేని హృదయము ప్రేమను గ్రహింపజాలదు. ఈశ్వరుడు తన ప్రేమను మనపయి ప్రవహింపజేసి మన ప్రేమను ఆకర్షించుచున్నాడు. ఆయన మనపయిన నిరంతరము తన ప్రేమను కుంభవృష్టిగా కురిపించుచున్నాడు. మనము బిందుమాత్ర ప్రేమ నయినను ఆయన యెడల చూపగలిగిన యెడల, మన జీవితములు ధన్యము లగుచున్నవి. నిర్లక్ష్యభావముతో చూచినయెడల, శూన్య హృదయముతో ఆయనను దర్శించుటకు ప్రయత్నించిన యెడల, విశుద్ధమును ఉజ్జ్వలమును అగు ఆయన ప్రేమను దర్శింపజాలము, అనుభవింప జాలము. పవిత్రజ్ఞాననేత్రముతో చూచినప్పుడే, ప్రేమరంజితము లగు నయనములతో వీక్షించినప్పుడే, ఆయన ప్రేమదృష్టి మనయెదుట దేదీప్యమానముగా

ప్రకాశించును. ఆయన దృష్టి బహుస్నిగ్ధము, బహుకోమలము. ఆయనదృష్టితో పోల్చదగినది లోకమునందు ఏదియును లేదు. వేయి తల్లుల ప్రేమయయినను ఆయన ప్రేమకు ఈడు కాదు. అయినను తల్లిప్రేమ ఆయన ప్రేమను కొంచెము పోలియుండును. తల్లి ప్రేమ వలెనే ఆయన ప్రేమరసము సమస్త జగత్తును తడిపివేయుచున్నది. ప్రతిమానవునియొక్క హృదయము ఆయన ప్రేమరసముచేతనే తడుపబడుచున్నది. ఆయన ప్రతిమానవుని ప్రత్యేకదృష్టితో చూచుచున్నాడు. ఆయన ఒక్కడయ్యును ప్రతి ఆత్మయొక్క ప్రేమ క్షుధను శాంతి పఱచుచున్నాడు. ఈ భూమండలములో నేను తప్ప మరి యెవ్వరును లేకపోయినయెడల, నేను ఒక్కడనే ఆయనకు కుమారుడను అయిన యెడలను, నేను ఒక్కడనే ఆయన యొక్క అనంతరాజ్యమునకు, అనంత ఐశ్వర్యమునకు అధికారిని అయినయెడలను ఆయన నన్ను ఎంత గారాబముతో, ఎంత ప్రేమతో జూచునో, ఈ పృథివియందు గణనాతీతము లగు జీవు లున్నను, అసంఖ్యాకు లగు మానవులున్నను, నన్ను అంత ప్రేమతోను జూచుచున్నాడు. భూమియందలి రాజులు, తమ రాజ్యములోని ప్రజలలో ప్రతివానిని, తెలుసుకొన నయినను తెలుసుకొన జాలరు. కాని, జగత్పిత యగు పరమేశ్వరుడు తన అనంత సంసారములోని ప్రతి పుత్రుని, ప్రతి పుత్రికను, ప్రేమమయ మగు తన ఒడియందు చోటిచ్చి కూర్చుండ బెట్టుకొనుచున్నాడు.

భ్రాతృవరులారా! జనన మొందినది మొదలు, ఎవరి

యాశ్రియమునందు పెరుగుచున్నామో, ఈ క్షణమునందును ఎవడు మనల నందఱను అపారప్రేమతో కాచి సంరక్షించు చున్నాడో, ఆయనకు కృతజ్ఞతాపూరితహృదయములతో వందనము లర్పింతము. మన హృదయములను, మన ఆత్మలను సంపూర్ణముగా ఆయన చేతిలో బెట్టుదము. పుట్టినది మొదలు ఎవడు మనలను సంరక్షించుచున్నాడో, తల్లి గర్భమునందు ఎవడు మనలను పెంచియుండెనో, భూమిమీాద పడీ పడుట తోనే, ఎవనియొక్క ప్రేమచే పోషింపబడితిమో, ఆయనకు ప్రణామములు సమర్పింతము. మనయందు ఆయనకు ఈ నిష్కా రణప్రేమ ఎక్కడనుండి వచ్చినది? మన మీా భూమికి వచ్చి నప్పుడు ఇక్కడి సంగతులను గుఱించి కొంచెమయినను తెలిసికొని గాని, విని గాని, వచ్చియుండలేదు. మన మొకప్పుడు మట్టి ముద్దలవలె అచేతనుల మయి పడియుంటిమి. నలుదిశలను అంధకారము. ఎక్కడ ఏమున్నదో ఎఱుగము. భూపతన మయితిమి, కన్నులు తెఱచితిమి, వెలుగును చూచి తిమి, ఎక్కడనుండియో ప్రేమ వచ్చి మనలను కౌగిలించు కొన్నది. ఎవరైనను వచ్చి మనలను సంరక్షింప ప్రయత్నించు టకు తగిన లక్షణములు గాని, వారిహృదయములను ఆకర్షించుటకు తగిన సామర్థ్యము గాని మన దగ్గర ఏమి యుండెను? కాని, కరుణాస్వరూపు డగు పరమేశ్వరుడు మనము జన్మింపక ముందే, మన తల్లియొక్క హృదయమునందు, ప్రేమను ముందుగా ప్రవేశపెట్టి యున్నాడు. ఆ మాతృ స్నేహమే, మనము అసహాయులమై యున్నప్పుడు, మనకు

వజ్రకవచ మయి, మనలను సమస్త కష్టముల నుండియు, దుఃఖముల నుండియు, సంరక్షించెను. మన జీవనరక్షణార్థమే, ఈశ్వరుడు తల్లియొక్క ఉరోజములయందు దుగ్ధములను, హృదయమునందు ప్రేమను ముందుగా ప్రేరణ చేసియున్నాడు. ఆ ప్రేమవలననే, ఆ పాలచేతనే మన మప్పుడు పోషింపబడితిమి. ఆయన ప్రేమకొఱకు మనము ప్రార్థించ లేదు. ఆయన ప్రేమ దానంతట దే వచ్చి మనలను గ్రహించెను. ఆయన చిరకాలమునుండి మనలను ప్రేమించుచున్నాడు. మనము ఎంతకాల మయిన తరువాత ఆ సంగతి తెలుసుకొంటిమి! ఇప్పుడు గదా మన మాయనను ప్రేమించుచున్నాము. ఇప్పుడు గదా తెలుసుకొంటిమి - మనలను ఆయన ఎన్నివిధముల సంరక్షించినది. మనకు దంతములు లేనప్పుడు పాల నిచ్చెను. తరువాత దంతము లిచ్చి అన్న మియ్యలేదా? మనకు జ్ఞానము లేనప్పుడు, మనలను సంరక్షించెను. మన కిప్పుడు జ్ఞానము నిచ్చి విడిచిపెట్టునా? ఆశ్రయ మియ్యడా? దుర్బలులముగా, అనాథులముగా నున్నప్పుడు తన ఒడియందుంచుకొని పెంచెను. ఇప్పుడు మనలను పరిత్యజించునా? ఆయన తన ప్రేమ నిక మనమీద చూపింపడా? ఆయన ప్రేమప్రవాహము, నేటివరకు, అవిచ్ఛిన్నముగా ప్రవహించుచున్న ప్రేమస్రోతము, నేటితో ఇంకిపోవునా? పూర్వ మాయన మనకు తల్లి యయి, తండ్రి యయి, సమస్తమును అయి యుండెను. ఇప్పుడును తల్లియయి, తండ్రియయి, సమస్తమును అయి యున్నాడు. ముందు అనంతకాలమువరకు

మన కాయన తల్లియయి, తండ్రియయి, సమస్తమును అయి యుండును ఆయన ప్రేమయే లేనియెడల ఈజగత్తు అంధ కారము కాదా? శ్మశానసమము కాదా? అప్పుడు మనకు అనంతజీవన ముండియు ఏమిలాభము? అనంతకాలపర్యంతము మన మాయన ప్రేమను తెలుసుకొనక, ఉదాసీనులమయి తృప్తి నొంది యూరకుండగలమా? ఉండజాలము, ముహూర్తమాత్రమైనను ఉండజాలము. ఆయన యొక్క అపారప్రేమను మన మికముందు పూర్వము కంటెను ఉజ్జ్వలతరముగా అనుభవింతుము. మనము ఆయనను ఇంకను ఎక్కువగా ప్రేమింతుము. ఇట్లే మన యావజ్జీవము గడచిపోవును. మన కాయన జ్ఞానము నిచ్చి ధర్మమును బోధించి, ఎట్టి కష్టములనైనను సంతోషముతో భరించు తితిక్ష నిచ్చి, ధైర్య మను కవచమును తొడిగి, ఈ పృథివి యందలి సమస్త కఠోరవ్రతములను పట్టించి ఉద్యాపనము చేయించును. ఆయనతో ముందు మనకు కలుగబోయెడి శాశ్వతసహవాసముకొరకు మనల నిప్పటినుండియు సంసిద్ధము చేయుచున్నాడు. ఆయనయెడల అందరును కృతజ్ఞులు కండు. ఆయన చేసిన ఉపకారములను అనుక్షణము స్మరింపుడు. ఆయన చిరవర్తమాను డని తెలిసికొని ఆయనయొక్క సాక్షాద్దర్శనమును చేసి మీరు కృతార్థులు కండు. ప్రేమ నేత్రములతో ఆయన పరిశుద్ధ ప్రేమను దర్శింపుడు. అటు వంటి స్నేహితుడు, అటువంటి బంధువు, మనకు మరెవ్వరును లేరు. మనము ప్రార్థించి ప్రార్థించక మునుపే, మనము కోరెడు సమస్త వస్తువులను ఆయన సిద్ధపరచి ఇచ్చెను.

మనము ప్రార్థింపక మునుపే, మనము కోరదగిన సమస్త వస్తువులను సిద్ధపరచియుంచెను. ఆయన యొక్క ఈ ఉదార భావమును చూడుడు, ఈ ప్రపంచమునందలి సంకుచిత భావములను చూడుడు. ఇక్కడ ఎవరినుండి మనకు సమస్తము కలుగు నని ఆశించుచున్నామో, వారే మనకు ఆశా భంగము కలిగించు చున్నారు. ఎవరిని పుత్రప్రేమతో పెంచి పోషించి, మనవార్ధకదశయందు మన కాధారమయి యుందు రని విశ్వసించుచున్నామో వారి నుండియే మనము నిష్ఠురాఘాతములను పొందుచున్నాము. నిష్కపటమయిన ప్రేమతో మన సర్వస్వమును బంధువుల చేతులలో బెట్టుచున్నాము. వారు మనవలన సమస్తమును పొంది, మనలను తిరిగి నానాబాధలు పెట్టుటకు ప్రయత్నించుచున్నారు. ఎక్కడ కృతజ్ఞత నాశించుచున్నామో, అక్కడ కృతఘ్నతను చూచుచున్నాము. ఎక్కడ స్నేహమును ఎదురు చూచు చున్నామో, అక్కడ శత్రుత్వమును గనుగొనుచున్నాము. మనవలన సమస్త ఉపకారములను పొందినవారే మనకు గర్భ శత్రువులుగా మారుచున్నారు. నిరాశామయమగు నీ ప్రపంచమునందు, మన మెవరి ప్రేమమీాద నాధారపడి యుండగలము? ఎవ్వరిని నిస్సంశయముగా విశ్వసింపగలము? కేవలము, సత్య స్వరూపుడును ధర్మ స్వరూపుడును నగు పరమేశ్వరుని మీాద భారము వేసిననే, సమస్త కష్టముల నుండియు, పరిత్రాణము నొందగలము. ఈశ్వర ప్రేమయే మనలను బహిష్కరించిన యెడల, ఆయన ప్రేమకు

మనము దూరస్థుల మయిన యెడల మన దుస్థితికి మేర యుండదు. ఎవరిని నమ్ముకొని, ఎవరి పైన భారము వేసి మనము శాంతిని పొందగలము? ఈభూమియందలి లోకులు దుర్బలులు, స్వార్థపరులు. తమ లాభముకొరకే తమ పనులలోనే మునిగి యుందురు. వారికి తమ పనులు సవరించుకొనుటయే దుర్ఘటము. ఇతరులకు వా రేమి సహాయము చేయగలరు? నీచాశ్రియము వలన మనకు రక్షణ ఎట్లు కలుగును? ఈ పవిత్రస్థానము నం దుండి, ఈ ఆరాధనగృహమునందుండి, నిర్మల చిత్తముతో నిష్కళంక హృదయముతో, ఈశ్వరు డెంత కరుణాళుడో, ఎంత ఉదారహృదయుడో, ఒకసారి భావించి చూడుడు. అతడు మనలను ప్రేమించి, లోకమునం దితరు లెవ్వరును ప్రేమించని లోటు తీర్చివేయు చున్నాడు. లోకము వయిపునకు ఒకసారి కన్ను లెత్తి చూడుడు. భర్తలచే పరిత్యజింపబడిన భార్యలు, భార్యలచే విడిచిపెట్టబడిన భర్తలు, తలిదండ్రులచే తరిమి వేయబడిన బిడ్డలు, బిడ్డలచే వెళ్ళగొట్టబడు తలిదండ్రులు, రాజులచే ప్రవాసము నొందింపబడు ప్రజలు—ఎందరెందరు ఈ ప్రపంచమున తీరని వ్యధలను అనుభవింపుచున్నారు? కాని, అందరు విడనాడినను, మనల నెన్నడును విడనాడని ప్రాణ మిత్రు డొకడు కలడు. ఇక్కడ నెన్ని కష్టముల ననుభవించి నను, ఎవరినుండి ఏవిధమయిన ఆశాభంగము నొందినను, ఏ విధ మయిన హృదయవేదనచే తపించుచున్నను, ఆయన సమీపము నకు చేరినంత మాత్రమున సమస్త తాపములు చల్లారి, మన శ్శాంతి కలుగును. ఎక్కడెక్కడ రక్షణ కలుగునని పోయి

యుంటిమో, ఎక్కడెక్కడ సుఖము నొందుదుమని ఆశించి యుంటిమో, ఆయాచోట్ల నెల్లను ఆశాభంగము నొంది, వెను కకు మరలి వచ్చితిమి. కాని, మన చిరజీవనసఖుడు మన వెనువెంటనే యున్నాడు. మన మాయనను విడిచినను, ఆయన మనలను విడుచువాడు కాడు. ఆయన మన జీవనవల్లభుడు, ప్రాణనాయకుడు. మన మాయనకు అధీనుల మయినప్పుడే, మనము నిజమయిన స్వాతంత్ర్యమును అనుభవింప గలము. ఆత్మ స్వాతంత్ర్యమే మానుషత్వము యొక్క లక్షణము. అదియే మన ఐహిక జీవనమునందు అలంకారము. తరువాత మోక్షావస్థను పొంది, శోకమోహములనుండి విముక్తుల మయి, హృదయగ్రంథులు వీడి చరితార్థుల మగుదుము. కాని, ఆ మోక్షావస్థ ఒకప్పుడు విరమించునదా? అనంతకాలము ఆనందము తరువాత ఆనందము, ప్రేమ తరువాత ప్రేమ, ఇట్లు నవనవ ఆనందములతో, క్రొత్త క్రొత్త ప్రేమలతో, ఆయన మన లను విందుగొలుపుచుండును. ఎవరిపయిన మనము ఇట్లు ఆధార పడియున్నామో, ఎవరిమీద మనము ఇంత ఆశ పెట్టుకొని యుండగలమో ఆయనను పరిత్యజింపకుడు. ఆయన ప్రేమ మీదనే భారముంచి సమస్త వ్యాధులనుండియు, సమస్త బాధల నుండియు విముక్తులు కండు. ఆయన మన పరమబంధువు, ఉపా సింపదగిన దేవత, సమస్త కోరికలను ఈడేర్చు కామధేనువు, సకల అభీష్టములను సిద్ధింపజేయగల దయాసముద్రుడు. మన సమస్త కామములకును గమ్యస్థానము. ఇప్పుడు, ఈమంగళ సమయమున ఆయన మన హృదయములయందు ఎట్లు ప్రకా

శించుచున్నాడో, అట్లే ముహూర్తమాత్రస్థాయి యగు తోలకరి మెఱుపువలె గాక మధ్యందినమార్తాండునివలె చిరస్థాయియయి దివ్యతేజముతో మన హృదయములయందు వెలుగుమని ఆయనను ప్రార్థింతము. ఈ ఆనందస్రోతమే, మన హృదయములయందు సర్వదా ప్రవహించుచుండును గాక! ఆయన తప్ప మనకు వేరుగతి లేదు. ఆయన ప్రేమయే మనకు సమస్త ఐశ్వర్యము, ఏకమాత్ర శరణ్యము. ఇహపరములయందు ఏకమాత్రగతి.

ఓ సచ్చిదానందస్వరూపా! అజ్ఞుడనగు నేను సర్వజ్ఞుడవగు నిన్ను ఎట్లు స్తుతింపగలను ! నీ అమృతానందరసముతో నా ఆత్మకు అభిషేకము చేయుము. నా దృష్టి నిరంతరము నీ యపారప్రేమదృష్టికి అభిముఖముగా నుండునట్లు కటాక్షింపుము. క్షుద్ర మగు నా యిచ్ఛ మహత్తమ మగు నీ యిచ్ఛతో మిళితమగునట్లుగా అనుగ్రహింపుము. నేను నీ ధర్మనియమములను ఉల్లంఘించిన యెడల, నన్ను సహస్ర విధములుగా దండింపుము కాని, నన్ను విడిచిపెట్టకుము. ప్రాణనాథా! నేను నీ వాడను. నీవు గాక నాకు గతి ఎవ్వరు?

ఓమ్. ఏకమేవాద్వితీయమ్.

---

ఓమ్ తత్సత్

# మహర్షి మహోపదేశములు



## ౧వ ఉపదేశము

"న తత్ర సూర్యో భాతి, న చంద్ర తారకం,
నేమా విద్యుతో భాంతి, కుతోయ మగ్నిః
తమేవ భాన్త మనుభాతి సర్వం,
తస్య భాసా సర్వ మిదం విభాతి—"

శిష్యుడు విశ్వమునందలి ఈశ్వర ప్రతిబింబమును దర్శించెను. తృప్తి కలుగలేదు. ఆతని కీశ్వరసాక్షాత్కారమును పొందవలె నని తీవ్రమయిన ఇచ్ఛ కలిగెను. అప్పు డాచార్యుని సమీపించి అడుగుచున్నాడు.

"భగవత్స్వరూపుడ వగు ఓగురువర్యా! ఈశ్వరుడు దేశకాలాతీతుడు. మనోవాక్కాయముల కందడు. అనంతుడు, అచింత్యుడు. వాక్యములద్వారా వర్ణించి ఆయన ఇట్టివాడని, నిర్దేశించుటకు వీలులేదు. అయినను బ్రహ్మపరాయణులును, సత్యవ్రతులును అయిన ఋషిసత్తములు ఆయనను ప్రత్యక్షముగా దర్శించి సార్థకజన్ము లగుచున్నారు, అని సెలవిచ్చితిరి. అనంతకల్యాణగుణాకరుడును, సుఖస్వరూపుడును అయిన భగవానుని నే నెట్లు తెలిసికొనగలను? ఆయనను నే నెక్కడ

దర్శింపగలను. నా కాయనను చూపింప గల వా రెవ్వరు? విశ్వమునం దాయనను ప్రకాశింపజేయ గల వ్యక్తి ఏది? నాయం దనుగ్రహించి ఈశ్వరునియొక్క అపరోక్షానుభూతి కలుగు సాధనమును ప్రసాదింపుడు'' అని యడుగగా. ఆచార్యులు చెప్పుచున్నారు.

'న తత్ర సూర్యో భాతి'—లోకమునందలి సమస్తవస్తు సముదాయమును ప్రకాశింపజేయ గల సూర్యుడు ఈశ్వరుని మాత్రము ప్రకాశింపజేయలేడు. 'న చంద్రతారకం'—నిశాంధ కారమును వెడలగొట్టు చంద్రుడు, నక్షత్రములు ఆయనను ప్రకాశింపజేయజాలవు. 'న ఇమా విద్యుతో భాంతి'-కన్నులు మిరుమిట్లు గొలుపు మెఱపుతీగెలు సహితము ఆయనను ప్రకా శింపజేయజాలవు. కుతోఽయ మగ్నిః - అట్టి తేజఃపుంజము లగు సూర్య చంద్ర నక్షత్రములకే గతి లేనప్పుడు, భూమండలము నందు, ఏ మూలనో, ఏ హోమకుండమునందో వెలుగు అగ్ని ఆయనను ప్రకాశింపజేయుటకు ఎట్లు సమర్థమగును? పరమేశ్వర సన్నిధానమున సూర్యచంద్రాదుల ప్రభ లన్నియు కాంతి విహీనము లగును. ఆయన ముందర అవన్నియు అంధకార తుల్యము లగును. ఆయనను ప్రకాశింపజేయ గల జ్యోతి ఒక్కటే. ఆత్మజ్యోతియందే ఆ సత్యజ్యోతియొక్క ప్రకా శము. ఆ సత్యజ్యోతిముందర సూర్యచంద్రాదుల కాంతులు పరాభవము నొందుచున్నవి. ఆత్మజ్యోతియందే ఆ సత్య జ్యోతియొక్క ప్రకాశమును ఛాయామాత్రముగా, సాదృశ్య మాత్రముగా పొందగలుగుచున్నాము, అని ఆచార్యులు

చెప్పిరి. శిష్యుడు రహస్యమును గ్రహించి సంతుష్టాంత రంగు డయ్యెను.

లోకముసందలి ఏ జ్యోతులును ప్రకాశింప జేయలేని సత్యజ్యోతిని దిజ్మాత్రముగా నయినను ప్రకాశింప జేయగల ఆ యాత్మజ్యోతి ఏది? సోదరులారా! బాహ్యమునందు మీ చిత్తము నాకర్షించు సమస్త పదార్థముల నుండియు మీదృష్టిని ఒకసారి లోపలికి మరల్పుడు. ఒక్కసారి అనన్యమనస్కుల రయి శ్రద్ధా పూర్వకముగా మీ దృష్టిని మీ హృదయాంత రాళమున ప్రవేశపెట్టుడు. ఆత్మజ్యోతి యన నేదియో తెలిసి కొనగలరు. 'అస్తమితే,ఆదిత్యే చంద్రమసి అస్తమితే, శాంతే అగ్నౌ'. సూర్యుడు అస్తమించినప్పుడు, చంద్రుడు అస్తమించి నప్పుడు, అగ్ని చల్లారినప్పుడు, ఇక మిగిలిన జ్యోతి ఏది? ఆత్మ జ్యోతియే. ఇప్పు డొకసారి ఆత్మజ్యోతిని ప్రత్యక్షముగాచూచు టకు ప్రయత్నింతము. ఇప్పు డీ యుపాసనామందిరమునందు సూర్యప్రకాశము లేదు. సూర్యు డస్తమించెను. చంద్రకిరణ ప్రసారమును లేదు. ఇక్కడ కేవలము దీపపుకాంతి మాత్రమే యున్నది. ఒక్కసారి దీపము నార్పివేయుదము. ఇదిగో దీపపుకాంతియును పోయినది. మందిరమంతయు గాఢాంధకార బంధురమయినది. క్షణకాలము క్రిందట ఈ తేజోమయ మంది రమున నాసీనులయి యుండు మహాత్ము లగు ఏ బ్రహ్మోపాస కుల యొక్క స్నిగ్ధ మూర్తులయందు, మందస్మిత వదనార వింద ముల యందు, ఈశ్వరుని యొక్క ఆవిర్భావమును చూచి యానందించుచుంటిమో, ఆ మూర్తులు ఆ ముఖములు ఇప్పు

డదృశ్యములయినవి. మందిరము నిశ్శబ్దముగా నున్నది. ఈశ్వ రుని యొక్క మహిమలను వినుచు, మననము చేయుచు, తన్మ యత్వము నొంది, మన హృదయముల నాయనయందు సంల గ్నము చేసి ఎట్లు నిశ్చలమనస్కుల మయి యుంటిమో, ఇప్పు డును ఈ యంధకారావృత గృహమునందును, అట్లేయుందము. ఇప్పుడు శబ్ద శూన్యమును, ప్రకాశరహితమును అగు ఈ భవనమునందు, ఎవరును ఎవరిని చూడజాలరు. కాని, మన మందరమును, అంధకారమయమగు ఈ భజనమందిరము నందు ఆసీనులమయి యున్నను, బాహ్యజ్యోతు లన్నియు నిర్వాణ మయి మన చుట్టును అంధకారమే కానవచ్చు చున్నను, మన హృదయమందిరములయందు వెలుగుచుండు ఆత్మజ్యోతి మాత్రము ఆరిపోలేదు. మనలో ప్రతివారును ఆ యాత్మజ్యోతియొక్క ప్రకాశము వలననే తమ్ము తాము తెలుసుకొనగలుగుచున్నారు. తమ చుట్టునుండు చీకటిని చూడగలుగుచున్నారు. తమ హృదయములయందు జనించు చుండెడి భావములను తెలుసుకొన గలుగుచున్నారు. ఆత్మ ప్రభ జనకోలాహలమధ్యమున సూర్యచంద్రాది బాహ్య తేజస్సుల మధ్యమున ప్రకాశించినప్పటికంటె, ఈ నిశ్శబ్ద గృహమునందు ఈ చీకటి యింటియందు, ఇంకను ఉజ్జ్వలతర మయి ప్రకాశించుచున్నది. సత్యజ్యోతియగు పరమేశ్వరుని ప్రత్యక్షముగా దర్శించుట కిదే సమయము. జీవాత్మజ్యోతి యందే పరమాత్మజ్యోతి ప్రకాశించుచున్నది. జీవాత్మ యొక్క కారణము, ఆశ్రయము, సుహృత్తు, ఆ యంతర్యామి

యగు నమృతపురుషుఁడే. జీవాత్మ పరమాత్మను విడిచియుండ జాలదు. జీవాత్మయొక్క ఆవిర్భావమునందే పరమాత్మ యొక్క ఆవిర్భావమును దర్శింపుడు. ఎవనిని సూర్యచంద్రాది బాహ్య జ్యోతు లన్నియు ప్రకాశింపజేయలేవో, అట్టి పరమాత్మ యొక్క ప్రకాశము ఆత్మజ్యోతియందే కనబడుచున్నది. ఎవరు ఆయనను, బాహ్యమునందలి వెలుగులయందు, విశ్వము నందలి బృహత్తమములయిన పదార్థములయందు, జనన మరణప్రవాహమున బడి కొట్టుకొనిపోవు మహాపురుషులయందు, దర్శింప ప్రయత్నింతురో వా రెంత మూఢమతులు! అంతరాత్మ యొక్క దర్శనము అంతరమునందే. హృదయనాథునికొఱకు హృదయమునందే వెదుకవలయును. ప్రాణవల్లభుని ప్రాణము నందే దర్శింపవలెను. పరమాత్మను జీవాత్మయందే దర్శింప వలెను. జీవాత్మయొక్క సమస్త జీవనము, సమస్త శక్తులు, సమస్త జ్ఞానము, పరమాత్మనుండియే ప్రవహించు చున్నవి. జీవాత్మయందలి ప్రకాశ మంతయు పరమాత్మ ప్రకాశమే. బాహ్యజగత్తునందు పరమేశ్వరుని జ్ఞానము, పరమేశ్వరుని మంగళభావము, ఛాయా మాత్రముగా ప్రకాశించుచున్నవి. పరమాత్మయొక్క నిజతేజము, మానవహృదయమునందే. జీవాత్మయందే. 'త మేవ భాంతం అనుభాతి సర్వం, తస్యభాసా సర్వ మిదం విభాతి' ఆయన ప్రకాశమునందే లోకము నందలి సమస్తజ్యోతులును ప్రకాశించుచున్నవి. ఈ యనంత విశ్వమును ప్రకాశింపజేయునది ఆయన ప్రకాశమే. కాని, బాహ్యజగత్తునందలి ఈ ప్రకాశ మంతయు ఆయన ప్రకాశము

యొక్క ఛాయా మాత్రమే. ఆయన దివ్యతేజము మానవ హృదయమునందే—ఆయన ఉజ్జ్వలప్రకాశము జీవాత్మయందే. 'హిరణ్మయే పరే కోశే విరజం బ్రహ్మ నిష్కలం.' విరజమును, నిష్కలమును అగు బ్రహ్మతేజమును దర్శింపవలెనన్న హిరణ్మయకోశమునందే దర్శింపవలెను. ఆ హిరణ్మయాకాశము నందు కోటిసూర్య ప్రభలతో పరమాత్మ ప్రకాశించునప్పు డేమి తటస్థించును? అమావాస్యనాడు ప్రాతఃకాలమున సూర్య చంద్రులు ఉభయులును ఒక్కసారియే ఉదయ మయినప్పుడు ఏమి తటస్థించుచున్నదో అదియే తటస్థించును. చంద్రునికి స్వయంప్రకాశము లేదు. సూర్యకిరణములు తనమీాద పడని యెడల చంద్రుడు కళావిహీనుడు. సూర్యప్రకాశము వలననే చంద్రుడు ప్రకాశించుచున్నాడు అనుమాట స్పష్ట మగును. అట్లే జీవాత్మ పరమాత్మప్రకాశమువలననే ప్రకాశించు చున్నదని స్పష్టమగును. జీవాత్మయొక్క సమగ్రజీవనము ధర్మభావము, జ్ఞానము, ప్రేమ—ఈ సమస్త మంగళభావ ములయొక్క ప్రకాశము పరమాత్మనుండియే ప్రవ హింపుచున్నదని స్పష్ట మగుచున్నది. ఆయనయే ఆత్మ యొక్క మూలకారణము, ఆత్మయొక్క ఆశ్రయము అని విదిత మగుచున్నది. ఎప్పుడు హృదయాకాశమునందు పరమాత్మ ప్రభలు దేదీప్యమానముగా ప్రకాశించుచుండునో, అప్పుడు మానవునకు తన క్షుద్రజీవితమువయి లక్ష్య ముండునా? ప్రచండతేజస్వంతమగు సూర్యమండల సాన్నిధ్యమున చంద్రకాంతులకు దీప్తి యెక్కడిది? పరమాత్మ ప్రభ యెదుట

జీవాత్మయొక్క క్షుద్రభావములకు ప్రభావ మెక్కడిది? ఎవడు మహోత్తముడో, ఎవడు పూర్ణమంగళ స్వరూపుడో, ఎవడు నిష్కళంక పవిత్రుడో, ఎవడు నిరవద్యుడో, నిరంజనుడో- ఆయనను దర్శించి ఆయన దివ్యసుందర స్వరూపముచే మోహపరవశుడయి, ఆయనయందు తన ప్రేమను లగ్నము చేసినప్పుడు, మానవునకు ఇక తనమీద ప్రేమ యెక్కడ నుండును? సమస్త స్వార్థపరత్వమును, సమస్త అహంభావమును చూర్ణము కాదా? మన ప్రేమను మన జీవనవల్లభు డగు హృదయసమ్మోహన మూర్తినుండి అన్యవిషయములపయి మరల్పగలమా? మన హృదయమును ఆయననుండి తప్పించి మన క్షుద్రభావముల వైపునకు మరల్పగలమా? అట్లింత మాత్రము చేయలేము. మన హృదయము మనకు వివశ మగును. సకల భావములు, సమస్త ప్రేమ, సమగ్రహృదయము ఆయనకే అర్పింతుము. ఆయనయందు ప్రేమ ఉజ్జ్వల మయినకొలదిని మన యందలి ప్రేమ అస్తమించుచుండును. మన ప్రేమ ఆయనయం దుంచబడి, మన హృదయము పవిత్రము చేయబడినప్పుడు, మనము తిరిగి సంసారమువైపునకు మరలితిమా, అప్పుడు సంసారము ఎంత శోభాయుక్తము, ఎంత జ్యోతిర్మయము? మన ప్రేమవాహిని పరమేశ్వరుని మంగళచరణారవిందసంస్పర్శమువలన పవిత్రమయి నిమ్నగామి యయి సంసారమునకు దిగి, పృథివి యందలి సమస్త స్థానములను, సమస్తకాలములను, సమస్త సంబంధములను అమృతమయముగా చేయును. ఈశ్వర- ప్రేమికు లగు మహాత్ము లందరు ఆ పూర్ణమంగళ స్వరూపుని యొక్క

ఆదర్శమును పొందియే శాంతాత్ము లగుచున్నారు. ఆయన శోభను దర్శించియే సుశోభితు లగుచున్నారు. ఈశ్వరుని యొక్క మంగళభావములను తా మెంతవరకు తమ హృదయములయందు స్థాపించుకొనగలిగిరో తా మంత కృతార్థుల మయితి మని భావించుచున్నారు. ఆయనను విడిచినయెడల, తమ హృదయము ఎంత పాపభూయిష్ఠ మగునో, ఆయనతో సహవాసము చేసినయెడల, తమకు ఎంత మహత్త్వము లభించునో, ఇది యంతయు అనుభవపూర్వకముగా తెలిసికొనగలుగుచున్నారు. ఈశ్వరునియొక్క సుందర మంగళ భావములలో వారు లేశమాత్రమయినను పొందగలిగిన యెడల, ఆ మంగళభావ లేశము నఖిల భూమండలాధిపత్యముతో నయినను మార్చుకొనుట కిచ్ఛగింపరు. ఈశ్వరుని యొక్క ఆ మంగళభావమే వారికి సమస్తైశ్వర్యమును. పరబ్రహ్మదాసుల భాగ్యము పరబ్రహ్మోపాసనమే. ఆయన సాన్నిధ్యమునవారికి రాజ్యము గాని, ఐశ్వర్యము గాని రుచింపదు. మనము దుర్బలులము. ఈ క్షణమునందు ఆయనయొక్క ఏ మంగళభావమును మననము చేసి ఆనందపరవశుల మగుచున్నామో, ఆ బ్రహ్మానందరసమును మన హృదయములయందు స్థిరముగా ధారణ చేయజాలకున్నాము కాని, ఆ కల్యాణగుణాకరుని యొక్క క్షణకాలప్రకాశ మయినను మనకు నవజీవనము నిచ్చుచున్నది. మన హృదయముల యందు ఆయన యావిర్భావము విద్యుల్లతవలె తళుక్కున మెరసి తిరిగి అంతరించి పోవుచున్నది, ఉదయించు చున్నది, అస్తమించు

చున్నది. మన కిప్పు డాయన క్షణక్షణము తన యాలింగన సౌఖ్యమును సమకూర్చుచు, ముందు ముందు, మన మాయన దయకు యోగ్యుల మయిన యెడల మనకు తన శాశ్వతాలింగన సౌఖ్యమును దయచేయునని ఆశలను పురిగొల్పుచున్నాడు. మన మిట్టి దుర్బలుల మయ్యును, క్షణకాలమయినను ఆయన యొక్క ప్రకాశమును చూడగలుగుచున్నాము. ఇది సామాన్య భాగ్యము కాదు. ఇందువలన, భావికాలమునందు ఆయన తనయొక్క ఉజ్వలతర మగు ప్రకాశమును మనకు దయచేయునని, తన మంగళమయ మగు ఇచ్ఛను మనకు చూచాయగా సూచించుచున్నాడు. మనము, మనకు గలిగిన ఈ ముహూర్తకాల మాత్ర ఆనందమును అనుభవించి ధన్యుల మయితి మని అనుకొనుచున్నాము. ముందు చాల కాలము ఇట్టి బ్రహ్మానందము ననుభవింప గలిగిన యెడల మన యదృష్ట మేమని చెప్పుదును? అట్టి భాగ్యము నార్జించుటకు మనము ఇయ్యజాలని దేమి కలదు? మన మశక్తులము. ఒక క్షణమందు ఇట్టి బ్రహ్మానందము మన హృదయములయందు వెల్లువ యయి ప్రవహింపుచుండును. మరుక్షణమందు ఆప్రేమ ప్రవాహ మింకిపోయి, శుష్కహృదయుల మయి, నీరసుల మగుచుందుము. ఆ భూమానందమే మన హృదయముల యందు చిరస్థాయిగా నున్న యెడల, ఐహికభోగములు, నశ్వర సుఖములు, మన హృదయముల నాకర్షింపగలవా? ఇప్పుడు క్షణక్షణము, ఈశ్వర ప్రకాశము మెఱుపువలె మెఱసి, మన సమగ్ర జీవనమును మార్చివేయుచున్నది. ఈశ్వర కృపవలన,

ముందు ఆయన ప్రకాశము మన హృదయములయందు, సూర్యప్రభ వలె, నిలిచి వెలిగినయెడల మన భాగ్య మేమని చెప్పుదుము? క్షణకాలానందము ననుభవించినంత మాత్రముననే మన సమస్తకష్టములును దూరమగుచున్నవి. సమగ్ర పృథివీమండలమును మనకు శత్రు వయి ఎదుర్కొనన నిండు. మన యాత్మలు, ఆ యమృత సింధువునుండి బిందుమాత్రా మృతము నయినను ఆస్వాదింపగలిగిన యెడల, సమస్త పృథివీమండలమును తృణప్రాయముగా చూడ గలుగునంతే బలయుతుల మగుదుము. పగటి తరువాత రాత్రియు, రాత్రి తరువాత పగలును వచ్చునట్లు ఇప్పుడు మన హృదయముల యందు ఈశ్వరావిర్భావము ఉదయాస్తమయము లగుచున్నది. ముందు ముందు ఆయన యావిర్భావము అస్తమింపక, నిరంతరోదయ మయి, మధ్యందినమార్తాండునివలె, దివ్య ప్రభలతో, అవిచ్ఛిన్నముగా వెలుగుచుండును. మన మిక్కడ ముందుగా నిట్టి శిక్ష నభ్యసించుచున్నాము. దిన దినమును మన హృదయమునందు ఈశ్వరప్రకాశ మెంత లభించినదో, ఆయన తోడి యోగము మన కెంతవరకు కుదిరినదో, ఆయన కొరకు మన మెంత త్యాగము చేయ గలుగుచున్నామో అని మనలో ప్రతివారును ఆత్మపరీక్ష చేసుకొను చుండవలయును. 'ఎంత ధనమును, గౌరవమును, ఖ్యాతిని, పలుకుబడిని, సంపా దింపగలిగితిని?' అని మురియుచుండుటవలన లాభము లేదు. ఇట్టి క్షణభంగురభోగములతో, ఆయుఃక్షీణము చేసుకొని నందువలన లాభ మేమి? మనుష్యమాత్రునికి మరణము నిశ్చ

యము. శరీర పతన కాలమున మనము కట్టిన మేడలు, ఆర్జించిన ధనము, బంధు మిత్రాదులు, దార పుత్రాదులు సమస్తమును విడిచి ఒంటరిగా ప్రయాణము చేయవలసియున్నది. చిల్లి గవ్వయైనను మన వెంటరాదు. నాటిమాట స్మరణకు తెచ్చుకొనుడు. అప్పుడు కలుగబోయెడు నిరాశాంధకారమును పోగొట్టుటకు ఇవన్నియు నిరుపయోగములు. ఏ ధనము నిత్యధనమో, ఏ ఐశ్వర్యము అక్షయ ఐశ్వర్యమో, ఏది మన వెనువెంట నంటి వచ్చునో, దేనికొరకు మన పూర్వ పురుషులు తమ జీవితములను ధారపోసియుండిరో, ఆ ధనమును ఆ ఐశ్వర్యమును నే నెంత సంపాదించితిని? మనము వేసుకొనవలసిన ప్రశ్న యిది. మనము పెట్టుకొనవలసిన లెక్క ఇది. ఇట్టి ధనమును సంపాదింప గలిగిన యెడల, సమస్తమును పొందినట్లే. కాని, ప్రపంచమునందు ఎట్టి విపరీత భావము! లోకులు ధర్మమును ఎంత నిరసనభావముతో చూచుచున్నారు! ధనమానాది క్షుద్రవిషయములకయి ఏమి పరుగులెత్తుచున్నారు! రవంత గౌరవము కొఱకు, అణుమాత్ర యశము కొఱకు, పిడికెడు ధనము కొఱకు, ధర్మమును, ఈశ్వరుని, విడనాడుచున్నారు. ఏమి యాశ్చర్యము? ఏమి మోహము! తెలిసియుండియు తెలియని మూర్ఖులవలె ప్రవర్తించుచున్నారు. మోహము వచ్చి ఆవరించి, కన్నులు మూసి, సత్యమును ధర్మమును గనుగొన లేకుండ జేయుచున్నది. సోదరులారా! మేల్కొనుడు. మహైశ్వర్య సంపన్నుడగు జగదీశ్వరుని శరణ్యము పొందగలిగిన యెడల ఆ యక్షయధనమును, ఆ చిర

సంపదను మనము చిరకాల మనుభవింపగల మను ఆశ మన హృదయములయందు ఆనంద ప్రవాహమును ప్రవహింప జేయుచున్నది. క్షణభంగురములు, దుఃఖ భాజనములు అగు విషయసుఖములు మనకు తృప్తి నియ్యజాలవు. ఎవనిని సూర్య చంద్రులు ప్రకాశింప జేయలేరో, ఆయన ప్రకాశమును మన మిప్పుడు సూర్యచంద్రులవలె చూడగలుగుచున్నాము. ఇప్పటి మన తాత్కాలిక అనుభవము వలన దానిని దిజ్మాత్రముగా తెలుసుకొన గలుగుచున్నాము. దీనిని సాధనచేసి, ఈశ్వర కృపవలన చిరస్థాయిగా నుంచుకొన గలిగిన యెడల, దుఃఖ మెక్కడ? శోక మెక్కడ? మోహ మెక్కడ? లోకమునందలి సమస్త దుఃఖముల నవలీలగా సహింప సమర్థుల మగుదుము. దుర్బలశరీరము సబల మగును. నిర్వీర్యహృదయము వీర్య వంత మగును. ఇట్టి యాశలకు బలము లేదా? ఈ యాశలు మనకు మార్గదర్శకములు కావా? ప్రత్యక్షమునకును, ఆశలకును సమ్మె ళనము చేసినప్పుడు సంశయాంధకారము విచ్ఛిన్నము కాదా? కోటికోటి సూర్యులు ఎవనిని ప్రకాశింపఁజేయలేరో, అట్టి అద్వైత పరబ్రహ్మమూర్తి మన హృదయములందు ప్రత్యక్ష ముగాఁ బ్రకాశించుచున్నాడు. ఇది మన కిప్పుడు ప్రత్యక్ష సిద్ధము. మన మాయన కృప కర్హుల మయినయెడల, ఆయన మన హృదయములందు చిరస్థాయిగా నుండును. ఇది మన యాశ. ఈ యాశాప్రత్యక్షములకు శీఘ్ర సమ్మేళనము సమ కూరును గాక!

ఓ సత్య ధర్మస్వరూపా, నీవు నా హృదయమునందు

చిరస్థాయిగా నుందువని ఆశలను పురికొల్పు చున్నావు. ఆ యాశలు త్వరలో ఫలింపఁజేయుదు వని విశ్వసించుచున్నాను. నీతోడి దీర్ఘ వియోగమును సహింప లేకున్నాను. నేను నీ సముఖమున పరిపూర్ణానందముతో నుండగల దినముకొఱకు, నీతోడి నిత్యసహవాసము లభింపగల దినము కొఱకు, ఇంకను ఎంత కాలము కనిపెట్టికొని యుండను? ఓ పరమాత్మ స్వరూపుడా, నీవు శరణాగత వత్సలుఁడవు. ఇదిగో, నీ శరణ్యమును వేడు చున్నాను. నేను నీ సన్నిధానమునకు వచ్చినది, దేనివలన అందరు నన్నాదరింతురో, దేనివలన నన్నందరు సన్మానింతురో, అట్టి ఐహికధనమానయశస్సులకొఱకు గాదు. వీని నిమ్మని ప్రార్థించుటకయి నేను నీదగ్గరకు రాలేదు. నేను నీకు శరణాపన్నుఁడ నయినది, నీ యాదేశముల పరిపాలనము నడచుటకు అంతరాయముగా నున్న నా హృదయ దౌర్బల్యమును తుడిచివేసి, నీ యాజ్ఞలను పాలించుటకు తగిన బలము నొసంగుదు వని, పాపకళంకిత మగు నా హృదయమును కడిగి పరిశుద్ధపఱుతువని, ధన మాన యశస్సుల కొఱకయి పరితపించు చున్న నాహృదయమును నీవశము చేసుకొందువని, పతితపావనా! నీ యమృతమయమగు సహవాససుఖమున నిరంతరము అనుభవింపగోరుచున్నాను. ఇదే నాయభీష్టము. ఇదే నాయాశ. దీనబంధూ! నా యీ యాశను సఫలము చేయుము. నిష్కపటహృదయముతో, నీ సరళమార్గము నవలంబించి నాజీవితమును గడపగలుగుదును గాక! నీ యనుగ్రహమువలన సంసారమునందలి సకల కష్టములను శాంత హృదయముతో సమాహిత

చిత్తముతో భరింపగలుగుదును గాక! ప్రేమమయ మగు నీ దృష్టియందే ప్రేమ పూరిత మగు నా నేత్రము నిరంతరము చూడ్కి నిగుడించియుండు గాక! నీ మంగళేచ్ఛకు స్వాధీనుడ నయి సమస్త కార్యములను నీ యిష్టానుసారముగా నిర్వహింతును గాక! ఇదే నా ప్రార్థన. నాకిక వేరు ప్రార్థన లేదు.

ఓమ్. ఏకమేవాద్వితీయమ్.

---

ఓమ్ తత్సత్.

# మహర్షి మహోపదేశములు

## ౧వ ఉపదేశము

"ప్రాణో హ్యేష యః సర్వభూతై ర్విభాతి —

ఎవడు సర్వభూతములయందును ప్రకాశించుచున్నాడో అతడు ప్రాణస్వరూపుడు. ఈ సత్యము మన యాత్మలయందు ముద్రిత మయి యున్నది. హృదయాంతరాళమునందే ఈశ్వరుని యొక్క ఉజ్జ్వలప్రకాశము, ఆత్మజ్యోతియందే ఆ సత్యజ్యోతి యొక్క ప్రకాశము. సూర్యచంద్రులు, నక్షత్రములు, మెఱపులు, మొదలగు భౌతికజ్యోతు లేవియును ఆ సత్యజ్యోతిని ప్రకాశింప జేయజాలవు. ఆత్మయొక్క ఉజ్జ్వల కోశ మధ్యమునందే నిర్మలుడును నిరవయవుడును అగు ఆ పరమాత్మ విరా

జిల్లుచున్నాడు. ఆయన మనకు అంతరతముడును ప్రియతము డును అగు పరమేశ్వరుడు. ఇచ్చటనే, ఈ భజనాలయమునందే ఆయన సాక్షాత్కారమును పొందుదము. పవిత్రమగు ఈ యుపాసనామందిరమునకు వచ్చియు ఆయన యావిర్భావ మును దర్శింప లేనియెడల, ఇక్కడకు ఎట్లు వచ్చితిమో అట్లే శూన్యహృదయములతో మన గృహములకు మరలి పోయిన యెడల ఏమిలాభము? ఈ సత్యమును ఒకసారి మన యనుభవమునకు తెచ్చుకొనుటకు ప్రయత్నింతము. ఇప్పుడే ఆయన దర్శనలాభమును పొంది కృతార్థుల మగు దము. ఈ వేదికనుండి అనేకసార్లు ఈ యుపదేశమును మరల మరల పొంది యున్నాము. ఇది ఎన్ని సారులు చెప్పినను ఎన్నిటికిని పురాతనము కానేరదు. ఇది మన హృదయఫలకములయందు స్వర్ణాక్షరములతో లిఖించు కొనవలసిన యుపదేశము. పరమాత్మ అంతరమునకు అంత రుడు. హృదయాంతరాళమున వెలుగుచుండు దివ్యజ్యోతి. హృదయాంతర్భాగముననే ఆయన యుజ్జ్వలప్రకాశము చూడనగును. ఇప్పుడే ఈ సత్యమును ప్రత్యక్షానుభవము వలన తెలుసుకొందము. 'ప్రాణో హ్యేష యః' ఆయన అందరి యొక్కయు ప్రాణస్వరూపుడు. ఏ పుణ్యాత్ముడు తన హృద యాంతరముననే ఈ పరమాత్మ రూప సూర్యునియొక్క ప్రకా శమును దర్శించుచున్నాడో, ఏ ధార్మికుడు ఈ సత్యజ్ఞాన జ్యోతియొక్క జాజ్వల్యమానప్రకాశమును ఆత్మయందే సూర్యప్రభవలె ప్రజ్వలితమయి యుండుటను చూచుచున్నాడో,

అత డీ సంగతిని తెలుసుకొనుచున్నాము. పరమేశ్వరుడు ప్రాణ స్వరూపుడు. అతడు మృత్యుస్వరూపుడు కాడు. అతడు అమృతస్వరూపుడు. అందరియొక్కయు ప్రాణ మతడే. ఎవడు మన యాత్మయందు ప్రకాశించుచున్నాడో మన మాయనను ఆత్మయొక్క ప్రాణస్వరూపు డని తెలుసుకొను చున్నాము. మన దేవత నిద్రపోవు దేవత కాదు. అతడు చిరజాగృతుడు. అతడు జీవవంతుడగు దేవత. అతడు ప్రాణము. అతడు సమస్త జగత్తుయొక్క ప్రాణము. అతడు సమస్త ప్రాణులయొక్క ప్రాణము. ప్రాణస్వరూపుడును, అందరిచేతను ఆరాధింపబడ దగినవాడును అగు ఆ పరమదైవతమును ఎప్పుడు మన హృదయమునందు సాక్షాత్తుగ దర్శింతుమో అప్పుడే మన యుపాసన సార్థక మగును. మనకు ప్రత్యక్షముగాని దేవతను, మన పిలుపున కందని దేవతను, మన మెట్లుపాసింపగలము? ఎప్పుడు ఆయన ప్రేమనేత్రమును మననేత్రము దర్శింపగలుగునో, అప్పుడే మన యారాధన యథార్థ మగును. ఉపాసనాసమయమునందు ఆయనను దర్శింపలేకపోయినయెడల, ఆయనకు ఎట్లు భక్తిపూర్ణహృదయములతో ప్రణామములు సమర్పింపగలుగుదుము? ఎట్లు అశ్రుపూర్ణ నయనములతో, పశ్చాత్తప్త హృదయములతో ఆయన సాన్నిధ్యమున జేరి మన పాపములు క్షమింపు మని ఆయనను ప్రార్థింపగలము? మన మెప్పుడయినను మృతకళేబరములతో, ప్రాణవిహీన శరీరములతో, సంభాషించుటకు బ్రయత్నింతుమా? మనము అమృతస్వరూపుడును ప్రాణ స్వరూపుడును అయిన

పరమద్వైవతము యొక్క ఉపాసకులమయి యుండియు, నాయన కత్తితో చెక్కబడిన, రాతితో మలచబడిన, మట్టితో చేయబడిన నిర్జీవవిగ్రహము వంటివాడు కాడని తెలిసికొనలేమా? సకలసమయముల యందును ఆయన ప్రకాశము జాజ్వల్యమానముగా వెలుగుచుండుటను చూతము. ఇదే మన కోరిక. ఇదే మన ప్రార్థన. మనము కడు దుర్బలుల మగుటచే నట్లు నిరంతరము ఆయన ప్రకాశమును చూడలేక పోయినను, ఎప్పుడు ఆయనను పూజించుటకు వచ్చియుంటిమో, ఎప్పుడు ఆయన పవిత్రచరణారవిందములయందు భక్తి పుష్పములను సమర్పించుటకు సంసిద్ధుల మగుచున్నామో, ఎప్పుడు ఆయన మహిమగా నముచే మన జీవితములను సార్థకపరచుకొనుటకు అభిలషించుచున్నామో, అప్పుడయినను ముందుగా ఆయన సుందరవదనారవిందమును దర్శింపవలదా? ఆ విశుద్ధ జ్ఞానజ్యోతిని ప్రత్యక్షముగా దర్శింపని యెడల, మన మనస్సులయందలి భావములను ఆయన కెట్లు నివేదింపగలము? ఆయన ప్రేమనేత్రము నా పయి పడియున్నదని నేను చూడలేనియెడల నా ప్రేమ ఎవరివైపునకు ప్రవహింప గలదు? ఇప్పుడే, ఈ మంగళ సమయముననే, ఈయారాధన కాలమునందే ఆయనయొక్క ప్రకాశమును చూతము. ఆత్మజ్యోతియందే ఆయన ప్రకాశమును దర్శింతము. ఆయన అందరికిని ప్రాణస్వరూపుడు. సర్వవ్యాపియగు ఆ యమృతపురుషుడు మన చుట్టునుండు జడప్రపంచములోను, మన యాత్మలలోను, పడుగయి పేకయి, ఆధారమయి, ఆధేయమయి, ఓతప్రోత భావ

ముగా వ్యాపించి యున్నాడు. ఆయనకు ప్రేమపుష్పముల నర్పించుటకు విరతులము కాకుందుముగాక? మన హృదయము లందు ఇట్టి శుభోద్దేశము కలిగిన యెడల మన యుద్దేశములు తప్పక ఫలించును. ఇప్పుడు ఏమి జరుగుచున్నదో చూడుడు. ఈశ్వరుని దర్శింతమను అభిప్రాయము, మనలో నుదయించిన వెనువెంటనే మన కాయన ఇక్కడనే దర్శన మిచ్చుచున్నాడు. ఈ యారాధన గృహమును తేజస్వంతముగా చేయుచున్న వెలుగునందే ఆయన ప్రకాశమును జాజ్వల్యమానముగా చూచుచున్నాము. మన హృదయాంతరాళముల యందు నిష్కళంకు డగు ఆ దివ్యసుందర పురుషుని యొక్క సాక్షాద్దర్శనమును చేయుచున్నాము. మన ముపాసించు దేవత చిరజాగృతుడు, చిరజీవవంతుడు. మన శరీరమే ఆయన మందిరము, మన ఆత్మయే ఆయన పీఠము. అక్కడనే ఆయన సర్వకాలములయందును సాక్షిరూపు డయి ప్రకాశించుచున్నాడు. చూడుడు! మన కాయన ఎంత మహత్తమ మయిన స్వాతంత్ర్యమును దయచేసి యున్నాడో! ఆయనను దర్శించుటకు మనము కాశ్యాదిమహాక్షేత్రములకు వెళ్ల నక్కరలేదు. ఆయనను చూడవలెనని మన మెప్పుడు ఇచ్ఛింతుమో, ఆయనను నమస్కరింతు మని మన మే క్షణమున నభిలషింతుమో, ఆ నిమిషమునందే, మన యాత్మల యందే. ఆయన యొక్క అధిష్ఠానమును చూచుచున్నాము. సూర్యచంద్రులు, ఓషధులు, వనస్పతులు, మహోదధులు, గిరిశృంగములు, ఆయనకు జీవాత్మవంటి ప్రియని కేతనములు

కావు.సమస్త మందిరములలోను హృదయమందిరమే ఆయనకు ప్రియతమమయిన నివాసస్థానము మానవ హృదయమే ఆయన నిజతేజముతో, విహరించు విహారభూమి. తన జగన్మోహనాకారముతో నాట్యము చేయు రంగస్థలము. విజ్ఞానమయుడును, అమృతమయుడును, అగు ఆ పరమపురుషుడు సర్వకాలములయందును, సమస్త ప్రదేశములయందును విరాజిల్లుచున్నారు. అమృతమయు డగు ఆయనతో వియుక్తమయిన దానినిగా, స్వతంత్రమయిన దానినిగా చూచిన యెడల సమస్త ప్రపంచమును మృత్యుస్వరూపమునే ప్రదర్శించును. సత్యస్వరూపుడగు ఆయననుండి విడదీసి చూచిన యెడల, సమస్తమును అసత్పదార్థముగనే కానవచ్చును. ఆ ప్రాణ స్వరూపుని యొక్క యధిష్ఠానమునందే సకల ప్రాణులును జీవించుచున్నవి. ఆయన 'చేతనం చేతనానాం'. సమస్త ప్రాణులయొక్కయు ప్రాణము. ఆ చైతన్య మూర్తియొక్క ప్రకాశము వలననే, లోకమునందలి సమస్త చేతనములును చైతన్యమును పొందుచున్నవి. ఆ సత్యస్వరూపుని సాన్నిధ్యమును పొందియే, ఈ జగత్తంతయు సత్యమయి తోచుచున్నది. ఆ యమృత స్వరూపుని ఆశ్రయము వలననే మనుష్యుడు అమృతత్వమునకు అధికారి యగుచున్నాడు. మనము అమృతుని పుత్రులము. అందు చేతనే మనము అమృతుల మగుటకు అర్హుల మగుచున్నాము. ఎంతకాలము మనము విషయ ప్రపంచముయొక్క అధీనమం దుందుమో, అంతవరకును మనము మృత్యుపాశముచే బంధింపబడియున్నాము.

మృత్యుముఖమున ప్రవేశించియున్నాము. ప్రపంచము నందలి సమస్తమును మృత్యుస్వరూపమే. ఈ విశ్వమునందు అణువు మొదలుకొని బ్రహ్మాండము వరకును సమస్తమును క్షణక్షణ మును మారిపోవుచున్నది, వినాశము నొందుచున్నది. నిత్యమని చెప్పగలిగిన దొక్కటియును లేదు. దీనియందు అమృతభావ మెంతమాత్రమును లేదు. ప్రపంచము మృత్యువుయొక్క ప్రతిబింబమే. ఈశ్వరుడు మాత్రమే అమృత నికేతనుడు. ఆయనతో మనకు గల సంబంధమును స్థిర పరచుకొనిన యెడల, మనము విశ్వాతీత మగు జ్యోతిర్మయ బ్రహ్మధామమును దర్శింపగలము. అప్పుడు మనము 'యదిదం కించ జగత్సర్వం, ప్రాణ ఏజతి నిస్సృతం। మహద్భయం వజ్ర ముద్యతం, య ఏత ద్విదు రమృతా స్తే భవంతి।' అని చెప్పగలము. ఈ సమస్త జగత్తును ఆ పరమాత్మ నుండియే వచ్చినది. ప్రాణస్వరూపు డయిన ఆయనయందే ప్రకాశించు చున్నది. అతడే ఈ సమస్తబ్రహ్మాండములకును ప్రాణము. విశ్వమునం దేదియును ఆయన యాజ్ఞలను మీరజాలదు. ఆయన కఠోరశాసనముల చేతనే సమస్త భూతములును తమ తమ కార్యములను యథోక్తముగా నిర్వహించుచున్నవి. పాపాసక్తు లయి, ఆయన ధర్మనియమములను ఉల్లంఘించు వారికి, ఆయన, వజ్రాయుధమును చేత బూని దండింప నుద్యుక్తుడయిన ప్రభువవలె మహాభయంకరుడయి యుండును. పరమేశ్వరు డిట్టివాడని ఎవరు తెలుసుకొను చున్నారో వారు

అమృత స్వరూపు లయి శాశ్వత బ్రహ్మానందమును అనుభవించు చున్నారు అని చెప్పగలము.

'ఏష దేవో విశ్వకర్మా మహాత్మా, సదా జనానాం హృదయే సన్నివిష్టః । హృదా మనీషా, మనసాభిక్లృప్తః య ఏత ద్విదు రమృతా స్తే భవంతి।' అని చెప్పగలము. మహాత్ముఁడగు ఏ పరమేశ్వరుడు ఈ సమస్త విశ్వమును నిర్మాణము చేసెనో, అతడు మానవుల యొక్క హృదయ మందిరములయందు సదా నివసించుచుండును. సంశయ రహితమయిన మనస్సుతో ఎవరు ఈ సంగతిని తెలుసుకొనుచున్నారో వారు అమృత పుత్రులయి మహానందమును అనుభవింపు చున్నారు అని చెప్పగలము.

'న సందృశే తిష్ఠతి రూప మస్య, న చక్షుషా పశ్యతి కశ్చ నైనం । హృదా మనీషా మనసాభిక్లృప్తః, య ఏనం విదు రమృతా స్తే భవంతి ।' అని చెప్పగలము. పరమేశ్వరుని యొక్క రూపము మన నేత్రములకు దర్శనవిషయము కాదు. ఆయన నెవ్వరును ఈ చర్మచక్షువులతో దర్శింపలేరు. హృదయ పూర్వకమయిన, సంశయ వివర్జితమయిన, జ్ఞానదృష్టి చేత నే ఆయనను దర్శింపవలెను. ఏకాగ్రచిత్తు లయి జ్ఞాన నేత్రముతో ఆయనను దర్శించువారు, అమృత స్వరూపు లయి అక్షయ బ్రహ్మానంద సుఖమును అనుభవించుచున్నారు, అని చెప్ప గలము.

ప్రాణస్వరూపుడగు ఆ పరమేశ్వరునితోడి యోగమును ఎవరు సాధింతురో వారు మృత్యుముఖమును జూచియు భయము

నొందరు. తాము అమృతపుత్రుల మని తెలిసికొన స్థిర చిత్తులయి భయరహిత మగు నిత్యపదవిని పొంద గలుగుదురు. అమృతుని సంతానమునకు మృత్యుభయ మెక్కడిది?

మనయాత్మ, ఆయన సింహాసనము. ఆయన మనకు ఉపాసింపదగిన దేవత. మన యుపాసన బాహ్యోపాసన కాదు. ఆంతరోపాసన. మన మాయనను ధూప దీపాదులతోను, గంధాక్షతలతోను, ఉద్యానవన పుష్పములతోను, బిల్వాది పత్రములతోను పూజింపము. మన మాయనను మన హృదయో ద్యానమునందు పుష్పించు భక్తి, ఇంద్రియ నిగ్రహము, సత్యము, శౌచము, మొదలయిన పుష్పములతో పూజింతుము. మన మాయన పాదములను గంగాదినదీతోయములతో అభిషేకము చేయము. మన మాయన పాదపద్మములను పశ్చాత్తాప జనిత శోకాశ్రువులతో కడుగుదుము. మన మాయన స్వరూపమును ఈ నేత్రములతో దర్శించుటకు ప్రయత్నింపము. జ్ఞాన నేత్రముతోనే, మన యాత్మలయందే ఆయన యావిర్భావ మును దర్శింతుము. ఈ యాదర్శ ఉపాసననే మనము చేయగలిగిన యెడల మనకు ఎట్టిమహత్తమ మయిన ఆనందము లభ్యమగును! ఆయనను బ్రత్యక్షముగా దర్శింపవలె ననెడి కుతూహలముతో, ఎంద రెందరు ఎన్నెన్ని విధముల కష్టసాధనలను చేయుచున్నారు! ఎంతెంత కఠోర మగు తపస్సుచే శరీరములను కృశింపజేయుచున్నారు! జీవాత్మకును పరమాత్మకును గల సన్నిహిత సంబంధమును గుర్తింపజాలక, ఎంద రెందరు బాహ్య క్రియాకలాపములతో, యజ్ఞయాగాది బాహ్యాడంబరములతో

విగ్రహారాధనాది బాహ్యానుష్ఠానములతో, ఆయనను సమీపింపబోయి, విఫలమనోరథు లయి, నిరాశతో వెనుకకు మరలి వచ్చుచున్నారు? కనుకనే ఈ యుపనిషద్వాక్యము బ్రాహ్మ ధర్మమునందు ఉల్లేఖింపబడినది. 'యోవా ఏతదక్షరం గార్గి, అవిదిత్వా, అస్మిన్ లోకే జుహోతి, యజతే, తపస్తప్యతే, బహూని వర్షసహస్రాణి,అన్తవదేవాస్య తద్భవతి!' ఎవరు పరమాత్మ స్వరూపుడగు ఆయనను తెలుసుకొనక దీర్ఘాయుష్మంతుడయి వేలకొలది సంవత్సరములు యజ్ఞయాగాది బాహ్యాడంబరములతో, చాంద్రాయణాది వ్రతములతో, కఠోర తపస్సులతో జీవితము గడపినను తాత్కాలికానందమే గాని, నిత్యమును అక్షయమును అగు బ్రహ్మానందము లభింపదు. బాహ్యక్రియా కలాపములచే లోకుల మన్ననను పొందవచ్చును, కీర్తి సంపాదింపవచ్చును, మహనీయు డనిపించుకొన వచ్చును. కాని, ఈశ్వరునితోడి యోగము మాత్రము లభింపదు. ఆయనను హృదయమునందు దర్శించి, ఆయన వాణిని విని, ఆయనకు ప్రియములయిన సద్ధర్మముల నాచరించిన వారికే, సర్వజనప్రార్థనీయమును, అక్షయమును అగుబ్రహ్మానంద సుఖము లభింపగలదు. పరమేశ్వరుని కృపవలన మన మెట్టి సౌభాగ్యమును పొంద గలిగితిమి! మనము శాంత మనస్కుల మయి సమాహితచిత్తముతో, మన యాత్మలయందే, ఆ పరమదైవతము యొక్క సాక్షాద్దర్శనమును పొందగలిగిన యెడల, ఆయన యనుగ్రహమువలన ఆయన శక్తివిషయమయి సంశయము లేనివార మయి, సకలపాపములను అతిక్రమింప గలము. పూజనీయు

లగు సనాతన మహర్షులవలె ఆయన సత్యస్వరూపమునందు సందేహము లేని వారమయి ఆయనయొక్క యావిర్భావమును ఎప్పుడు సర్వత్రి చూడగలుగుదుమో, ఎప్పుడు సత్యజ్ఞానానంత స్వరూపుడగు అద్వైతపరబ్రహ్మమును మనహృదయములయందు ప్రత్యక్షముగా దర్శింపగలుగుదుమో, ఆయన కన్నెప్పుడును మన మీదనే యున్నదని మన మెప్పుడు తెలుసుకొనగలుగుదుమో, ఆయనతో మనకు గల సంబంధము అత్యంత సామీప్య సంబంధమనియు, ఆయనకును మనకును మధ్య ఆకాశమాత్రి వ్యవధాన మయినను లేదనియు, ఎప్పుడు తెలుసుకొందుమో, ఆయన తండ్రి, మనము బిడ్డలము, ఆయన గురువు, మనము శిష్యులము, ఆయన తల్లి, మన మామె ప్రేమధనము అని ఎప్పుడు తెలుసుకొందుమో, అప్పుడే 'త్వం హి నః పితా, యోస్మాకం అవిద్యాయాః పరం పారం తారయసి' అని స్తవము చేయగలుగుదుము. మమ్మును అంధకారమయమగు ఈసంసారముయొక్క అవతలి గట్టునకు చేర్పగల మాతండ్రిని నీవే అని మనఃపూర్వకముగా ఆయనను స్తుతింపగలము. అప్పుడే 'మాతేవ పుత్రాన్ రక్షస్వ, శ్రీశ్చ ప్రజ్ఞాంచ విధేహి నః' అని వేడగలము. తల్లివలె మమ్ము రక్షింపుము, మాకు సంపద నిమ్ము, ప్రజ్ఞ నిమ్ము అని హృదయపూర్వకముగా ప్రార్థింపగలము. అభయప్రదాత యగు తండ్రియు, జ్ఞానప్రదాతయగు గురువును, ప్రేమస్వరూపిణి యగు తల్లియు, అతడే యని తెలిసికొని, ఎప్పుడు ఈ మూడు భావములను అద్వితీయుడగు అతని యందే సమావేశము చేయగలుగుదుమో, అప్పుడు

ఆయన మీదనే భారము వేసి ఎంత గాఢ విశ్వాసముతో నుండగలము! ఆయన ప్రేమను పొంది ఎట్లు ప్రేమాశ్రువులను విడువగలము! ఆయన మనలను చూచుచున్నాడు, తెలుసుకొనుచున్నాడు, ప్రేమించుచున్నాడు అను భావము ఎప్పుడు మన సమస్తభావములతోను మిళితమగునో, ఎప్పుడు ఈభావము మనకు రక్తగత మయి, శల్యగత మయి, హృద్గత మగునో, అప్పుడు మనము నవజీవనమును పొందుదుము. అప్పుడు ఆయనను పొంది సమస్త పురుషార్థములను పొందినవార మగుదుము. అప్పుడు సంసారము దుర్గ్రాహ్య మగు ప్రహేళిక వలె, అర్థము తెలియని పొడుపుకథవలె నుండదు. అప్పుడు ఎటువయిపు జూచినను సమస్తమును ఆయనతో సంయోగము నొంది యున్నదని కనుగొందుము. తిక్తమయ మగు సంసారము మధుమయ మగును. స్వదేశము నందు, విదేశమునందు, మిత్రునియందు, శత్రుని యందు, సకల స్థానములయందు సకలావస్థలయందు, ఆయన మహిమనే చూతుము.

'ప్రాణో హ్యేష యః సర్వభూతై ర్విభాతి' - సమస్త భూతముల యందును ప్రకాశించు నాతడు ప్రాణస్వరూపుడని తెలిసికొందుము. 'విశ్వతశ్చక్షు రుత విశ్వతోముఖో, విశ్వతో హస్త ఉత విశ్వతస్పాత్.' అంతట ఆయన కన్నులే, అంతట ఆయన ముఖమే, అంతట ఆయన చేతులే, అంతట ఆయన పాదములే అని తెలుసుకొందుము. ఆయన దృష్టి మనపయిన ఎట్లు పడుచున్నదో, అట్లే విశ్వమునం దంతటను వ్యాప్త మయి

యున్నది. సర్వత్ర ఆయన చేతితో చేయబడిన కార్యములే చెట్ల ఆకులయందు, పక్షుల రెక్కలయందు, సముద్రముల గాంభీర్యమునందు, పర్వతముల ఔన్నత్యమునందు, అన్నిటి యందును ఆయన పనివానితనమే. విశ్వమునందలి సమస్త శక్తులలోను ఆయన శక్తి యొక్క ప్రభావమే. సమస్త జగత్తును ఆయన ప్రేమయొక్క అధిష్ఠానము నందే జీవించు చున్నది. సమస్త కౌశలమునందును ఆయన జ్ఞానమే. సమస్త కార్యములయందును ఆయన మంగళభావమే. సమస్త జగత్తు నందును ఆయన ప్రేమయే. తీవ్ర రోగములచే బాధితుల మయి, ఆర్తనాదములు చేయుచు, హాహాకారములు సల్పునప్పుడు, తన ఒడియందు చేర్చుకొని, తన అమృత హస్తములతో స్పృశించి, సమస్త బాధలనుండియు మన లను విముక్తులనుగా చేయునది ఆయన ప్రేమయే. ఎప్పుడు బంధుమిత్రాదుల ప్రేమను గోల్పోవుదుమో, ఎప్పుడు ప్రపంచమున దందరను మనలను విడనాడుదురో, అప్పుడు నిరుపమానమయిన ఆత్మశాంతి నిచ్చి, మనలను తనయందు విలీనము చేసికొనునది ఆయన ప్రేమయే. విశ్వమునం దంతటను ఆయన జ్ఞానమే, ఆయన ప్రేమయే, ఆయన మంగళభావమే. సృష్టికర్త యతడే, సూర్య చంద్రులు, లతాగుల్మములు, నదీ పర్వతములు, భూమ్యా కాశములు, పశుపక్షులు, మానవకోటి, అన్నిటికిని కారణు డతడే, సర్వాశ్రయు డతడే, పరమబంధు వతడే, పూజనీయు డతడే, నిత్యానంద మతడే, జీవనధన మతడే, పరమ లక్ష్య

మతడే, మానవ భాగ్య విధాత యతడే, అమృతమయుఁ డగు నాతడే ఈ మంగళ సమయమున మన హృదయములయం దావిర్భవించి ఈ యమృతభావములను మన హృదయ సరో వరములయందు పుష్పింపజేయుచున్నాఁడు. ఇదే మన జీవితము నందలి సార్థకదినము. ఇదే ఆయన యావిర్భావము, ఇదే ఆయన ప్రత్యక్షదర్శనము. ఆహా, మన మిప్పు డెక్కడ నున్నాము? ఎవరిని సందర్శించుచున్నాము? మన మిప్పుడు భూలోకమునందు లేము. ద్యులోకమునందు లేము. మన మిప్పుడు ఆ పరమమంగళ మూర్తి యొక్క దివ్యధామమునం దున్నాము. ఆయన మహిమ మధ్యమున నున్నాము. వర్ణనాతీతమగు అనుభవైకవేద్యమగు, బ్రహ్మానందరసమును గ్రోలుచున్నాము. ఈ యానందమును మనస్సె భరింపజాల కున్నది, ధారణ చేయఁజాలకున్నది. ఇక వాక్యములతో ఎట్లు వర్ణించి చెప్పగలను?

ఓమ్. ఏకమేవాద్వితీయమ్.

---

ఓమ్ తత్సత్.

# మహర్షి మహోపదేశములు



## ౧వ ఉపదేశము

ద్వా సుపర్ణా సయుజా సఖాయౌ సమానం
వృక్షం పరిషస్వజాతే । తయో రన్యః పిప్పలం
స్వాద్వత్తి అనశ్నన్ అన్యః అభిచాకశీతి.

రెండు సుందరమయిన పక్షులు ఏక వృక్షము నాశ్రయించి యున్నవి. అవి రెండును సర్వదా ఏక స్థానమునందే యుండును. ఒకరి నొకరు ఎన్నడును విడిచి యుండరు. ఉభయులును పరస్పరము పరమ మిత్రులు. వానిలో నొకటి సుఖముగా తన కర్మఫలముల ననుభవించుచున్నది. రెండవది నిరశన వ్రతమును బూని ఏమియు భుజింపక, భుజించుచుండెడి తన స్నేహితురాలిని జూచుచు సాక్షిస్వరూపురాలయి ఆనందించుచున్నది.

ఈ రెండు పక్షులును జీవాత్మ పరమాత్మలు గదా! త్రిభువనములను మోహింపజేయ జాలెడు సౌందర్యము గల పరమాత్మ యొక్క సన్నిధానవర్తి యయి యుండుటచే, పరమాత్మ యొక్క సౌందర్యకాంతులు జీవాత్మ మీద గూడ ప్రసరించి, జీవాత్మ సహితము సుందర స్వరూపమును ధరించినది. జీవాత్మ పరమాత్మలు రెండును శరీర మనెడు ఏకవృక్షము నాశ్రయించి యున్నవి. అవి రెండును నిరంతరము

జంటగా కూడి ఒక్కచోటనే యుండును. జీవాత్మ తన యంతరతముడగు పరమాత్మతో ఎప్పుడును కలసియుండును. రెండింటికిని మధ్య ఆకాశ మంత వ్యవధాన మయినను లేదు. జీవాత్మ పరమాత్మలకు అతి సన్నిహిత బాంధవ్యము. పరమాత్మ స్రష్ట, జీవాత్మ సృష్టము. పరమాత్మ ఆశ్రయము, జీవాత్మ ఆశ్రితము. పరమాత్మ నియంత, జీవాత్మ ఆయన యధీనము. పరమాత్మ దాత, జీవాత్మ గ్రహీత, భోక్త. అయినను ఉభయులును ప్రాణస్నేహితులు. ఒకరిని విడిచి ఒకరు క్షణ మయినను ఉండజాలరు. పరమాత్మ అపార ప్రేమతో జీవాత్మను కాచి సంరక్షించుచున్నది. జీవాత్మ ప్రపంచరంగమునం దుండి పరమాత్మచే ప్రేరేపింపబడి ఆయనకు హితమయిన కార్యములను చేయుచున్నది. జీవాత్మ పరమాత్మ ప్రసాదమువలన సమస్తకల్యాణములను అనుభవించుచున్నది. విషయ సుఖములను, ఆత్మానందమును, బ్రహ్మానందమును ఉపభోగించు చున్నది. జీవాత్మ శరీరపంజరమున నుండియు జగన్మాత యగు పరమాత్మయొక్క ఒడియం దుంచుకొనబడి పోషింపబడు చున్నది. సాక్షిస్వరూపు డయిన పరమాత్మ, ఆశ్రితులగు తన యనంత జీవ సంతానము సమస్త సుఖముల ననుభవింపుచు నానందములో నోలలాడుచుండగా చూచి, బిడ్డల యానందమును జూచి యానందించు జననీజనకులవలె, నిరతిశయానందము నొందుచున్నాడు. జీవాత్మ పరమాత్మలకు ఇట్టి సమీప సంబంధము. ఒకరు ఫలప్రదాత, ఒకరు ఫలభోక్త. ఆయన కటాక్ష వీక్షణముచే సమస్త సుఖముల

ననుభవింపుచు జీవాత్మ పరమాత్మకు కృతజ్ఞతాపూర్వకవంద నము లర్పించుచున్నది. మహాశక్తిసంపన్నుడగు నా యాశ్రియ దాత యొక్క యాశ్రియమును పొందబట్టియే జీవాత్మ కష్టభూయిష్ఠమగు నీ ప్రపంచమునందు నిర్భయముగా సంచ రింప గలుగుచున్నది. జీవాత్మయొక్క స్వాతంత్ర్యాభిలాషను ఒకసారి పరికించి చూడుడు! జీవాత్మ ఎన్నడును ఏ విధము గను ఎవరికి లొంగియుండుట కిచ్ఛగింపదు. మానవులలో అధమాధము డయినను భూలోక సమ్రాట్టున కయినను నిరంతరదాస్యము సల్పుట కిష్టపడడు. స్వాతంత్ర్యసౌఖ్య మెరు గని మానవుడు లోకమునందు లేడు. స్వాతంత్ర్యమే స్వర్గ లోక మను లోకోక్తియే ఇందుకు నిదర్శనము. ఈ ప్రపంచము నందు అనేక కష్టములలో, అనేక దురవస్థలలో చిక్కుకొని, జీవాత్మ తాత్కాలికముగా తన స్వాతంత్ర్యమును గోల్పోయి పలు నిడుమల గుడుచుచున్నది. నిశ్చయమే. కాని అది జీవాత్మయొక్క స్వాభావికావస్థ కాదు. విపరీతావస్థ. జీవాత్మ తన అంతరతమభావమగు స్వాతంత్ర్యమును ఎన్నడును పోగొట్టు కొన జాలదు. ఎన్ని కష్టముల ననుభవింపుచున్నను, ఎంత దాస్యములో మునిగియున్నను, స్వాతంత్ర్యమే దాని యంతర తమభావము. స్వాతంత్ర్యమే దాని ప్రాణము. స్వాతంత్ర్యము లభించిన సమస్తైశ్వర్యములు సమస్తసుఖములు సమకూరినట్లే. స్వాతంత్ర్యమును గోల్పోయి పరాధీనత నొందియున్న యెడల దానికి సమస్త కష్టములును వాటిల్లినట్లే. దాని కంతకంటె నీచస్థితి మరియొకటి లేదు.

అయినను అదేమి చిత్రమోగాని, ఇంత స్వాతంత్ర్యా పేక్ష గల జీవాత్మకు బరమేశ్వరుని యధీనమం దుండుట ఎంత యానందము ! అది లోకమందు మరెవ్వరికిని శిరస్సు వంచుట కిష్టపడదు. కాని, ఈశ్వరుని యధీనమునం దుండకపోయిన యెడల దానికి ప్రాణములు నిలుచుటయే దుర్లభము. ఈశ్వరుని దాస్యము దానికి మహైశ్వర్యము. ఈశ్వరసేవ అఖండ మండలాధిపత్యము. ఆయనకు సహచరి యయి, అను చరియయి, దాసియయి, భృత్యురా లయి యుండుటయే జీవాత్మకు పరమానందము. నిరంతరము ఆయన ముఖము వైపునకు జూచును. ఆయన కనుసైగలచే ఆయనయిచ్ఛలను గ్రహించును. ఆయన యిచ్ఛతో దనయిచ్ఛను మిళితము చేయ గలుగుటయే జీవాత్మయొక్క జీవిత సార్థక్యము, పరమావధి, ప్రార్థనీయమగు పరమపదము. ఎన్నినోములు నోచినను, ఎన్ని తపస్సులు ఆచరించినను, ఎన్ని సాధనలు చేసినను, హృదయకమలము నాయన కర్పింపగలుగుటకే. సంసారాకర్షణములనుండి విషయబంధములనుండి విముక్తి బొందగోరుట ఎందుకోసము? ప్రపంచిక దాస్యమునుండి విడిపించుకొని ఈశ్వరుని దాసు లగుటకే. సంపూర్ణముగ ఈశ్వరుని వశమగుట కొఱకే. ఆయన పాదతలముననే సర్వదా విశ్రాంతి నొందగలుగుటకే, ఆయనకు సేవ సల్పుటకు అర్చనలు చేయ గలుగుటకే, ఆయనకు ప్రియమయిన కార్యము లేవో తెలిసికొని ఆనందముతో వానిని నిర్వహింపగలుగుటకే. కేవలము దుఃఖమునుండి క్లేశములనుండి సంసారబంధములనుండి విషయ

వ్యామోహములనుండి విముక్తి నొందుటయే ముక్తి యగు నెడల, ఆ ముక్త్యవస్థయందు ఆయనను సేవించుటకు, ఉపాసించుటకు, ఆయనకు ప్రియమయిన కార్యములు చేయుటకు మన కధికారము లేనియెడల అట్టి ఉదాసీనావస్థయగు ముక్తితో మన కేమిప్రయోజనము? అట్టి శుష్కముక్తి, అట్టి నీరసావస్థ ప్రార్థనీయము కాదు. అభావాత్మకముక్తి ముక్తి కాదు. ముక్తి భావాత్మకము. ఈశ్వరాధీన మగుటయే ముక్తి. అదే ఆత్మానందము. ఆయనసేవ లభించుటయే జీవితము యొక్క పరమావధి. ఆత్మయొక్క మహత్త్వము. ఆయనను సేవించుట, ఆరాధించుట, ఆయనకు ప్రియమయిన కార్యములు చేయుట - ఇవే ఆత్మ పొందదగిన ఉచ్చతమాధికారములు.

ఎవడు మనకు ప్రభువో, ఈశ్వరుడో, ప్రాణదాతయో, ఎవని యధీనమం దుండక పోయిన యెడల, ఎవని ప్రేమముఖమును దర్శించని యెడల మన జీవితము వ్యర్థమో, అతడు మన సఖుడు. ఆహా! ఏమి మన భాగ్యము. ఆయన మనలను ప్రేమించుచున్నాడు. మన మాయనను ప్రేమింపవలయునని కోరుచున్నాడు. ఆయన ముందుగా తన ప్రేమను మనకు కానుకగా బంపి మన ప్రేమ నాకర్షించుచున్నాడు, ఆయన మనలను ప్రేమ దృష్టితో జూచుచున్నాడు. మన యాత్మలయొక్క ఔన్నత్యమున కయి అనంతవిధానములను కల్పించుచున్నాడు. తన దగ్గరకు మనలను పిలుచుకొని పోవుచున్నాడు. ఆనందముపై ఆనందమును మనమీద వఱదగా

ప్రవహింపఁ జేయుచున్నాడు. ఆయనను ప్రేమించి మనము కృతార్థుల మగుచున్నాము. కనుకనే జీవాత్మ పరమాత్మలు ఒకరికొకరు ప్రాణమిత్రులని శ్రుతి ఘోషించుచున్నది. మనము క్షుద్రము లగు ఇంద్రియముల ద్వారా అనుభవించు సుఖమే అపారము, అమేయము, వర్ణనాతీతము. అట్టి విషయములో జ్ఞానస్వరూపుడు, ధర్మాశ్రయుడు, ప్రేమసాగరుడు అగు పరమేశ్వరునుండి జ్ఞాన ధర్మ ప్రేమ రూపమున ఇంకను ఎంత విమలానందము ననుభవింపుచున్నామో, ఎట్టి దివ్య భావములు మన హృదయములయందు ప్రవహించుచున్నవో వాని నెవ్వడు లెక్కింపగలడు, వర్ణింపగలడు? ఇప్పుడు మన కాయన యనుగ్రహించిన జ్ఞానము, పవిత్రత, ప్రేమ ఇంతటితో నాగక ఇంకను క్రమక్రమముగా అభివృద్ధి నొందునని తెలిసికొన్నప్పుడు మన హృదయములు కృతజ్ఞతాపూరితములై, ఆ సంతోషమును ఆ కృతజ్ఞతాభావమును ధారణ చేయగలవా? మనము మనలో ఎవరిమట్టుకు వారు ఆయననుండి తాము పొందెడి మేలులకయి కృతజ్ఞతను తెలుపునప్పుడే ఆ కృతజ్ఞతాభావము మహాప్రవాహము వలె హద్దుమీరి గట్లు తెగి పొంగి పొరలుచుండగా, ఈ ధరామండలము నందలి మన సోదర సోదరీ బృందమునకు ఆయన దయచేసిన సౌఖ్యముల నిమిత్తమయి మన మందరము ఏకముఖులమయి కృతజ్ఞతాభావము వెల్లడిచేయవలసి వచ్చినప్పుడు, మనకు నోట మాటవచ్చునా? హృదయము కృతజ్ఞతాపూరిత మయిన వాగ్బంధనము కాదా? మనలో ఒక్కొక్కని పయిన ఆయన చూపించిన ప్రేమ

సమకూర్చెడు మంగళములు వర్ణింపబోయి వాక్కు మరలి పోవుచున్నది. మననము చేయబోయి మనస్సు స్తంభనము నొందుచున్నది. అట్టి విషయములో అనంతలోకములలో ఆయనచే సృజింపబడి పోషింపబడెడు అనంతకోటిజీవ రాసులపయిన ఆయనకు గల ప్రేమవాత్సల్యములను తలచు కొన్నప్పుడు ఆ మహద్భావమును మనస్సే ధారణ చేయలేక యుండగా, దానిని వర్ణించుటకు వాక్కు ఎట్లు సమర్థ మగును? ఈ క్షణమునందు మన మందరమును సోదరప్రేమతో కలిసి ఈశ్వరుని యొక్క ఏ యుదారానుగ్రహమును అనుభవించు చున్నామో, ఇట్టి భాగ్యమును లభింపజేసి నందులకు, మన చప్పిడి మాటలతో, మన శూన్య హృదయములతో, ఆయనకు ఎట్లు ధన్యవాదములు సమర్పింపగలము ?

మన మెంతయో క్షుద్రులము, పాపులము, అపవిత్రు లము, కలుష హృదయులము, స్వార్థపరులము. అయినను పర మేశ్వరుడు మన సఖుడు. మన కెంత గొప్ప యధికారము! ఎవడు దేవతలకు దేవతయో, చక్రవర్తులకు చక్రవర్తియో. ఆయన దృష్టి మనపై పడుచున్నది. ఆయన కేవలము మన కేసి చూచి యూరకొనుచున్నాడా? లేదు. ఆయన మన యెడల సఖ్యభావమును కనబరచుచున్నాడు. 'సయుజా సఖాయా', ఏమి అమృతవాక్యము! ఎట్టిశుభవార్త, ఎంత మధురభావము! మనతోడి మానవులలో గొప్ప పదవియందుండు ఎవని నయి నను మనము నా స్నేహితు డని చెప్పికొనుటకు అత డేమను కొనునో యని భయపడుచుందుము, సంకోచించుచుందుము.

కాని, సకల భువన నిర్మాతయు, జగదేకపితయు, లోకా రాధ్యుడు నగు నా మహేశ్వరుని మన సఖు డని పిలుచుటకు భయపడకున్నాము. సంకోచింపకున్నాము. ఆ దేవదేవుడు మన మిత్రుడు. ఆయన యిష్టమే మన యిష్టము. ఆయన యధీనమం దుండుటయే మన కానందము. మనల నడిపించు టయే ఆయన కోరిక. మన మాయనను ప్రభువని సేవించు చున్నాము. ఆయన మనలను భృత్యులను వలెనే పోషించు చున్నాడు. ఎప్పు డాయనను 'నీవు మాకు శరణ్యుడవు, ప్రాజ నీయుడవు, రక్షకుడవు' అని స్మరింతుమో, ఎప్పుడు మనకు మహాప్రభు వగు ఆ పరమపురుషుని గూర్చి తలచుకొని, 'మహాన్ ప్రభుర్వై పురుషః' అను వాక్యమును ఉచ్చరింతుమో అప్పుడు మన సమగ్రహృదయము మన మాటకు ఔనౌనని తలయూచి తన ప్రాణాంగీకారమును తెలుపును. హృదయమునందు ఈశ్వరభావము ప్రజ్వలితమయి యుండని యెడల వాక్కునకును భావమునకును అట్టి పరస్పర సమ్మేళనము లభింపదు. ఎవరు అహర్నిశములు ఐహికభోగోన్మత్తు లయి తమ జీవితములను వ్యర్థపఱచుచున్నారో వారి చెవులలో సహితము, సమగ్రమానవసంఘమునకు రక్షకుడును స్నేహితుడును అయిన పరమేశ్వరుని గురించిన 'సర్వస్య శరణం సుహృత్' అను మహావాక్యము పడినంత మాత్రము చేతనే, వారి హృదయములయందు గూఢముగా దాగియున్న పవిత్రభావములు వెంటనే మేల్కొనును. జీవాత్మ పరమాత్మలకు ఎట్టి బాంధవ్యమో చూడుడు. ప్రాపంచిక

మహామోహామునందు పడి పొరలుచున్నను, ఆయన పవిత్ర నామము చెవిని పడిన మాత్రముననే, ఆ ఘోరాంధకార మధ్యమునుండియే, ఒక అవ్యక్త మధురభావము విద్యుల్లతవలె తళుక్కుమని మెఱయును. జీవాత్మతో పరమాత్మకుగల నిగూఢ సంబంధము పరమరహస్యబాంధవ్యము, మాటలతో వర్ణింప నలవికాదు. పరమాత్మ సహవాసమునందే ఎవరు తమ జీవిత మును గడుపుచున్నారో, వారికి ఎంత ఆనందము! ఘోర విషయసుఖనిమగ్నులగు వారి పాషాణహృదయములే యీశ్వరనామశ్రవణముచే ద్రవీభూతము లగు చుండగా, ఎవరు అనుక్షణమును 'ఆ యమృత సాగరము' నందు స్నాన మాడు చున్నారో వారి యాత్మలు ఎంత ప్రకాశవంతములు! ఎవరు ఆ సూర్యకిరణముల యందు నిరంతరము వాసము చేయు చున్నారో, ఎవరు ఆ కల్పవృక్షచ్ఛాయ యందు నిరంతరము విశ్రమించుచున్నారో, ఎవరు ఆ మలయమారుత తరంగము లను అనవరతము సేవించుచున్నారో, వారి భావములు ఎంత సుందరములు, ఎంత పవిత్రములు, ఎంత మధుమయములు! వారికి ఈ మర్త్యలోకమే బ్రహ్మలోకము. వారు ఐహికము నందే, ఈ నశ్వరశరీరములతోనే, 'అత్ర బ్రహ్మ సమశ్నుతే' యన్నట్లు ఇచ్చటనే బ్రహ్మానందసుఖము ననుభవించు చున్నారు. ఎవరు విషయసుఖముల చేతనే వ్యామోహము నొందుచున్నారో, వారు, ఇట్టి మహాత్ముల యొక్క జీవితము లను జూచి, తమ జీవితములను బరిశోధించుకొని తారతమ్య మును చూచుకొనుడు. వారు సమస్త దుఃఖములను, సమస్త

బాధలను ననుభవించి, వానికి ప్రతిక్రియలను, నౌషధములను విచారించుడు. ఈశ్వరుడు విపత్తుల పయి విపత్తులను బంపుచున్నాడు. దండనలపయి దండనలను విధించుచున్నాడు. ఎందుకు ? మనము మన ఇష్టానుసారముగా సంచరించి పాడుగాక, ఆయన చూపించు సత్పథమునకు మరలుదుమేమో యని, ఈశ్వరుడు మాటి మాటికి తన వైపునకు ఆహ్వానము చేయుచున్నాడు. 'బిడ్డా! నన్ను మరువకుము. అజస్రము నా యనంతహస్తముల నుండి ప్రవహించు అనంతసౌఖ్యములను అనుభవింపుము. ఆనందింపుము. అవి నీకొఱకే. కాని, నన్ను మఱువకుము, నేనే నీకు శరణ్యము. నాకంటె నీకు వేఱు గతి లేదు. నన్నే శరణు నొందుము' అని కోటి కంఠములతో, అనంతకాలమునుండి ఘోషించుచున్నాడు. ఇట్లు మన హృదయాకాశమునందు, మేఘగంభీరభాషణములతో ఆయన దివ్యవాణి ప్రతిధ్వనించుచున్నను మన మాయనను శరణు నొందని యెడల మన కెవరు దిక్కు? ఆయన శరణ్యము నొందని యెడల కలుగు భయోత్పాతము నుండి పృథివియందలి యావత్సంపదయు మనలను సంరక్షింప గలదా? త్రిభువనముల యందలి సమగ్రానందమును, ఆయనతోడి వియోగము వలన జనించెడి దుఃఖమును నివారణచేయ సమర్థమగునా? ఆయన మనలను విషయసుఖములతోనే తృప్తినొందునట్లు ఏల సృజించి యుండలేదు! విషయసుఖములతోనే తృప్తి నొందిన యెడల, మన మాయన పవిత్రానందము వైపునకు కన్నెత్తి చూడ మనియేగదా! కనుకనే ఆయన యీ ప్రపంచమునందు సుఖ

ముతో దుఃఖమును, సంపత్తుతో విపత్తులను, మిశ్రమము చేసియున్నాడు. దుఃఖరహితమయిన సుఖము, విపత్తులులేని ధనము, నిరుపద్రవ మయిన స్థానము, అగు తన యాశ్రయ మును వెదకుటకు ప్రయత్నింతు మనియే గదా! పరమదయాళు డగు పరమేశ్వరుడు, ఈ ప్రపంచమునందలి సమస్తైశ్వర్యము లను క్షణభంగురములుగను దుఃఖసమన్వితములుగను చేసెను. ఈ ప్రపంచ మనెడు మహారణ్యమునందు దారితెన్ను గానక ఇష్టము వచ్చినట్లెల్ల తిరిగి త్రొక్క రాని దారులు త్రొక్కి ముళ్ళు గ్రుచ్చుకొని, గ్రుచ్చుకొని శరీర మంతయు గాయములయి రక్తము స్రవించు చుండగా ఆయన ప్రేమ యనెడు అమృతలేపనమున కయి ప్రార్థింతు మనియే గదా! సంసార తాపత్రయములయందు మునిగి దగ్ధశిరస్కుల మయి, ఆయన కృప యనెడు శీతలోదకమునకయి పరుగు లెత్తుదు మనియే కదా! విషయసుఖములను విషప్రాయ ములుగ జేసెను. ఆత్మోన్నతి లభించినకొలదిని విషయా సక్తి క్షీణించుచుండును. బ్రహ్మానందానురతి అతిశయించు చుండును. ఇది అనుభవైకవేద్యము. అప్పుడు సంసారము భోగమునకు గాదు. అప్పుడు ఈశ్వరునికి ప్రియమయిన కార్య ముల చేయుటకే, ఈశ్వరోద్దేశమును కొనసాగించుటకే ఈ సంసారము. మన భోగమునకు ఈశ్వరుడే. ఇక్కడ మన మీ మంగళక్షణమున మన ప్రాణసఖునితో కలసియున్నాము. రాజరాజేశ్వరుడు మన సఖ్యమును గోరుచున్నాడు. మనలను విడిచి ఆయన క్షణ ముండ జాలడు. అకించనుల మగు మనము

మన స్నేహితునకు ఏమియియ్యగలము? ఆయనకు ప్రేమాశ్రువులను ఉపహారముగా సమర్పింతము. హృదయపూర్వకకృతజ్ఞతాభివందనముల నర్పింతము. సమగ్రహృదయమును, సర్వస్వమును ఆయన కర్పించి మన జీవితములను ధన్యము చేసికొందము.

ఓం. ఏకమేవాద్వితీయమ్.

---

ఓమ్ తత్సత్.

# మహర్షి మహోపదేశములు



## ౯ వ ఉపదేశము

ఇహైవ సన్తోథ విద్మ స్తద్వయం, నచే దవేది ర్మహతీ వినష్టిః ।
య ఏతద్విదు రమృతా స్తే భవన్తి, అథేతరే దుఃఖమేవాపియన్తి॥

ఇహలోకమునందుండియు ఆయనను మనము తెలిసికొనుచున్నాము. మన మాయనను తెలిసికొనలేక పోయియుండిన యెడల మనకు మహానష్టము సంప్రాప్తమయియుండును. ఎవరా పరమపురుషుని తెలిసికొందురో వారు జననమరణ రహితమయిన శాశ్వతానందపదవిని పొందుదురు. ఆయనను తెలిసికొనని వారు దుఃఖమునే అనుభవించుచుందురు. అహో! మన మెట్టి మహావినాశమునుండి విముక్తుల మయి

తిమి ! ఎట్టి యాపద మనకు తప్పిపోయెను ! ఆయనను తెలిసి కొనని యెడల మన కెట్టి దుర్దశ సంప్రాప్తమయి యుండును ! ఈ ప్రపంచము, ఈ సంసారము ఎంత భయావహమయి, ఎంత అంధకారమయ మయి యుండును! మన మిక్కడ నానాదుఃఖములను, అష్ట కష్టములను అనుభవించుచు ఎక్కడను విశ్రాంతికి, మనశ్శాంతికి, అనుకూలమయిన స్థలము పొందక పోయి యుందుము. ఐహికమునందలి అంతశ్శత్రువుల యొక్క, బాహ్యశత్రువులయొక్క వాడిబాణములచే ముక్కలు ముక్కలయిన హృదయములతో, గాయముల నొందిన శరీరములతో, ఎక్కడను శాంతినొందక పోయి యుందుము. అట్లయిన యెడల సంసారానలము నందు మన సర్వాంగములు నిరంతరము దగ్ధమగుచుండియుండును. ఆ సంతాపాగ్నిని చల్లార్చి మన హృదయసీమలయందు శాంతి నెలకొల్పగల సాధనము పృథివియం దెక్కడిది ? ఇట్టి దురవస్థలో నున్నయెడల మన జీవన మెంత భయావహమయి యుండును? కాని, దీనుల మగు మనమీాద ఈశ్వరుని కెంత యనుగ్రహము! ఆయన మన మనశ్శాంతి కొఱకు మనకు తననే దానముగా నిచ్చివేయుచున్నాడు. ఆయన మన హృదయకమలములయందు ప్రకాశించి, శోకభారముచే భగ్నములయి యున్న హృదయముల యందు, అమృత సంచారమును కలిగించి, వానిని నవవికసితములుగా చేయుచున్నాడు. ఈ సంగతి ఇప్పుడే మనకు ప్రత్యక్షనిదర్శనముగా నున్నది. ఇప్పుడే ఆ కల్పవృక్షచ్ఛాయయందు విశ్రమించి సమస్తశోకమును,

తాపమును మరచి పోవు చున్నాము. ఇట్లే మన మాయన యొక్క అమృతసహవాసమును, ఎప్పుడు పొందగలుగు చున్నామో, అప్పుడే వెనువెంటనే, దాని ఫలమును పొంద గలుగుచున్నాము. ఇది సద్యఃఫలము, ప్రత్యక్షఫలము. దీని కొఱకు భావికాలమువఱకు ప్రతీక్షించియుండ నవసరము లేదు. ఆయన ఈ క్షణమునందే నలుదిశల నుండియు ఆనందమూర్తి యయి వచ్చి, తన సహస్రసహస్ర బాహువులతో మనల నాలింగనము చేసికొనుచున్నాడు. ఆయన యుపాసనాఫలమును మనము సద్యఃఫలముగా పొందుచున్నాము. అదియెప్పుడో లభించునని కనుపెట్టుకొనియుండ నక్కరలేదు. ఆయన యెట్లు ప్రత్యక్షమగు చున్నాడో, అట్లే, ప్రత్యక్షఫలముల నిచ్చు చున్నాడు. ఆయన నుపాసించుట, దాని ఫలము నొందుట, ఇవి భిన్నపదములే గాని భిన్నకార్యములు కావు. ఆయన నుపాసింప గలుగుటయే సమస్తతపస్సులయొక్క ఫలము; మానవుడు పొందదగిన పరమావధి గనుకనే ఆయన మన హృదయముల యందు, అనంతకాల మాయన నుపాసింప వలయు నను నాశలను జనింపజేయు చున్నాడు. మనకు గల ఆశలను అనుక్షణమును పూర్ణము చేయుచున్నాడు. క్షణ క్షణ మును ఈయాశ ఇంకను ఉజ్వలతర మగుచున్నది. జననమరణ ములతో, ఆధివ్యాధులతో, నిండియున్న అధోలోకమగు ఈ మర్త్యలోకమునందుండియు, ఇంత మలినములగు హృదయ ములతో నుండియు, ఆయన సహవాసముచే కలిగెడు ఆనంద మును అనుభవింప గలుగుచున్నాము, మన మింకను ఎంతో

పవిత్రులమయి అంతకంతకు శ్రేష్ఠతరలోకములకు పోగలు గుదు మనుటకు, అప్పు డాయన సహవాసమును అవిచ్ఛిన్న ముగా నిరంతరాయముగా పొందగలుగుదు మనుటకును సందేహ మేమి? ఇచ్చటనే మన కీ విశ్వాసము దృఢమగు చున్నది. ఇచ్చటనే దీనికి ప్రబలమయిన ప్రత్యక్షసాక్ష్యము లభించు చున్నది. ముందు ముందు ఇంకను ఉజ్వలతర మగు ఆయన యొక్క ప్రకాశమును దర్శింపగలము. నిరంతరము ఆయన ప్రకాశమునందే యుందుము. ఎన్నడును ఆయననుండి మనకు విచ్యుతి గలుగదు.

ఇహలోకమునం దుండగనే మన మాయనను తెలిసి కొనని యెడల మనకు మహావినాశము సంప్రాప్త మగును. వేదకాలము నాటి మహర్షులు మనయందలి అవ్యాజానురాగ ముచే, తమ దీర్ఘకాలానుభవమును, మన కెట్లుందించు చున్నారు! ఇచ్చటి సమస్తక్షుద్ర విషయములలో, సంసార తాపత్రయములలో, విషయవ్యామోహములలో మునిగి యుండి మన జీవితకాలమును గడిపివేసి వార్ధకమును పొందితి మేని, మృత్యు వాసన్నమయినప్పుడు, ఇహలోకమును విడిచి పోవలసిన సమయము తటస్థించినప్పుడు, మన కిక ఆశ యెక్క డిది? ఇచ్చట కారాగృహవాసుల వలె అంధకారమునందే జీవితమును గడిపిన యెడల మన హృదయముల యందు ఆశా జ్యోతియొక్క కిరణములు ఎట్లు ప్రసరింపగలవు? ఆహా! ఆయనను మనము తెలిసికొనలేక పోయినయెడల మనము మహావినాశ మును బొందవలసి యుండును. కాని, చూడుడు! ఈశ్వరుని

యొక్క కరుణామహిమమును. ఆయన ఇక్కడనే తనను మన కిచ్చివేసి తన సేవాభాగ్యమును మనకు ప్రసాదించి యున్నాడు. ఆయన సేవను అనంతకాలము అనుభవింపగల మను ఆశలను మన హృదయమునందు సంచరింప జేయుచున్నాడు. సూర్య చంద్రులు, నక్షత్రములు, పశువులు, పక్షులు మొదలయినవి ఈ సంగతి నెంతమాత్రమును తెలిసికొనజాలవు. పశువులు మొదలగు నికృష్టప్రాణులన్నియు నాయనయందే జీవించు చున్నవి, ఆయన చేతనే రక్షింపబడుచున్నవి, ఆయనయందే నివసించుచున్నవి. కాని, ఆ సింహ,వ్యాఘ్ర,భల్లూకాది సమస్తమృగములు తమతమ ప్రవృత్తులను, చరితార్థత నొందించుకొనుటతోనే, ఆహార నిద్రా సంభోగముల తోనే, తమ జీవితములను గడపి వేయుచున్నవి. వానిలో నేవియు తమ కాశ్రయము నిచ్చిన పరమేశ్వరుని, తమ ప్రాణప్రదాత యగు పరమపురుషుని తెలిసికొన జాలవు. మనుష్యునికి మాత్రమే ఆయన తన ప్రకాశమును, తన నిజతేజమును ప్రదర్శించుచున్నాడు. పవిత్రహృదయులగు పుణ్యాత్ముల యెదుట ఆయన ప్రకాశము నిరంతరజాజ్వల్య మానమయి యుండును. ఎవరు సంసారసుఖోన్మత్తులయి, విషయ సుఖములకొఱకు పరుగులెత్తుచు, ఆయనను ఒకసారి యయినను స్మరింపకుందురో మోహమేఘములచే కప్పబడి యుండు అట్టివారి ఆత్మయందు సహితము ఆయన అప్పుడప్పుడు మెఱుపువలె తళుకు తళుక్కున ప్రకాశించుచుండును. నిష్కపటములును కోమలములును అగు సాధుపుంగవుల హృదయ

ములయందు ఆయన నిరంతరప్రవేశము కలిగియుండును. ఘోరవిషయసుఖనిమగ్నులగువారి హృదయమధ్యము నందును, లోహమయ కవాటములను భేదించుకొని ఆయన ప్రవేశించుచునే యున్నాడు. ఇందువలన మానవుల యెడల ఆయనకు గల నిరుపమానప్రేమ వెల్లడి యగుచున్నది. పుణ్యాత్ముడు ఆనందముతో ఆయనను కలిసికొనుచున్నాడు. ఘోరపాపియు నానాక్లేశములను, నానాబాధలను అనుభవించి ఎక్కడను విశ్రాంతి గానక తుదకాయన యాలింగనమునందు చేరి సంతృప్తుడగుచున్నాడు. ఆయనను స్మరింపనివానిని సహితము, ఆయన విడనాడ నొల్లడు. మానవునితోడి విరహవేదనను ఆయన భరింపజాలడు. ఏ పవిత్రసమయమునందో చోటు చేసికొని ఘోరపాపియొక్క హృదయమునందును ఆయన ప్రవేశించుచున్నాడు. ఆ మంగళసమయమున ఎవరయినను ఈశ్వరనామమును స్మరించినంత మాత్రమున, ఆతని కర్ణపుటములయందు ఈశ్వర నామస్మరణము పడినంత మాత్రమున ఆ మహాపాపి యొక్క నేత్రముల నుండియు, కన్నీళ్లు బొటబొట కారును. హృదయము సంచలించును. దేహము పులకరించును. దృష్టి తన వెనుకటి పాపజీవితము పయి పడును. హృదయ కుండమునందు పశ్చాత్తాపాగ్ని జ్వలించును. పవిత్రజీవితము కొఱకు పరితపించును. క్షణిక మయినను ఈశ్వరకటాక్షము యొక్క ఆ విద్యుత్ప్రభావము వలన వాని యావజ్జీవమును సంపూర్ణముగా మారిపోవును. ఆ క్షణము మొదలు ఈశ్వరభావము

వాని హృదయమునందు చిరస్థాయి యగును. ఇట్లు ఎందరు పతితులు ఆ దయాసముద్రునిచే ఉద్ధరింపబడిరి. ఎట్టి పాపి యయినను నిరాశ నొంద నవసరము లేదు. మహాపాపిని సహితము ఆయన తన మంగళాలయమునకు తీసికొనిపోవును. తన యొడియందు కూర్చుండ బెట్టుకొనును. ఎట్టి పాపినయినను ఆయన దూరముగా తరిమివేయడు. ఆయన కేవలము సమయముకొఱకే వేచియుండును. అవకాశముకొఱకు కనుపెట్టుకొని యుండును. 'ఏ సమయమునందు నేను ఎదుట పడినయెడల, ఏ సమయమునందు నేను ప్రకాశించినయెడల, నా కీతడు తన హృదయమునందు స్థానము నిచ్చును? ఏ సమయమునం దీతడు నా యొడిలోవచ్చి కూర్చుండును?అట్టి మంగళ సమయమెప్పుడు తటస్థించును?అని పరమేశ్వరుడు సదా వేచియుండును. ఆయనను మనము స్మరింపక పోయినను, ప్రార్థింపక పోయినను అప్పుడు సహితము ఆయనకు విశ్రాంతి లేదు. 'ఎప్పుడు నాకొఱకితడు పరితపించునో, ఎప్పుడు నా కీతడు దొరకునో' యని పరమేశ్వరుడు సర్వదా అవకాశము కొఱకు వెదకుచునే యుండును. ఆయన సమస్త మానవుల కొఱకును విశ్వవ్యాప్తమగు తన యొడిని సర్వదా సిద్ధముగా నుంచి యున్నాడు. ఆయన సాన్నిధ్యమున చేరిన పాపికి ఇక పాప మెక్కడిది? పర్వతోపమానములగు పాపరాసు లన్నియు ఆయన కటాక్ష వీక్షణము ప్రసరించినంత మాత్రమున భస్మరాసులు కావా?

కృతఘ్నులగు మానవులారా! ఇట్లు అనవరతము మనపయి దయావర్షమును గురిపించుచున్న మన పరమపితను

క్షణకాల మయినను స్మరింపరా? ఆయన అపారప్రేమను. ఆయన పవిత్ర స్వరూపమును తెలిసికొని ఆయనకు హృదయ పూర్వక ధన్యవాదములను సమర్పింపరా? అహో! మన మెంత మూఢులము! ఎంత బధిరులము! ఆయన మనలను తన యొడిలోనికి రమ్మని సదా ఆహ్వానము చేయుచున్నాడు. ఆ కంఠస్వర మెంత మధురము! అది అమృతమును చిలక రించు చున్నదే. దీనిని వినియే మన పూర్వపురుషులు ఐహిక భోగములను విషప్రాయముగ విడిచి బ్రహ్మానందరస నిమగ్నులు కాగలిగిరి. మన మా మాత్ర ప్రేమయొక్క ఆహ్వానమును వినిపించుకొనుట లేదు. ఆయన మనల నభిషే కము చేయుటకు అమృతకలశ మెత్తి మన రాకకొఱకు ప్రతీ క్షించుచున్నాడు. ఇదే ఆయన యభీష్టము. మన మాయన వైపునకు చూచుటయే లేదు. ఆయన నిరంతరము ప్రేమను దానము చేయుచున్నాడు. ఆయన ప్రేమ జీవనదివలె మహా ప్రవాహముతో సదా మన తలపైనుండి పొర్లిపోవుచున్నది. మనకు పవిత్ర జీవనమునం దభిలాష లేదు. జ్ఞానము లేదు. ప్రేమ లేదు. జాలికలిగించు ఇట్టి అవస్థలో నుండుటచేతనే, ఆయన ప్రేమను మనము గ్రహింపజాలకున్నాము. ఎప్పు డాయన యందు మనము ఆత్మ సమర్పణ చేయుదుమో, అప్పుడే మనయందు సమస్త మంగళభావములను ఆయన కలిగించును. ఎవడు పుష్పములను సౌరభమకరందములతో నింపుచున్నాడో, ఎవడు సూర్యబింబమును తేజోరాశిగా జేయుచున్నాడో అతడే జీవాత్మను తన యమృత భావముతో నింపుచున్నాడు. ఆయన

కరుణ చెలములు, మహిమ జలలు, నిరంతర ప్రవాహములు, అవిచ్ఛిన్న ప్రస్రవణములు—ఇవి యెన్నటికిని ఇంకిపోవు, మనకు వానిని గ్రహించు శక్తి అధిక మయిన కొలదిని, ఆయన మనకు వానిని అధికముగా ప్రసాదించుచునే యుండును.

ఎవ రయినను ఆయనను స్మరింపనిండు, విస్మరింపనిండు. ఆయన మాత్రము ఎవరిని విస్మరింపడు, విడిచిపెట్టడు. ఆయన సమస్త మయిన వారిని చక్కగా శోధించి హృదయము లను కడిగివేసి, పాపవిముక్తులనుగా జేయును. ఈ జగత్తు ఆయన కుటుంబము. ఆయన జగత్కుటుంబి. ఆయన కుటుంబములో నెవరును చిరకాలము పతితు లయి యుండ జాలరు. ఆయన పుణ్యాత్ములను, పాపాత్ములను—అంద రిని తన దివ్యధామమునకు తీసికొని పోవుచున్నాడు. ఒక్కరిని దిగబెట్టడు. అందరిని తన ఆలింగనపాశమున బంధించి వేయు చున్నాడు. ఆయన మంగళస్వరూపమునందు మా కిట్టి విశ్వాసము కలదు. ఈ పృథివియం దుండియే క్రమక్రమ ముగా నందరును ధర్మమునందును ప్రేమయందును అభివృద్ధి నొందుదురు. ఈశ్వరుడు అందఱ హృదయములను తన వశము చేసికొనును. ఇప్పు డీ లోకమునం దుండు సమస్త దురవస్థలు క్రమముగా లోపించును. ఆయన విశ్వరాజ్యమునందు బ్రాహ్మ ధర్మము వ్యాపించును. అందరును భ్రాతృభావముతో కలిసి కొని ఆ పరమపితయొక్క పాదసేవను చేయుదురు. అప్పు డందరును తా మెంత సౌభాగ్యవంతులో తెలిసికొని, ముక్త

కంఠములతో మన మాయనను తెలిసికొనక పోయి యుండిన యెడల మనకు మహావినాశము సంప్రాప్త మయి యుండును, మన మాయనను తెలిసికొని ధన్యుల మయితిమి,' అని దిశలు మారుమ్రోయు నట్లుగా ఘోషింతురు. ప్రస్తుతము మన విక్రుతావస్థను జూచుకొని, నిరాశుల మయి, ఇట్టి దయనీయావస్థ నుండి అట్టి సుఖప్రదమయిన రాజ్యము ఎట్లు ఉదయము కాగలదని మనము సంశయించు చుందుము. మన మాయన మంగళ విధానమును మనసులో నయినను ఊహింపజాలము. ఆయన యనంత శక్తిసంపన్నుడు, మహిమాన్వితుడు. శూన్యము నుండి సృష్టి చేయగలడు. అంధులకు దృష్టి నియ్యగలడు. బధిరులకు శ్రవణశక్తి నియ్యగలడు. కుంటివారిచే నాట్యమాడించగలడు. మూగవారిచే మాట్లాడింపగలడు. జడములకు ప్రాణము పోయగలడు. ఆయనకు చేతగాని పనిలేదు. ఆయన రహస్యములను మనము భేదింపజాలము. కాని ఆయనయొక్క మంగళ స్వరూపము ఎప్పుడు మన హృదయమునం దావిర్భవించునో, ఎప్పుడు సత్యప్రభాకరుడు మన హృదయమునందు ఉదయ మగునో, అప్పుడే సమస్త మోహపటలములును విడిపోయి విశ్వాసతేజము మన హృదయమునందు ప్రకాశించును. పృథివియందలి సమస్త మానవులును బ్రహ్మ పరాయణు లయి, బ్రహ్మానందరసనిమగ్ను లయి, నిర్మలాంతఃకరణముతో ఈశ్వరారాధన సల్పుదురు. అందరును ధర్మమునందు, ప్రేమయందు అభివృద్ధి నొందుదురు. అద్వితీయుడైన ఆ పరమపితయొక్క పాదసన్నిధానమున

చేరి, ఆయనకువశు లయి ఆయన శరణమును వేడుదురు. పరమేశ్వరుడు సమస్త మానవులను కృతార్థులనుగా జేయును. ఆయన కొరకు ఎవరు వ్యాకులచిత్తముతో వెదుకుదురో, వారికాయన దర్శన మిచ్చి వారి దుఃఖము నుపశమింప జేసి శాంతచిత్తులనుగా జేయును. అహో! ఏమి యాశ్చర్యము, ఏమి భాగ్యము! మన మిహలోకమునం దుండగానే ఆయనను తెలిసికొను చున్నాము. ఈ నశ్వరశరీరములు ధరించి యుండగానే, ఈ పరిమిత క్షుద్రజీవనము జీవించుచుండగానే, అనంతుడును అపారుడును అగు ఆ పరమపురుషుని తెలిసికొనుటకు, అధికారము గలిగి యున్నాము. ఆయనను తెలిసికొనిన యెడల, ఇంకను తెలిసికొనుట కేమి మిగులును? 'కస్మిన్ను, భగవో, విజ్ఞాతే సర్వ మిదం విజ్ఞాతం భవతీతి.'—భగవత్స్వరూపుడగు ఓ గురువర్యా, దేనిని తెలిసికొనిన యెడల సమస్తమును తెలిసికొన నగును? అను ప్రశ్నకు 'ఏతత్ జ్ఞేయం నిత్యమేవాత్మసంస్థం, నాతఃపరం వేదితవ్యంహి కించిత్,' ఎవడు నిత్యముగా మన యాత్మలలో ప్రవేశించి యున్నాడో, ఆ పరబ్రహ్మమే తెలిసికొన దగినది. ఆయనకంటె వేరుగా తెలిసికొన దగినది రవంతయినను లేదు' అను గురుని యుత్తరము పరమాదరణీయము. ఆ సత్యస్వరూపుని తెలిసికొనిన యెడల సమస్తమును తెలియనగును. ఆయనను తెలిసికొనిన యెడల ఇక తెలిసికొన వలసిన దేదియు మిగులదు. జ్ఞానమునకు పోషకము సత్యము. ఎవడు పరమేశ్వరుడో అతడు పరమవస్తువు. అతడు సత్యవస్తువు. అత డొక్కడే జ్ఞానమునకు

తృప్తికరమయిన స్థానము. ప్రశాంత చిత్తులును, నిష్కాము లును అగు మహర్షులు ఆయనను పొంది జ్ఞానముద్వారా సంతృప్తచిత్తు లయిరి. జ్ఞానము ఎంతకాలము వఱకు పరిమిత విషయములనుండి మఱలి, ఆయన యందు చేరి విశ్రమించదో, అంతకాలమును దానికి శాంతి యుండదు. అంత వఱకును జ్ఞానము చంచలతావ్యాకులతల మధ్యమున డోలాందోళిత మగుచు, విశ్రాంతి లేక సంచరించుచుండును. పరిమిత పదార్థ ములయందు సత్యముకొఱకు వెదుక బోవును గాని, నిజమయిన సత్యము వానియందు దొరకదు. లోకము నందలి సమస్త సత్యములు ఆ సత్యమూర్తి యొక్క ఛాయలే. ఆ సత్యస్వరూ పుని పొందియే జ్ఞానము తృప్తినొందును. సమస్తవాంఛలు పరిసమాప్తి నొందును. సనాతనమహర్షు లందరు సత్యమునకు పరమనిధాన మయిన పరమేశ్వరుని పొందిరి గనుకనే, పర బ్రహ్మము సత్యస్వరూపుడు, జ్ఞానస్వరూపుడు, అనంతుడు, సత్యమునకు స్థానము. సత్యమునకు సత్యము' అను నర్థమిచ్చు 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, సత్యమే వాయతనం, సత్యస్య సత్యం' అను మహావాక్యములు ఉచ్చరింప గలిగిరి. ఈసమస్త వాక్యములను, ఈశ్వర కృపవలన మనము నేడు హృదయ పూర్వకముగా బలపరుపగలుగు చున్నాము. ఈ సకల వాక్య ములను రాబోవు తరముల వారును చిరకాలము కీర్తించు చుందురు. సమస్త మానవ హృదయముల యందును ఈ వాక్యములకు ప్రవేశము కలుగును. సమగ్ర పృథివీ మండ లము నందును ఈ వాక్యామృతమును గ్రోలని హృదయ

మధుపము లుండవు. సత్యము యొక్క ప్రభావము, బ్రహ్మ ధర్మము యొక్క ప్రభావము, సనాతన మహర్షుల కాలమునం దెట్లో, ఇప్పుడును అట్లే, ముందును చిరకాలము అట్లే, విరాజ మానమయి యుండును. ఇది సమస్త భ్రమలలోను, మహాంధ కారమధ్యమునను మానవ హృదయమునందు చిరస్థాపిత మయి యుండును. సత్యమునకే గనుక కొంచెమయినను బల మున్న యెడల, అది క్రమక్రమముగా సమగ్రపృధివీ మండలమును ఉజ్జ్వలముగాఁ జేయును. అచిరకాలము లోనే సమస్త దేశములలోను బ్రహ్మధర్మము యొక్క ఉజ్జ్వల సత్యము వ్యాపించి, పృధివీమండలము నంతను, శాంతి భావ ముతో, మంగళభావముతో, ప్లావిత మగునట్లు సర్వమంగళ విధాతయగు సర్వేశ్వరుడు సంకల్పించును గావుత.

ఓమ్. ఏకమేవాద్వితీయమ్.

---

ఓమ్ తత్సత్

# మహర్షి మహోపదేశములు

---

## ౧౦వ ఉపదేశము

"మహాన్ ప్రభుర్వై పురుషః సత్వస్యైష ప్రవర్తకః
సునిర్మల మిమాం శాన్తిం ఈశానో జ్యోతి రవ్యయః"

అతడు గొప్పవాడు, ప్రభువు, పురుషుడు, జ్యోతిః స్వరూపుడు, నాశ రహితుడు. అటువంటి ఈశ్వరుడు ఈ

నిర్మలమయిన శాంతి నుద్దేశించి ధర్మప్రవర్తకుడై యున్నాడు. ఆయన మంగళమయు డయిన మహాపురుషుడు. మనకు కేవలము ఇంద్రియసుఖములను మాత్రి మిచ్చి, మనలను పశువులవలె సంసారమునందు నిబద్ధులను జేసి యుండలేదు. మన కమూల్యమయిన ధర్మము నిచ్చి స్వతంత్రులనుగా జేసి యుండెను. విషయసుఖములకంటె అనంతగుణములును, ఉత్కృష్టమైన ఆత్మానందము నిచ్చి, తానే ధర్మప్రవర్తకు డగుచున్నాడు. అతడు మన హృదయములయందు శుభబుద్ధిని, ధర్మబలమును నియతముగా ప్రేరణ చేయుచున్నాడు. మన మాయన యనుగ్రహమువలన ధర్మబలముచే స్వతంత్రులమై ముక్తి కధికారుల మగుచున్నాము.

అహా, ఏమి సౌభాగ్యము! మనకు ప్రియతము డయిన సాక్షాత్ పరమేశ్వరుడే, స్వయముగా ధర్మప్రవర్తకుడయి యున్నాడు. ఎవడు సత్యమునకు స్థానమో, ఎవడు సత్యమునకు సత్యమో, అతడే సత్యధర్మమునకు ప్రాణము, ఆశ్రయుడు. సత్యముయొక్క ప్రకాశమును సకలావస్థలయందును వ్యాపింప జేయుచున్నాడు. ఆయన మన సహాయము నిమిత్తము సత్యమే వ్రతముగా గల మహాత్ములను అప్పుడప్పుడు ప్రేరేపించుచుండును. వారు సత్యమును నిరుపమానమయిన శ్రద్ధతో ధారణచేసి సమగ్రపృథివీమండలమునందును సత్యప్రచారము చేయుచుందురు. తమ ప్రాణము, మనస్సు, ఆత్మ, సమస్తమును ఆయనయందు సమర్పింతురు. ఈశ్వరుని ప్రతినిధులవలె, తమ ప్రాణములనైన నొడ్డి, ఆయనయొక్క అఖండ

మంగళ సంకల్పములను సిద్ధి నొందింతురు. ఈశ్వరుడు ధర్మ ప్రవర్తకుడు. వా రాయన యాజ్ఞానువర్తులు, ధర్మ పరిచారకులు వా రాయన యనుచరులయి, ఆయనచే ప్రేరేపింపబడి, ఎన్ని విఘ్నములు తటస్థించినను, ఎన్ని యాపదలు వచ్చి యలముకొన్నను, నిశ్చల హృదయు లయి, ఆయన మంగళకార్యములను నెరవేర్చుచుందురు. ఆయన యాజ్ఞలను పాలించుటలో వలె, వారు మరి దేనియందును అట్టి యానందమును పొందజాలరు. ఈశ్వరుడు తన ప్రియపుత్రులకు, బాహ్యమునందు అనేకకతిపశత్రువులను, విపత్తులను కలిగించి, క్రమశిక్ష నిచ్చి, ఎట్టి కష్టముల నయిన సంతోషముతో భరింపగల సామర్థ్యము నిచ్చును. స్వయముగా తననే వారికి బహుమతిగా నిచ్చి, వారి యాత్మానందమును క్రమముగా వృద్ధి నొందించును. ఆయన స్వయముగా ఆనందమయుడు; తనభక్తులయొక్క ఆధ్యాత్మికానందమునకు సమస్త సదుపాయములను చేయుచుండును. ఎవరు ఆయన బలముచే బలవంతు లగుదురో, వారు సమస్త విఘ్నములనుండియు, బాధలనుండియు, విముక్తులయి ఆయన పదతలము యొక్క మంగళచ్ఛాయను, ఆశ్రయమును పొందుదురు. ఆయనయే వారి బలము, ఆయనయే వారి అన్నము, ఆయనయే వారి జీవితము, ఆయనయే వారి బహుమతి.

స్వయముగా పరమేశ్వరుడే ధర్మప్రవర్తకు డయినప్పుడు సత్యధర్మము సర్వత్ర వ్యాపించు ననుటకు సందేహమేమి? క్రమక్రమముగా భూమండలము నందలి సమస్త

మానవులు సత్యమునే గ్రహింతురు. సత్యమునే ఆలింగనము చేసికొందురు. కాలక్రమమున ఈ ఫలము లభించును. ప్రతి మనుజుడును ఈ ధర్మప్రచారకార్యమునందు చేరవలయును. ఇట్టి శుభకార్యమునందు ఎవరికిని అశ్రద్ధ ఉండగూడదు. అఖండ మంగళమూర్తి యగు పరమేశ్వరుని యభిప్రాయము కొనసాగకుండ ఎవరును నిరోధింప జాలరు. కాని, మహాత్మమయిన ఆయన యిచ్ఛతో మన యిచ్ఛను మనఃపూర్వకముగా ఏకీభవింప జేయుట మనకు మహాగౌరవము. ఈశ్వరానుగ్రహము లేక యేదియును లభింప దను మాట వాస్తవమే కాని, మన ఆత్మశక్తి యొక్కయు, అంతర ప్రయత్నముల యొక్కయు, అభావము లేకుండునుగాక ! ఎవడు మన యాత్మలకు శక్తి నిచ్చుచున్నాడో, ఎవడు మన జిహ్వాగ్రములకు ప్రార్థనారూపవాక్యములను అందించుచున్నాడో, ఆయన యభిప్రాయ మేమి ? మన మాయన కార్యములను సంపూర్ణహృదయములతో నెఱవేర్తు మనియే కదా ! ఆయన యనుగ్రహమునకు పాత్రుల మగుటకు ఆయనను ప్రార్థింతు మనియే కదా ! ఆయన జ్యోతిర్మయ రూపమును మన యెదుట ప్రకాశింపజేయుచున్నాడు, మనము దానిని మన చక్షువులతో గ్రహింతు మనియే కదా ! ఆయన మన పయిన కృపావర్షమును గురిపించుచున్నాడు, మనము దానిని మన హృదయకలశములయందు సర్వప్రయత్నముల చేతను పట్టి ధారణచేయ గలుగుదు మనియే కదా ! ఆయన యనుగ్రహము అనవరతము ప్రవహించుచునే యున్నది. కాని, మనము ప్రయత్నింప

వలెను, ప్రార్థింప వలెను, ప్రేమింప వలెను, అనురాగము కలిగి యుండవలెను, వాంఛింప వలెను. అప్పుడే ఆయన మంగళభావములను మనము గ్రహింపగలము.

జ్ఞాన నేత్రమును విప్పి ఆయన సత్యభావమును గ్రహింపుడు. ఆయనను ఎవరు దర్శింపగలరు ? ఎవరు తమ యాత్మలను పవిత్రము చేసికొందురో, ఎవరు తమ యిచ్ఛలను ఆయన యిచ్ఛతో మేళగించ గలరో, వారే ఆయన దర్శనము చేయ గలరు. సత్యమును పొందగలుగుటకు జ్ఞానమును అభివృద్ధి నొందింపుడు. మన జ్ఞానము ఎంత ఉజ్జ్వలమగునో, ఆయన సత్యభావముతో మన యాత్మలకు అంత సమ్మేళనము లభించును. జ్ఞానము ఎంత సత్యమును ధారణ చేయగల్గునో, ప్రేమ ఎంత విశాలమగునో, మన యిచ్ఛను ఆయన యిచ్ఛతో అంత యెక్కువగా నేకీభవింప జేయగలము. ఆయనకు అంత సమీపముగా చేరగలము, సత్యమునందు, ప్రేమయందు, స్వాతంత్రత యందు, అభ్యున్నతి నొంది మన మాయన సాన్నిధ్యమును విశేషముగా ననుభవింప గలము.

ఏకాగ్రచిత్తుల మయి ఈశ్వరునియొక్క సత్య స్వరూపమును దర్శింతము. అట్లు చేయుటకు ఇదే మంచి తరుణము. ఇట్టి పవిత్ర సమయము నెప్పుడును పోగొట్టుకొన గూడదు. ఇప్పుడే ఒకసారి మన యాత్మలయందు ఆ సత్య పురుషుని ధారణ చేయుదము. రేపు మనలో నెవ రుందురో ఎవ రుండరో ఎవరు చెప్పగలరు? మృత్యు వెప్పుడును ఆసన్నమయి యుండును. ఆ సత్యస్వరూపు నొక్కసారి దర్శింప గలిగిన యెడల, మన

కిక భయ ముండదు. మన మొకవేళ మృతినొందినను భయ మేమి? ఆయన దర్శనముతోనే మన జీవనము కృతార్థత నొందును. కాని, ఆయనను తెలిసికొనక మన మిహలోకము నుండి వెడలిపోయిన యెడల, మన మెంత దీనులము? ఏ సమయము నయినను మనము లఘుభావముతో చూడ కుందుము గాక! ఏ ప్రశస్తసమయమున ఆయన దర్శన భాగ్యము లభించునో, అట్టి మంగళ సమయము నెప్పుడును నిర్లక్ష్యభావముతో పోగొట్టుకొన కుందుము గాక! ఇప్పుడే ఆ సత్యస్వరూపునియొక్క ప్రకాశమును దర్శింపుడు. జ్ఞానమును జ్వలింపజేసి ఆయన నొకసారి హృదయమునందు ధారణ చేయుడు. ఆయన సత్యవస్తువు. ఆయన శ్రేష్ఠవస్తువు. ఆయన సకలాధారములకును మూలాధారము. అసలు వస్తువత డొక్కడే. మిగిలిన వన్నియు ఆయననుండి ఉత్పన్న మయినవే. పశువులు, పక్షులు, వృక్షములు, లతలు, రాళ్లు, ఖనిజములు, సకలమును ఆయనవల్ల నుండి వచ్చినవే. ఆయన సకల శక్తు లకును శక్తి, సకల మూలములకును మూలము. సకల సత్యము లకును సత్యము. ఒక్క డగు ఆయన నుండియే సమస్త జీవ రాసులును, ఉదయమయి జీవించుచున్నవి. సమస్తమును ఆయన యందే స్థాపితమయి యున్నవి. అసత్యమయిన ఈ జగత్తు సత్య మగుట ఆ సత్య స్వరూపునియొక్క సత్యభావమును గ్రహిం చియే. ఆయన విశ్వాధారుడు, మూలాధారుడు, పరమేశ్వరుడు. సత్యమే ఆయనకు స్థానము. జ్ఞానమును జ్వలింపజేసి ఆ సత్య స్వరూపుని హృదయమునందు ధారణ చేయుడు. ఆయనను

గూర్చిన జ్ఞానము ఎంత ఆశ్చర్యకరమయిన విషయమో, ఒకసారి భావించి చూడుడు. ఆయన యొక్కడే పరమసత్యము. ఆయన ప్రాణస్వరూపుడు. ఆయన అన్నిటియొక్కయు ప్రాణ స్వరూ డయి, అంతరాత్మస్వరూపు డయి, సర్వత్ర ప్రకాశించు చున్నాడు. ఆయనను అంతటను దర్శింపుడు.

ఆయన సత్యమునకు సత్యము. ఏ 'సత్యము' కంటె మధురతర మయిన వస్తువు లేదో, ఏ సత్యముకొఱకు భక్తులు అనాయాసముగా తమప్రాణములను దానము చేయుదురో, అతడు ఆ సత్యమునకు సత్యము. అతడు పరమసత్యము. 'మహాన్ ప్రభుర్వై పురుషః' అను వాక్యమును స్మరించినంత మాత్రము ననే ఆయనను గురించిన భావము హృద్గత మగుచుండలేదా? ఈ వాక్యమునందు ఆయన జ్ఞానము, ఆయన మంగళేచ్ఛ, ఆయన శుద్ధ బుద్ధ ముక్తస్వభావము, ఈ సమస్తమును ఎంత స్వచ్ఛముగా ప్రకాశించుచున్నవి? మన మాయనను ఎప్పుడు 'మహాన్ ప్రభుర్వై పురుషః' అందుమో, అప్పుడే ఆయనను సన్నిహితమైన ఈశ్వరరూపముగా దర్శింపగలము. ఆయన పరమవస్తువు, అంతేకాదు, అంత కంటెను అధికుడు. అతడు 'పరమ పురుషుడు'. వస్తువునందు అటువంటి చేతనభావము, జీవద్భా వము, స్వతంత్రభావము, ప్రకాశింపవు. ఆయన పూర్ణ పురు షుడు. ఆయన 'చేతనం చేతనానాం', చేతనములకు చేతనము. ఆయన 'ప్రాణస్య ప్రాణః', ప్రాణమునకు ప్రాణము. ఆయన శుద్ధ బుద్ధ ముక్తస్వభావుడు. ఆయనను పురుషస్వరూపునిగా చూచినయెడలనే, ఆత్మతో ఆయనకుగల విశేష సంబం

ధము చూడగలము. ఆ పూర్ణపురుషుని యొక్క ఏ యిచ్ఛ కలదో, అదే సమస్త మంగళములను సమకూర్చు చున్నది. ఆయన ఇతరు లెవరివలనను నియమింప బడుట లేదు. ఆయనకు నియామకుడు గాని అధిపతిగాని లేడు, ఆయన యిచ్ఛ ఏది కలదో అది మంగళేచ్ఛయే. అదే విశ్వము నందు విజయము నొందుచున్నది. ఆయన సత్యకాముడు, సత్యసంకల్పుడు. ఆయనసంకల్పములు అమోఘములు. వానిని అడ్డుపెట్టగల శక్తి మరియొకటి లేదు. అటువంటి పరమ పురుషుడు మన హృదయములందు అంతరాత్మ స్వరూపియయి వెలుంగుచున్నాడు. మన మంగళముల కొఱకే ఆయన సమస్త విధానములను చేయుచున్నాడు. ఆయన యిచ్ఛ ఏదో, అదే జగత్తునందు జరిగిపోవుచున్నది. ఆయన దేనిని సంకల్పించునో అది మంగళసంకల్పమే. ఆయన యొక్క అఖండమంగళాభి ప్రాయమును, ఎవరును నిరోధింపజాలరు. ఆయన మంగళ సంకల్పుడు, సర్వశక్తుడు. ఆయన శుద్ధబుద్ధముక్తస్వభావుడు. ఆయన యిచ్ఛకు ఎవరును ఆటంకములు కలిగింపజాలరు. ఆయన తన యిచ్ఛవలననే, తన ఆనందము వలననే, సమస్తమును స్వాభావికముగా నుండునట్లు, నియామకుడు లేకయే అన్నియు తమంతట తామే జరిగిపోవు చున్నట్లు జరిపివేయుచున్నాడు.

సర్వశక్తుడును, సర్వమంగళకరుడును అయిన అట్టి పరమేశ్వరుడే మన ప్రభువు. ఆయన మనకు పూజనీయుడు, చిరసేవ్యుడు, ధర్మప్రవర్తకుడు. మంగళమయు డగు ఆయన యిచ్ఛయే, చిరజాగ్రదవస్థ యందుండి, సర్వత్ర పనిజేయు

చున్నది. ఆయన కేవలము విషయరాజ్యమునకు మాత్రమే రాజు కాడు. ధర్మరాజ్యమునకును రాజతడే. ఆయన కేవలము జడజగత్తునకు మాత్రమే అధిపతి కాడు. ఆయన ఆత్మలకును అధిపతి. ఆయన పాపమోచకుడు, పుణ్యఫలప్రదాత, చిరజీవనాశ్రియుడు. ఆయన నేమని పిలుతము? తండ్రి యందుమా, తల్లి యందుమా? ఇటువంటివే ఏ ఒక్కమాట యందును ఆయనను గురించి సమస్త భావములును వ్యక్తము కావు. ఆయనకును మనకును గల బాంధవ్యము మానవు లుచ్చరించు ఏ ఒక్కశబ్దము నందును ఇమడదు. ఆయన మనకు తల్లి. తండ్రి, గురువు, సోదరుడు, స్నేహితుడు, ప్రభువు, సమస్తమును. ఆయన మన అంతరమునకు అంతరతముడు. హృదయమునకు హృదయము, ఆత్మలకు ఆత్మ. ఆయన అంతరతముడును, ప్రియతముడును అయిన పరమేశ్వరుడు. ఆత్మతో ఆయనకు గల సంబంధము జీవత్సంబంధము. ఆయన జీవాత్మలకు స్వాతంత్ర్యము నిచ్చి, వానిని తన సహవాసమునకు యోగ్యమయిన వానినిగా చేసెను. ఆయన పూర్ణపురుషుడు. మనమును ప్రకృతికంటె అధికులము, మనమును పురుషులమే. తండ్రిబిడ్డలకువలె, ఈ విషయములో ఆయనకును మనకును ఎక్కువ సంబంధము కలదు. ఆయన పూర్ణమంగళ స్వరూపుడు, మనకును సాధుభావములు కలవు. ఆయన శుద్ధుడు. అపాపవిద్ధుడు, పాపములచే నంటబడనివాడు. మనమును పవిత్రభావములను మంగళభావములను కలిగియున్నాము; ఆయన స్వతంత్రుడు, ముక్తస్వభావుడు, మనమును స్వతంత్రకర్తృత్వమును కలిగియున్నాము. అచే

తనముల వలె, పశుపక్ష్యాదుల వలె, మనము కర్తృత్వవిహీనులము కాము. కనుక మనకును ఆయనకును అతిసన్నిహిత సంబంధము కలదు. కాని మనము మన యాత్మలను అభివృద్ధి నొందించుకొనిననే గాని ఈ సంబంధమును తెలుసుకొనజాలము. మనము సాధుభావమును, పవిత్రతను, ధర్మబలమును, ఎంత యెక్కువగా సంపాదింతుమో అంతయెక్కువగా పరిశుద్ధునను అపాపవిద్ధునను అయిన ఆ పరమపురుషుని గ్రహింపగలము. మనము పశువుల వలెనే జ్ఞానహీనుల మయియుంటిమా, ఆయనను గురించి పశువుల కెంత తెలియునో మనకును అంతే తెలియును. వానివలెనే ఆహారనిద్రాభోగములతోనే సంతృప్తి నొందుదుము. మన యాత్మలను పురుష లక్షణములగు జ్ఞానమునందు, ప్రేమయందు, పవిత్రతయందు ఎంత అభ్యున్నతి నొందింపగలమో, ఈశ్వరునకు మన మంత సమీపవర్తులము కాగలము. మనము 'పురుషుల' మన్న మాటయే తెలిసికోలేని యెడల, ఆ పరమపురుషుని ఎట్లు తెలిసికొన గలము? మనము సత్యమును సంపాదింప లేనియెడల, ఆ పరమసత్యమును ఎట్లు ధారణ చేయగలము? మనము పవిత్రులము కాని యెడల, ఈశ్వరుని యొక్క ఆ యఖండ పవిత్రత, ఆ పూర్ణమంగళభావము ఎట్లు గ్రహింపగలము?

'ఈశ్వరుని తెలుసుకొన జాలము. ప్రేమింప జాలము. ఆయనతో సహవాసము చేయజాలము' అని పలుకు మా సోదరులతో ఇంతకంటె ఎక్కువగా ఏమి చెప్పగలము? ఇంతే

చెప్పగలము. సోదరులారా! మీరు పవిత్రులు కండు, జ్ఞానమును ప్రకాశవంతముగా చేయుడు. అనుక్షణమును ఈశ్వరుని ప్రార్థింపుడు. మీరు ఆ యభయప్రదాతయొక్క ఆశ్రయమును తప్పక పొందగలరు. ఆయన యానందము ననుభవింపగలరు. ఆయన ప్రేమను గ్రహించి ఆయనను ప్రేమపుష్పములతో అర్చన చేయగలరు. ఆయనను దర్శింప బ్రయత్నించుటకుముందు, 'ఆయనను స్మరింప లేము, చిరకాలము నుండి ఈశ్వరభక్తు లనువారు చెప్పుచున్న దంతయు అబద్ధము. అవన్నియు ఉన్మత్త ప్రలాపములు' అని అనకుడు. మీరు ధార్మికులు కండు, ప్రేమ గల వారు కండు, పవిత్రులు కండు. ఉపాయములలో కెల్ల ఉత్కృష్టోపాయమును, సాధనములలో కెల్ల అమోఘసాధనము నవలంబింపుడు. ఆయనను సదా ప్రార్థింపుడు. ఇంతకంటె వేరు ఉపాయము లేదు, మీ రా సత్యస్వరూపుని నిశ్చయముగా దర్శింపగలరు. ఎవరు ఆయన కొఱకు వెదకుదురో వారెన్నడును శూన్యహస్తములతో మరలరు. ఇది స్వతస్సిద్ధమైన సత్యము. సకలకాలముల యందు సకల దేశముల యందలి భక్తులయొక్క అనుభవసిద్ధమయిన సత్యము అని మాత్రమే చెప్పగలము. పరమ కృపాళు డయిన పరమేశ్వరుడు తన అపూర్వ అద్భుత మంగళ విధానము వలన సమస్తమానవకోటిని తరింపజేయును గాక!

ఓమ్. ఏకమేవాద్వితీయమ్.

---

ఓమ్ తత్సత్.

# మహర్షి మహోపదేశములు



## ౧౧వ ఉపదేశము

విశ్వత శ్చక్షు రుత విశ్వతోముఖో,
విశ్వతో హస్త ఉత విశ్వత స్పాత్।
సం బాహుభ్యాం నమతి సం పతత్రైః
ద్యావా భూమీ జనయన్ దేవ ఏకః॥

పరమేశ్వరుడు సర్వత్ర నేత్రములు గలవాడు. సర్వత్ర ముఖములు గలవాడు. సర్వత్రబాహువులు గలవాడు. సర్వత్ర పాదములు గలవాడు. అతడు మనుష్యులను బాహువులతోను, పక్షులను ఱెక్కలతోను అమర్చుచున్నాడు. ద్యులోకభూలోకములను సృజించిన దేవు డొక్కడే. సర్వత్ర నేత్రములు గల ఆ పూర్ణపురుషుని దృష్టి సమస్త ప్రదేశముల యందును వ్యాపించియున్నది. భూగర్భమునందు, సూర్యచంద్రాది జ్యోతిర్మండలములయందు, అణువు అణువు నందును ఆయన నేత్రకిరణములు వ్యాపించని చోటు లేదు. అతడు సర్వసాక్షి, అందరియొక్క అంతర్బాహ్యములను జూచుచున్నాడు. అనంతకోటి బ్రహ్మాండముల యందలి, అనంతకోటి జీవరాసుల హృదయసీమలయందు, ఏ యే భావ ప్రవాహములు ప్రవహించు చున్నవో, అవన్నియు ఆయనకు

గోచరము. సమస్త జీవరాసుల సుఖ సంతోషములు, దుఃఖములు, శోకములు, కామక్రోధాది భావవికారములు, ఇవన్నియు ఆయనకు కండ్లకు గట్టినట్లుండును. అతడే ప్రపంచమునందుండెడి సమస్తజ్యోతులకును జ్యోతి. ప్రభాకరుని కా ప్రభ యెక్కడిది? సుధాకరున కా యమృతకిరణము లెక్కడివి? వాయువున కా జవసత్వము లెక్కడివి? అగ్నిహోత్రున కా దాహకశక్తి యెక్కడిది? భూదేవికి సమస్తసస్యములను, ఫలములను, పుష్పములను, సువర్ణాది సమస్తలోహములను, వజ్రవైడూర్యాదినవరత్నములను ప్రసవించు ప్రభావ మెక్కడిది? అన్నమునకు క్షుధానివారణశక్తి, జలమునకు పిపాసానివారణశక్తి, సమస్త మాలిన్యమునుకడిగివేయు శక్తి యెక్కడివి? ఇవన్నియు ఆ పరమపురుషు నుండియే కదా సమస్త శక్తులను బడయుచున్నవి. ఆయన వాని చాటుననుండి లోక కల్యాణమునకై దేనిదేనికి ఏ మేమి కావలసి యుండునో, అవన్నియు అమర్చుచున్నాడు. కార్యనిర్వాహకత్వమునకును సుఖజీవనమునకును ఏ యే జీవికి ఏయే అవయవములు ప్రయోజనకరములో తెలిసికొని, ఆ యా జీవిని ఆయా అవయవములతో అమర్చిన దతడే. ప్రాణస్వరూపుడగు ఆ పరమదేవత విశ్వ మంతయు నిండియుండుటచేతనే జగ మంతయు చైతన్యవంతమై యున్నది. ఆయన నుండియే సమస్త సుఖసంపదలు అవిచ్ఛిన్నముగా ప్రవహింపుచున్నవి. అతడాది కారణుడు, మూలాధారుడు, అమృతస్వరూపుడు. అతడు లేనిచోటు లేదు. బాహ్యమునందు నంతరమునందు, నిర్జనారణ్యముల

యందు, సజన నగరరాజముల యందు, పర్వతశిఖరముల యందు, సముద్రగర్భములయందు, అధోలోకములయందు, నక్షత్రమండలములయందు - సర్వత్ర ఆయన నేత్రము దేదీప్యమానముగా ప్రకాశించుచున్నది. అంధకారము ఆయన యావిర్భావమును కప్పిపుచ్చజాలదు. ఎట్టి గాఢాంధకారమైనను ఆయన దృష్టికి అవరోధమును గల్పింప జాలదు.

సర్వత్ర ఆయన ప్రకాశమే, సర్వత్ర ఆయన వాణియే. భక్తుల హృదయ రంగములు ఆయనకు నాట్యరంగములు. దుఃఖార్తుల మానసక్షేత్రములు ఆయనకు విహారభూములు, బాహ్యప్రపంచమునందుకంటె, మానవులహృదయసీమలయందు ఆయన కోటిగుణితముగా ప్రకాశించుచున్నాడు. మన మానస వీధుల యందు నిరంతరము ఆయన శంఖారవము ప్రతిధ్వనించుచున్నది. అయినను మన మాయనను కనలేకున్నాము. వినలేకున్నాము. ఎందుచేత? మన జ్ఞాననేత్రము ముకుళించి యున్నది. మన అంతఃశ్రోత్రము మూసికొనిపోయినది. ఆయన దర్శనము చేయుటకే, ఆయన వాణిని వినుటకే, మన మీ యుపాసనా మందిరమందు చేరియున్నాము. ఆయనను యాచింతము, కృపాభిక్ష బెట్టుమని ప్రార్థింతము. ఆయన మన జ్ఞాననేత్రములను విప్పగలడు. ఆయన మన ఆంతరబధిరత్వమును బాపగలడు. ఆయన యనుగ్రహము నొంది, మనము మన జ్ఞాననేత్రము నొకసారి తెరచినయెడల, ఆయన దివ్యమంగళ స్వరూపమును, ఆయన యపరూపలావణ్యమును దర్శింపగలము. మన యాత్మలు నిర్మలములైనయెడల, ఆయన యుపదేశవాక్యము

లను మనము స్పష్టముగా వినగలము. మన మనస్సును పరిశుద్ధము చేసికొన్న యెడల, ఆయన మధురరసముల నాస్వాదము చేయగలము. మలినహృదయుల మగుటచేతనే మన మాయనకు దూరముగా పడియున్నాము. అజ్ఞానాంధకారము నందు మునిగి అంధులమై యున్నప్పుడు, మన మాయన నెట్లు చూడగలము? నేను గుడ్డివాడనై నప్పుడు, నావైపు ఎందరు చూచుచున్నను, నా కేమి ప్రయోజనము! నూరు వేలమంది దృష్టి నా మీద పడుచున్నను, నేను స్వయముగా అంధుడ నయినప్పుడు, లక్షమంది నా వంక చూచుచున్నారని నే నెట్లు తెలిసికొనగలను? నే నేకాకిని, ఒంటరిని అనియే తలపోయు చుందును. కాని, ఈశ్వరుని దృష్టి ముందర లక్షమంది దృష్టి యనగా నెంత? ఏ దృష్టి అనంతవిశ్వమునందు వ్యాపించి యున్నదో, ఏ దృష్టి మన అందఱ ఆత్మలయొక్క అంతరతమ ప్రదేశములయందు ప్రవేశించియున్నదో, నిరుపమాన ప్రభావంత మగు ఆ దృష్టిని సహితము మన మనుభవింపలేకున్నాము. అచేతన మెప్పుడైనను చేతనమును చూడగలదా? చేతనము మాత్రమే చైతన్యమును గ్రహింపగలదు. మనము జడపిండములవలె మందులమై యున్నాము. ఎవడు సమస్తజగత్తును తన యనంత నేత్రములతో చూచుచున్నాడో, ఎవడు సమస్త ప్రాణులయొక్క ప్రాణస్వరూపుడై ప్రకాశించు చున్నాడో, అట్టి జ్ఞానమయుడు, అమృతమయుడు అగు, ఆ పరమ పురుషుని దర్శనవిషయమై, మన మంధులము, అచేతనులము. ఆయన దివ్యజ్యోతి సకలస్థానములయందును ప్రకాశించుచున్నది.

ఆయన దివ్యవాణి అన్ని చోట్లనుండియు బయలు వెడలు చున్నది. మనము కనజాలకున్నాము, వినజాలకున్నాము. అయ్యో! మన మెంత దీనులము, జ్ఞాన హీనులము, హతచేతను లము! పనికిమాలిన ఒకమనుష్యునియెదుట ఎంత భయపడు చున్నామో, అంతర్యామి యగు ఆ పరమపురుషుని యెదుట, పాపముల నాచరించుటకు, అంతమాత్రము భయపడుటలేదు. మన కెంతకష్టము తటస్థించినది! మన మెట్టి భాగ్యహీను లము! ఇట్టి మహాపాతకమునుండి ఇట్టి ఘోరవిపత్తునుండి మనల నుద్ధరింప గలవా రెవ్వరు? మనలను చేతనులనుగా, జ్ఞానవంతు లనుగా చేయగల సమర్థు లెవ్వరు? దీనజనశరణ్యుడు, పరమ కారుణికుడు, పరిశుద్ధ స్వరూపుడు, అగు ఆ పరమపిత తప్ప, మనకు వేఱుగతి లేదు ఆతడే జగ దేకశరణ్యుడు. ఆయనపాద పద్మములయందు ఒరగి నమస్కరింతము. కృతార్థుల మగు దుము.

ఓ పరమాత్మా! నీవు మాఅంతర్బాహ్యములయందు ప్రకా శించుచున్నావు. మా సమస్త దోషములను నీ వెరుగుదువు. నీ ముందర మేము దేనిని దాచజాలము. మేము మోహజాలములో తగుల్కొని యున్నాము. మ మ్ముద్ధరింపుము. మా సమస్త జీవ నములోను నీతోడి యోగమును సంరక్షింపుము. మా జీవితము నందు మే మేకార్యమును చేయుచున్నను, నీ యెదుటనే చేయు చున్నామని తెలిసికొనునట్లు చేయుము. సకల సౌందర్యముల కును ఆకరుడవైన నీవు, సకల మంగళములకును స్థానభూతుడ వైన నీవు, మా హృదయములను నీవైపునకు మరలించుకొనుము.

మా ఆత్మలను పరిశుద్ధము గావింపుము. మామనస్సులు జగన్మోహన మూర్తి వగు నీ వైపునకు తప్ప, మరియొక వైపునకు పోకుండనుండునుగాక! నీవు వినా మాకు వేరుగతిలేదు. నీ దగ్గర మేము ఏకాగ్రచిత్తముతో, వ్యాకులహృదయముతో చేయు ప్రార్థన యిది. నీవు మాకు నీ దర్శన స్పర్శన శ్రవణాదికము లైన ఏ సమస్తమహాధికారములను ప్రసాదించియుంటివో, అట్టి మహోన్నత పదవిని, అట్టి మహాభాగ్యమును, మేము మోహాంధులమై, నిర్లక్ష్యభావముతో చూడకుందుముగాక! క్షణభంగురము లగు విషయసుఖములయందు మేము ప్రమత్తులము గాకుందుము గాక! నీవు మమ్ము ఏయే సమస్తోత్కృష్ట బుద్ధివృత్తులతో, మనశ్శక్తులతో, హృదయభావములతో, నలంకరించి యుంటివో, అ వేవియు నిరర్థకము కాకుండునుగాక! వానిమూలమున మేము నీ మహిమను వెల్లడి జేయగలుగు దుముగాక! మా దేహశక్తు లన్నియు నీవి. మా మనశ్శక్తు లన్నియు నీవి. అవన్నియు మేము సద్ధర్మానుష్ఠానమునందే, నీకు హితమైన కార్యములు చేయుటయందే వినియోగింతుముగాక! నీ యమృతరసమును పానము చేయుచు చేయుచు, నీ ప్రసన్న ముఖమును వీక్షించుచు వీక్షించుచు, మా ఇహలోక జీవితము అంతమొందునుగాక! భక్తజనమధ్యమున, నీనామమును స్మరించుచు స్మరించుచు నీ యనంతధామమునందు చేరగలుగుదుము గాక! దయామయా! నేను మే మందరము నీ యుపాసనార్థమై ఇచ్చట చేరియున్నాము. "ఎప్పుడు సూర్యు డస్తమించునో ఎప్పుడు సమస్తస్నేహబృందముతోను, సమస్త బంధువర్గము

తోను, ఇక్కడ చేరి, నిన్నారాధించి, నీ ప్రేమోజ్జ్వలముఖ మును సందర్శించి, కృతార్థుల మగుదుము" అని మే మందరము ఉదయమైనది మొదలు కనుపెట్టికొని యుంటిమి. అట్టి మంగళ సమయము ఇప్పు డాసన్నమైనది. నీవొక్కసారి మా హృదయ పీఠములయందు ఆసీనుడవై, మా యాశలను పూర్ణము చేయుము. నీవు మాతల్లివి, తండ్రివి, గురుడవు, సఖుడవు, సంరక్షకుడవు, మంగళదాతవు, ముక్తిప్రదాతవు. నీదుబిడ్డల మగు మే మందరము నీకు శరణాపన్నుల మగుచున్నాము. నీహస్తము నందు మా సమస్తమును అర్పించుచున్నాము. నీవు మమ్ము రక్షింపుము. పడకనుండి లేచినది మొదలు మే మీ సంసార సాగరము నీదుచు స్వార్థపరత్వమునందు మునిగి యుంటిమి. ఇప్పుడు నీ సాన్నిధ్య మను స్పర్శవేదిచే, మా హృదయము లను అయఃపిండములు, ఎట్లు సువర్ణకందుకములుగా మారిపోయి నవి! ఎక్కడనుండియో నీ జ్ఞానతేజము మా హృదయ కుహరములలో ప్రవేశించి, మా యజ్ఞానాంధకారమును పటాపంచలు చేసినది. ఎక్కడ నుండియో నీ యమృత భావములు కొట్టుకొని వచ్చి, మమ్ములను మోహనిద్ర నుండి మేలుకొల్పినవి. ఏవైపునుండియో నీ భక్తిస్రోతము ప్రవహించి మా హృదయములను నిర్మలినములుగా చేయు చున్నది. ఎటునుండియో నీ కృపామారుతము వీచి మా పాపచింతలను చెల్లాచెదరు చేయుచున్నది. ఏమి ఆశ్చర్యము! నీ సహవాససౌరభ మెంత శక్తిమంతము! నీ సాన్నిధ్యసుఖముతో సాటి యైనది మరి యొక్కటి కలదా! మా నేత్రములు నీ

యందు స్థిరముగా లగ్న మయిపోవును గాక! మా నాలుకలు నీకల్యాణగుణములను సంకీర్తనచేయుటయందే ఉత్సాహము కలిగియుండునుగాక! నీ సహవాసభాగ్యము లభించిన మానవున కిక, తుచ్ఛములగు ధన మాన యశస్సులకొఱకు, నశ్వరము లగు విషయ సుఖములకొఱకు, కోరికలు జనించునా ? మట్ట మధ్యాహ్నపు టెండలో నిలువబడి, మిణుగురు పురుగుల వెలుతురుకొఱ కెవడు ప్రార్థించును? గంగానదీతీరమున నిలువబడి కూపోదకస్నాన మెవ డపేక్షించును? మాణిక్యరాసులు కాల దోసి బొగ్గులకై ఎవడు పరితపించును? ఆత్మోన్నతి నొంది, నీ సాన్నిధ్యసుఖమును, నీ అనిర్వచనీయబ్రహ్మానందమును, ఒక సారి అనుభవించిన యెడల హృదయమునం దిక నీచచింతల కును, నీచవాంఛలకును, నిలువనీడ యేది? అప్పుడు మనసు నందు బాధించు గొప్ప కోరిక యిది - ఈ విమలానందము నే నెట్లు చిరకాల మనుభవింపగలను? ఈ యమృతపురుషుని చిర సహవాస సుఖమునందు నే నెట్లు జీవనము గడుప గలుగుదు నని. అప్పుడు నేను దేవతాతుల్యుడను, దేవతలతో పాటు నేనును నిన్నుపాసించుటకు అధికారము కలిగియున్నా నని తెలిసికొని, పరమానందము నొందుదును. ఓ పరమ మంగళ విధాతా! మా ఆత్మలయందు సదా ఉన్నతభావముల నుద యింపజేయుము. నీ సన్నిధానమునకు వచ్చి మేము రిక్తహస్త ములతో మరలకుందుము గాక! ఈ సమాజమునందు మమ్ముల నందరను దేనిని పొందుటకు సమావేశము చేసితివో, అట్టి నీ పవిత్రసాక్షాత్కారమును దయచేయుము.

సోదరులారా! ఎవరు ఒకసారి ఈ పవిత్ర బ్రహ్మ సమాజమునకు వచ్చి, ఇక్కడి యుపాసనయొక్క ఉజ్జ్వల పవిత్ర భావముల ననుభవింతురో, వారు తిరిగి ఈమహోత్సవ మెప్పుడు వచ్చునా యని, వారము వారమును కనుపెట్టుకొని యుందురు గాక! ఇక్కడి యుపాసనలు శుష్కములు గాక, రసవంతములై ప్రాణప్రదము లగుగాక! ఈశ్వర సాక్షాత్కారమునకు ఈ యుపాసనా మందిరమే సోపానప్రాయ మగుగాక! మన మందరము కలిసి, ఏక హృదయులమై, ఎప్పు డిక్కడ ఈశ్వర మహిమను కీర్తించుచున్నామో, ఎప్పు డాయనకు మన నిష్కపట ప్రేమోజ్జ్వలహృదయమును సమర్పించుచున్నామో, అప్పుడీ సమాజమే, ఈ భక్త జనబృందమే, స్వర్గలోకము. ఈపవిత్ర స్థానమునందే మన కత్యంతప్రియతము డగు పరబ్రహ్మము యొక్క ఉపాసనచే, మన సమస్తపాపములును, సమస్తమలిన భావములును, దగ్ధము లగుచున్నవి.

ఓ దయాసింధూ! పాపనివారకా! మా యాత్మలను నీ వైపునకు త్రిప్పుకొనుము. అధోగతి యందున్న మమ్ముద్ధరింపుము! మేము నీయెడల నిమిషనిమిషమును చేయు అపరాధములకు మమ్ము సహస్రవిధముల దండింపుము. మే మెట్టి శిక్షనైనను భరింపగలము గాని, నీతోడి విరహమును మా త్రము సహింపజాలము. మా హృదయములనుండి నీ ప్రసన్న ముఖమును మరుగుపఱచకుము. హేపరమాత్మన్, నిన్ను గురించి నే నేమి చెప్పగలను! నిన్ను వర్ణింపబోయి, నా వాక్కు స్తంభిత మగుచున్నది. నిన్ను భావింపబోయి, నా మనస్సు మరలి

వచ్చుచున్నది. నీవు కరుణించి నా హృదయము నెప్పుడు వశము చేసికొందువో, అప్పుడే నేను బలయుతుడ నగుదును. నిన్ను గురించిన పవిత్రభావములు నా వాక్కుతో వర్ణించి, నా సోదరీ సోదరులకు వ్యక్తము చేయుటకు నాకు సామర్థ్య మెక్కడిది? నీ ప్రసన్నతయే, నీఅవ్యాజానురాగమే, నాకుగల మహా భాగ్యము. ఓ పరమేశ్వరా! నిన్ను గురించిన ఈసమస్త వాక్యములద్వారా, మా యాత్మ లన్నియు నీ కభిముఖము లగును గాక! నీ యిచ్ఛయే నెఱవేరునుగాక!

ఓమ్. ఏకమేవాద్వితీయమ్.

---

ఓమ్ తత్సత్.

# మహర్షి మహోపదేశములు



## ౧౨ వ ఉపదేశము

అపాణి పాదో జవనో గృహీతా
పశ్య త్యచక్షుః స శృణో త్యకర్ణః
స వేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా
త మాహు రగ్ర్యం పురుషం మహాన్తమ్.

అతడు (పరబ్రహ్మము) చేతులు లేనివా డయ్యును, అనంత విశ్వమును విచ్ఛిన్నము గాకుండు నట్లు పట్టి యుంచ

గలడు. అతడు కాళ్లు లేనివాడైనను, విశ్వము నతిక్రమింప గలడు. అతడు కన్నులు లేనివాడైనను, ఎక్కడ ఏమి జరుగుచున్నదో చూడగలడు. అతడు చెవులు లేనివాడైనను, ఎవరు ఏమనుకొనుచున్నను వినగలడు. అతడు మనస్సు లేనివాడైనను, సమస్త జీవరాసుల ఖేదమోదములను తెలిసికొనగలడు. ఆయన రహస్యములను తెలిసికొనగలవా డెవ్వడును లేడు. బ్రహ్మవిదు లాయనను ఆదికారణు డనియు, పరమపురుషు డనియు, మహాత్ము డనియు వర్ణించిరి.

జగదుత్పత్తిస్థితిసంహారసమర్థుడై, అందరికి ప్రభువైన ఆ పరమేశ్వరుడు, మహాపురుషుడు. అతడు సూర్యచంద్రాదులవలె, కేవలము ఒక మహావస్తువు కాడు. అతడు విశ్వమునందలి శ్రేష్ఠమైన వస్తువు లన్నిటికంటెను అధికుడు. అతడు వస్తువు కాడు, పురుషుడు. "అత డీ యనంత విశ్వమున కాదికారణు" డన్నంత మాత్రముచేత, ఆయనను గురించిన భావము సువ్యక్తము కాదు. "అతడు సర్వశక్తిసంపన్న" డన్నంత మాత్రముచేత, ఆయనను గురించిన సంపూర్ణ భావము స్పష్టముగా తెలియదు. అతడు పరమపురుషు డని మనము తెలిసికొనినంతవరకు, ఆయన జ్ఞానము, పవిత్రత, మంగళభావము, స్వతంత్రత, వీని నన్నిటిని గురించి, మనము బాగుగా తెలిసికొనినంతవరకు, మన మాయనను పరబ్రహ్మముగా, ప్రాణస్వరూపి యగు పరమేశ్వరుడుగా, దర్శింపజాలము. కొందరు పామరు లనుకొనునట్లుగా, జ్ఞాన ప్రాణములతో పరిపూర్ణమైయున్న ఈ జగత్తునకు, ఒక అంధశక్తి,

ఒక జ్ఞానవిహీన శక్తి, ఎన్నటికిని కారణమై యుండ జాలదు. దీనికి మూలకారణము జ్ఞానస్వరూపుడు, ప్రేమ స్వరూపుడు నగు నొక పరమపురుషుడే అయి యుండవలెను. వస్తువు ఎంత గొప్పదైనను సరే, సూర్య చంద్రాదుల వలె పరిమిత ప్రమాణము కలదిగాక, ఈ యనంత విశ్వమును మించగ గలిగినంత పరిమాణము గలదైనను సరే, వస్తువు వస్తువే, దానికి నియమించు సామర్థ్యము, అధికారము చేయు శక్తి, నడుపునట్టి తెలివి, ఉండజాలవు. నియమించు శక్తి, ఆలోచించు సమర్థత, స్వాతంత్ర్య భావము, పరిశుద్ధత, ఇవన్నియు పురుష లక్షణములు. వస్తుస్వభావము నియమింపబడుట, పురుషస్వభావము నియమించుట. నియమింపబడుట, నియమించుట, ఈ రెండును రెండు విరుద్ధ భావములు. మొదటిది పారతంత్ర్యమును, రెండవది స్వాతంత్ర్యమును తెలుపును. ఈశ్వరు డొక వస్తువు కాదని, అతడు పరమపురుషుడని, తెలిసికొన జాలని వారు, జగత్కారణమును గురించి, సృష్టి క్రమమును గురించి, ఆలోచింప బోయి, అనేక అపోహాలలో పడిపోవుచున్నారు. వారు ప్రకృతి కతీతమైన జ్ఞానశక్తిని చూడ జాలక, సృష్టినిగురించి ఆలోచించునప్పుడు, ప్రకృతినుండియే సమస్త దృష్టాంతములను తీసికొనుచున్నారు. ధాన్యపుగింజనుండి ధాన్యము పుట్టినట్లు, ఈశ్వరునినుండి ఈ జగత్తు పుట్టినదని, వా రూహించుచున్నారు. ఈశ్వరు డొకరిచే నియోగింపబడి, బాధ్యుడై, పరతంత్రుడై, ఈ జగత్తును సృష్టించెనని కొందరను కొనుచున్నారు. ఈశ్వరుడు, ప్రకృతి అను రెండువస్తువులు లేవు,

ప్రకృతియే ఈశ్వరుడు, ఈశ్వరుడే ప్రకృతి, ప్రకృతికంటె భిన్నమైన ఈశ్వరుడు మరియొకడు లేడు, అని కొందర నుకొను చున్నారు. మరికొందరు జగత్తు వేరు, జగత్కారణము వేరు, అని యొప్పుకొనుచున్నను, ఆ జగత్కారణ మొక అంధశక్తి యని చెప్పుచున్నారు. కాని, అనాదికాలమునుండి, సనాతన మహర్షుల కాలమునుండి, సంతతధారగా ప్రవహించుచున్న "బ్రాహ్మధర్మము" వీని కన్నిటికిని విరుద్ధముగా, ఒక నూతన సత్యమును సిద్ధాంతము చేయుచున్నది. అంధము, జ్ఞానవిహీ నము నగు నొక శక్తి ఈ జగత్తున కాదికారణమని, బ్రాహ్మ ధర్మ మంగీకరింపదు. ఈ జగత్తునకు మూలకారణముగా నొక దివ్యపురుషుని యిచ్ఛ దేదీప్యమానముగా ప్రకాశించుచున్న దని బ్రాహ్మధర్మము ప్రత్యక్షముగా దర్శించుచున్నది. కను కనే, అనాదికాలమునుండియు అమృత పురుషుని సంతాన మగు మానవ సంఘము నాహ్వానము చేసి, జలదగంభీరస్వర ముతో నా సత్యము నుద్ఘోషించుచున్నది.

ఆయన యిచ్ఛతో జ్ఞానము, కర్తృత్వము, మంగళ భావము మొదలయిన సమస్త పురుష లక్షణములును మిళిత మయి యున్నవి. స్వతంత్రశక్తిసంపన్నుడగు నా పరమ పురు షుడే, ఆ పరబ్రహ్మమే, ఈ యనంత విశ్వమునకు పరమ కార ణము. ఎవరికో బాధ్యుడై, ఎవరిచేతనో నియమింపబడి, అత డీ జగత్తును సృష్టింపలేదు. ఎవరి సాహాయ్యము నపేక్షింపకయే; కేవలము తన ఇచ్ఛాశక్తి చేతనే, కేవలము తన మంగళ భావము చేతనే, కేవలము తన ప్రేమను సార్థకము చేసికొను

టకే, అతడీ సమస్త ప్రపంచమును, సమస్తప్రాణి జాతమును సమస్త మానవసంతానమును సృష్టించెను. ఈ యనంత విశ్వమునం దాయనతో సమానులుగాని, ఆయనకంటె అధికులుగాని మ రెవ్వరును లేరు. ఆయన మహచ్ఛక్తి విచిత్రమైనది. జ్ఞానమును, బలమును, కల్యాణమును, సూచించు ఆయన కార్యము లన్నియు, ఆయనకు స్వభావసిద్ధములు. మరెవ్వరి వలననో శాసింపబడి, ఆయన ఈ సృష్టిని రచించి యుండ లేదు. స్వకీయము, స్వాభావికము నగు జ్ఞానబలక్రియా సంపన్నత్వము చేతనే ఈ సమస్తమును సృష్టించెను. ఆయన ఆలోచించెను. ఆలోచనామాత్రము చేతనే, అనంత కౌశల పరిపూర్ణమగు ఈ విచిత్రసృష్టిని చేసెను. ఈ సృష్టిని చేసి, దీనియందలి ప్రతివస్తువునందును తన మంగళభావమును ప్రవేశ పెట్టెను. కనుకనే, పృథివ్యాది సమస్త భూతములును, సూర్య చంద్రాది మహాజ్యోతులును, మిగిలిన సమస్త వస్తువులును, లోకకల్యాణమునకై, మానవాభ్యుదయమునకై, తోడుపడు చున్నవి. ఆయన మంగళనియమమువలననే, ఆయన చండ శాసనము వలననే, జగత్తునందలి సమస్త వస్తువులును నియమింపబడుచున్నవి. సృష్టి యంతయు ఆయన మంగళశాసనమునే, సహస్రసహస్రజిహ్వాలతో, ప్రచారము చేయుచున్నది. అతడు మంగళమయుడు, ఆనందమయుడు అగుటచే, జగత్తును సహితము మంగళ భావముతో, ఆనందరసముతో పరిపూర్ణము గావించెను. అట్టి ఆశ్చర్యమయమహాపురుషుని రచనయే, ఈ యాశ్చర్యమయ జగత్తు. అనంత వికాసమే ఈజగత్తు

యొక్క ప్రాణము. భూమండలము యొక్క సుఖలక్ష్మి, సౌందర్య సంపద, క్రమవికాసము నొందుచు నిరంతరాభి వృద్ధి నొందుచున్నది. జ్ఞానధర్మములు నలుదెసల తమ రాజ్య మును ప్రతిష్ఠాపించు చున్నవి. సృష్టియందలి ప్రతివస్తువును, సృష్టియొక్క మంగళ భావమును కోటి కంఠములతో ప్రచా రము చేయుచున్నది.

విశ్వమునందలి ప్రతివస్తువును వికల్పము నొందుచున్నది. అనంతోన్నతి నొందుచున్నది. కేవలము ఆ పురాణపురుషుడు మాత్రమే, నిర్వికల్పుడై, అనాదికాలమునుండియు స్వకీయ మహిమయందు దేదీప్యమానముగా ప్రకాశించుచున్నాడు. తా నపరివర్తనీయు డయినను, విశ్వమునందలి సమస్తమును పరివర్తన ప్రవాహమునందు పడద్రోసి, ఉన్నతి ముఖముగ నడిపించుచున్నాడు. అతడు పరిపూర్ణుడు. అతనికి వృద్ధిక్షయ ములు లేవు. అత డపరివర్తనీయుడు, చిరపురాతనుడు. కాని ఆయన విశ్వమునం దేదియు పురాతనముగా నుండజాలదు. సమస్తమును నూతనభావము నొందుచున్నది. క్షణక్షణ మును నవవస్త్రధారణము చేయుచున్నది. ఈ నిమిషము నందు వేసిన వేషమును మరు నిమిషమునందు మార్చివేయు చున్నది. ముహూర్త ముహూర్తమును నవ నవలీలలను ప్రద ర్శించుచున్నది. మనము కొంచెము కష్టపడి దేనినైనను నిర్మా ణము చేసితిమేని, దానిని పోగొట్టుకొనుట కెంతో విచా రింతుము. కాని, ఆ పరమపురుషుని సౌందర్యమయ రాజ్యము నందు జరుగుచుండు మార్పు లసంఖ్యాకములు. తరులతా

దులు ఏటేట ఆకులు రాల్చి, చిగిర్చి చిగురుటాకులు పండు టాకులై, పండుటాకులు రాలి, తిరిగి ఆ చెట్లు, ఆ తీగలు చిగురు జొంపములతో నెట్లు శోభిలుచున్నవి! ఇట్లు జరుగుట కేవలము వృక్షరాజ్యమునందు మాత్రమే కాదు. పక్షిరాజ్యము నందు నెమళ్ళెంత సుందరములైన పక్షములతో నమర్పబడి యున్నవి! వాని యీక లెంత సుందరములు! అయినను అవి నిలుకడ గన్న ఇంద్రధనుస్సులో యన్నట్లు కన్నుల పండువుగా నుండు తమ యీకల నన్నిటిని, ఏటేట రాల్చి యేటేట నూతనపక్షధారణము చేయుచున్నవి. ఆ యానందమయ పురుషుని రాజ్యమునందు, సమస్తమును నూతనము, సుంద రము, ఉన్నత్యాభిముఖము.

ఆయన జగత్తు నెంత ఉన్నతిశీలముగా జేసెనో, జీవా త్మల నంతకంటెను ఉన్నతిశీలములుగా జేసెను. ఆయన జీవా త్మలను ఇప్పటి భావములతో ఇప్పటిసుఖములతో సంతృప్తి నొంది యుండనిచ్చుట లేదు. ఆయన జీవాత్మలను క్రమక్రమ ముగా తనవైపున కాకర్షించుకొనుచున్నాడు. వాని జ్ఞానమును, ప్రేమను, ధర్మచింతను అంతకంత కుజ్జ్వలము గావించుచున్నాడు. ఉన్నతియే ఆత్మయొక్క ప్రాణము. క్రమవికాసమే ఆత్మ యొక్క జీవనము. జీవాత్మయందు ఏ మంగళభావ కళికల నుంచియున్నాడో, వాని నన్నిటిని భౌతిక పుష్పములవలె ఇక్కడనే వికసించి, ఇక్కడనే వాడిపోవునట్లు సృజించి యుండ లేదు. మర్త్యలోకమునుండి దేవలోకమునకు, దేవలోకము నుండి మర్త్యలోకమునకు, జీవాత్మ నిరంతర ప్రయాణము

చేయునప్పుడు, ఆ భావకళికలు అనంత వికాసము నొందు చుండును. భావకుసుమవికాస మనంతము, భావప్రసూన సౌరభ మపారము. జీవాత్మయొక్క జ్ఞానము ఇంతటితో పరిసమాప్తి కాదు. ప్రేమ ఇంతటితో నంతరించదు. మన మైహికమునందే పరమ పవిత్ర బ్రహ్మానందము నొంది పరితృప్తుల మగు చున్నాము. కాని, ఆ యానంద ప్రదాత మనకు తా నిచ్చిన పరిమిత దానముతో సంతృప్తి నొందుట లేదు. గ్రహీతల మగు మనము సంతుష్టి నొందినను, దాత యగు నా పరమ పురుషుడు సంతుష్టి నొందుట లేదు. మన మొంత ఆనందము తరువాత ఆనందములో అభిషిక్తుల మగుచున్నను, ఉన్నత సోపానమునుండి ఉన్నతసోపానమున కెక్కిపోవుచున్నను, ఆయన మనతో ననుచున్నాడు—"ఇప్పుడు మీ రనుభవించెడు ఆనందము కంటె ఇంకను మధురతరము లగు ఆధ్యాత్మికానందములు మీ కొఱకు దాచి యుంచితిని. మీ రిదివర కెక్కిన సుందరహర్మ్యములకంటె ఎక్కవలసిన సుందరహర్మ్యము లింకను పెక్కులు గలవు. పొందిన యభివృద్ధికంటె పొందవలసిన యభివృద్ధి ఇంకను విశేషముగా నున్నది. ఆర్జించిన రత్నముల కంటె ఆర్జింపవలసిన జాతిరత్నము లింకను రాసులు రాసులు కలవు" అని ఆయన మరల మరల హెచ్చరించుచున్నాడు. ఉన్నతిశీలములగు మన ఆత్మలను, క్రమక్రమముగా, తనవైపునకు చేయి పట్టి నడిపించి తీసికొని పోవుచున్నాడు.

మన కాయన సామాన్యమైన ఐహికపదవి నిచ్చి సంతృప్తి నొందుటలేదు. మనల నాత్మబలముచే బలయుతుల

నుగా జేసి, అమృతత్వమున కధికారులనుగా చేయదలచి యున్నాడు. ఆయన తానే విధముగా ముక్తస్వభావుడో, స్వతంత్రుడో, అదే విధముగా జీవాత్మను గూడ చేయదలచి, దానికి స్వాతంత్ర్యము నిచ్చి, తన యిచ్ఛానుసారముగా కార్యములు చేయుటకు శక్తినిగూడ నిచ్చి యున్నాడు. ఆయన మిగిలిన సమస్త ప్రకృతిని అఖండనియమములచే బంధించి యుంచెను. సృష్టియందేదియు ఆయన శాసనములను మీర జాలదు. సూర్య చంద్ర నక్షత్రాదులయినను ఆయన యాజ్ఞను మీరి, గతులు తప్పి, తమ యిష్టానుసారముగా నడువజాలవు. సృష్టి యంతయు నియమబద్ధము, శాసనాధీనము, కేవలము జీవాత్మ మాత్రమే ముక్త స్వభావము కలది. కేవలము జీవాత్మ మాత్రమే ఆయన నియమముల ననుసరించుటకును, అతిక్రమించుటకును గూడ స్వాతంత్ర్యము కలిగియున్నది. హిమమువలన నీరు గడ్డ కట్టినట్లు ఈ విశ్వ మంతయు ఆయన నియమ హిమముచే బంధింపబడి యున్నది. కాని, హిమముచే గడ్డకట్టిన జలము సూర్యకిరణ ప్రసారముచే కరగి, నీరయి, మహాప్రవాహమై, వెల్లువై, వసుంధరాతలమును తడుపుచు బీడుభూములను సహితము సస్యశ్యామలములుగా, ఉద్యానవనములుగా, ధనధాన్య సమృద్ధములుగా మార్చివేయునట్లు, జీవాత్మ సహితము ఆ యమృతపురుషుని ఆత్మకిరణ ప్రసారముచే బంధవిముక్తమై, సకల ప్రదేశములయందును, సకల విషయములయందును, సకల పరిస్థితులయందును, ఆయన మంగళ భావములను హృదయపూర్వకముగా ప్రచారము చేయుచున్నది.

అంధకారబంధురములై యున్న హృదయక్షేత్రములయందు, జ్ఞానజ్యోతిని వెలిగించి, ప్రేమ వాహినులను ప్రవహింపజేయు చున్నది. మహావాహిని వలెనే, అదియును ఏ యాటంకమును లక్ష్యపెట్టక, స్వేచ్ఛావిహారిణియై, సకల స్థానములను, శుభ భావోదకముచే ప్లావితము చేయుచు, ప్రవహించి ప్రవహించి తుద కా యమృతసాగరగర్భమున జేరి ధన్యత గాంచు చున్నది. జీవాత్మ సహస్రవిఘ్నము లెదుర్కొనినను, తన ముఖ్యలక్షణ మగు స్వాతంత్ర్యమును మాత్ర మెన్నడును విడువజాలదు.

ఈశ్వరుడు జీవాత్మను తన పోలికనే సృజించెను. యావత్ప్రపంచమును ఆయన ప్రకృతి నియమములచే బంధించెను. జీవాత్మ కొఱకు మాత్రమే ధర్మనియమముల నేర్పర చెను. ఈ ధర్మనియమములయందు నిరోధము లేదు, నిర్బంధము లేదు, పారతంత్ర్యము లేదు. ఈ నియమములయం దంతటను స్వతంత్రభావమే ప్రకాశించుచున్నది. మనుష్యు డెంత వఱకు శరీరబద్ధజీవియో, ఎంతవఱకు ఇంద్రియ ప్రవృత్తుల కధీనుడో, ఎంతవఱకు పశుప్రవృత్తికి బద్ధుడో, అంతవరకు మాత్రమే అతడు జడజగత్తుతోపాటు ప్రకృతి నియమముల కధీనుడై యుండును. జడము వాని కెంతవఱ కాధారమై యుండునో అంత వఱకు అతడును వస్తుతుల్యుడే. ఈ విషయమునందు జడము నకును అతనికిని, పశువునకును అతనికిని, విశేష తారతమ్యము లేదు. తన యధికారము నెంతవఱకు వినియోగించుకొనగలడో, తన స్వాతంత్ర్యము నెంతవఱకు ఉపయోగించుకొనగలడో,

అంతవఱకే అతడు పురుషుడు. "ఈ శరీరము నాది. నే నీ శరీరము కాను. నేను స్వతంత్రుడను. నా యీ యింద్రియము లన్నియు, నా కార్యములను శిరసావహించి పనిచేయుచున్నవి" అని జ్ఞాని తనకును తన శరీరమునకును గల భేదమును తెలిసికొనుచున్నాడు.

జీవాత్మకు తన యింద్రియముల పయిన మాత్రమే గాక, తన చుట్టునుండు ప్రకృతి పయిన సహితము అధికారము కలదు. జీవాత్మయందు బద్ధభావము, అస్వాతంత్ర్యము అనునవి లేవు. కేవలము ప్రకృతియందు మాత్రమే అస్వాతంత్ర్యము, బద్ధభావము, నియోగింపబడుట అనునవి కానవచ్చుచున్నవి. దేనికి మొదలు, చివర లేదో, అటువంటి అభేద్యమైన, దురూహ్యమైన, కార్యకారణ శృంఖలత, ప్రకృతియందు మాత్రమే వ్యాపించి యున్నది. ప్రకృతి గ్రుడ్డివానివలె నియోగింపబడి సమస్త కార్యములను చేయును; తెలియకయే, వినకయే, ఈశ్వరుని మంగళాభిప్రాయముల నన్నిటిని నెఱవేర్చును. ప్రకృతి మృత్యువు యొక్క ప్రతిబింబమే. దీనియందు అమృతభావము, బుద్ధభావము, ముక్తభావము అత్యల్పమైనను లేదు. పరమేశ్వరుడు కేవలము మనుష్యునికి మాత్రమే, ప్రకృతికి లేని, ప్రకృతి కతీతమైన శక్తి నిచ్చి, తన సమీపమునకు తీసికొని పోవుచున్నాడు. మనుష్యుడు విజ్ఞానము వలన ప్రకృతిని స్వాధీనపఱచుకొని ప్రకృతి నతిక్రమింప గలుగు చున్నాడు. అతడు పరమేశ్వరుడు తన కేర్పరచిన ధర్మనియమములను పాలించి సుఖించుటకును, పాలింపక

తత్ఫలమగు కష్టము ననుభవించుటకును, తనకు స్వాతంత్ర్యము కల దని తెలిసికొనుచున్నాడు. ప్రబలములగు ఇంద్రియములు ప్రలోభములను కల్పించి, తనను స్వాధీనపఱచుకొనుటకు ప్రయత్నించినప్పుడు, ధీరుడు వానిని లక్ష్యపెట్టక, తాను ధర్మనియమముల కనువర్తియై, తన స్వాతంత్ర్యమును నిలుపుకొనగలుగుచున్నాడు. పరమేశ్వరుడు తఱచు తన భక్తుని కఠోరవిపత్తులయందు పడద్రోయుచున్నాడు. అది, అతని నింకను బలవంతునిగా, సంగ్రామ దక్షునిగా చేయుటకు, మాత్రమే. మనుష్యు డిట్టి సంగ్రామములు చేసియే, మహాబల సంపన్నుడై, వీర్యవంతుడై, తన జీవనమార్గమునందు తన నెదుర్కొను సమస్త విఘ్నములను, విపత్తులను దునుమాడి, విజయియై, తుదకు జగత్పితయొక్క పాదపద్మముల దగ్గర చేరి, ఆయనకు నమస్కరింప గలుగుచున్నాడు.

ఈశ్వరునకును మనకును ఎట్టి జీవవంతమైన సంబంధము కలదో చూడుడు. అతడు మహాత్ముడు, ప్రభువు, పురుషుడు. ఆయన మనుష్యునికి సహితము తన స్వరూపమును తన సాదృశ్యమును దయచేసియున్నాడు. మనుష్యునకు మనుష్యునకు ఎట్టి సంబంధమో, తండ్రికి కుమారునకు ఎట్టి సంబంధమో, ఈశ్వరునకు మానవునికి అట్టి సంబంధమే. మన మాయన బిడ్డలము, సేవకులము గాము, బానిసలము కాము. ఆయన రాజ్యమును, ఆయన ఐశ్వర్యమును సంపూర్ణముగా ననుభవించుటకు మన కందరకు సమానాధికారము కలదు. ఆయన మనల నపారప్రేమతో జూచుచున్నాడు. మనము

కృతజ్ఞతతోను, ప్రేమతోను, ఆయనను దర్శించుచున్నాము. ఆయన యేర్పరచిన పవిత్రధర్మనియమములు, మన హృదయ ఫలకములయందు స్ఫుటముగా లిఖింపబడియున్నవి. మన మాయన నిర్బంధముచేగాక, మన యిష్టానుసారముగా, ఆయన నియమములను పాలించి సుఖింపగలము. మనము మాత్రమే ఇట్టి స్వాతంత్ర్యమును గలిగియున్నాము. మనకును ఈశ్వరునకును గల సంబంధము, పురుషునకును పురుషునకును గల సంబంధము వంటిదే. ఉభయులును బద్ధులు కారు. ఉభయులును స్వతంత్రులే. ధర్మనియమములను పాలింపుమని మనల నాయన నిర్బంధించుట లేదు. ఆయన నియమములను పాలించుటయే పరమపురుషార్థమని తెలిసికొని, మన మా ధర్మనియమములను, ఇచ్ఛానుసారముగ పాలించుచున్నాము. మనము స్వతంత్రులము, బద్ధులముకాము. ఈ సత్యమే బ్రాహ్మధర్మమునకు ప్రాణము. మనము ప్రతిదినము అన్నపానముల కొఱకు, సుఖసంపాదనముకొఱకు, దుఃఖనివారణము కొఱకు, పాపవిమోచనము కొఱకు, ఆ యమృత పురుషుని వైపునకు చూచుచున్నాము. ఆయనతో మనకు గల సంబంధ మీవిధముగా, జీవవంతమైన సంబంధము. ఆయన మన తండ్రి. మన మాయన బిడ్డలము. అమృత స్వరూపుడగు పరమపురుషుని బిడ్డలారా! మన మందరమును కలిసి ఆయన నారాధింతము, ఆయనకు శరణాపన్నుల మగుదము, పవిత్ర హృదయములతో ప్రశాంత మానసములతో, ఆయన యనుగ్రహమును వేడికొందము.

ఈశ్వరుడు సమస్త ఆత్మలను తనవైపున కాకర్షించుచున్నాడు. ప్రతి మానవ హృదయమునందును తన మంగళ భావముల నంకురరూపముగా నాటి యున్నాడు. ఆ భావాంకురములను మొలక లెత్తించి వికాసము నొందించుటకు, తేజస్విలగు మహాపురుషుల నప్పుడప్పుడు ప్రేరణ చేయుచున్నాడు. ఈ ప్రియ పుత్రు లాయన మంగళభావములను తమ యనుదిన జీవితమునందు దృష్టాంతరూపముగా ప్రదర్శించి, ప్రేమ సాగరుని ప్రేమభావమును భూమండలమునం దంతటను ప్రచారము చేయుచున్నారు. ఈశ్వరభావాంకురములు స్థాపింపబడని మానవహృదయ ముండదు. కాని, ప్రతివానికిని తన హృదయమునందు పరమేశ్వరునిచే నాటబడిన మంగళభావాంకురములను వికసింప జేసికొనుటకు తగిన ధైర్యస్థైర్యములును, మనోనిగ్రహాదులును ఉండవు. ఎవరు ధీరులో, ఎవరు ఆత్మనిగ్రహము గలవారో, ఎవరు ఈశ్వరానురక్తులయి ఆయనయందు తమకు గల అహేతుకభక్తిచే తమ జీవితముల నాయన పాదపద్మములయందు నైవేద్యముగా సమర్పించి యున్నారో, అట్టి మహాపురుషుల సంస్పర్శమువలన, ఉపదేశము వలన, అనుదిన జీవిత దృష్టాంతమువలన, జనసామాన్యము యొక్క హృదయముల యందలి మంగళ భావాంకురములు ప్రస్ఫుటితము కాగలవు, వికాసము నొందగలవు. ధర్మజీవనము నందు, ముం దడుగువేసి, ఎవ రీవిధముగా జన సామాన్యమునకు పురోభాగమున ప్రయాణము చేయుచున్నారో, అట్టి పరమభాగవతోత్తములు, వెనుక వెనుకనే ప్రయాణము

చేయు తమ సోదరీసోదరులను, తమసామీప్యమున కాకర్షించు చున్నారు. ఇట్టి సాధుపుంగవుల హృదయభావము లెంత మహనీయములు. మన హృదయ క్షేత్రములయందు, పరమేశ్వరుడు మన యంతరాత్మ స్వరూపమున ప్రకాశించుచు, మహత్తరములును, అతిరమణీయములును, హృదయ సమ్మోహనకరములును అగు నెట్టి మంగళభావములచే మన ప్రేమ నాకర్షించుచున్నాడో, ఈశ్వరానురక్తు లగు భక్తుల భావములును తదనురూపములే. వారు తమ జీవితమునందు తమకు తటస్థించెడు సమస్త విఘ్నములను విపత్తులను ఎదుర్కొని, ఎట్టి కష్టములనైన సహించి, ఈశ్వరుని మంగళభావములను తమ జీవితము మూలమున లోకమునకు ప్రచారముచేయుచున్నారు. వా రీశ్వరనియోజితులై, ఈశ్వరప్రేరితు లయి ఈశ్వర సంతానముయొక్క ఆదర్శజీవితమును లోకమునకు ప్రదర్శింతురు. పరమేశ్వరు డీవిధముగా, మహాపురుషుల మూలమున, కోట్లకొలది జనసామాన్యమును తన వైపున కాకర్షించుకొను చున్నాడు. వారిని పరీక్షించుటకును, ఎట్టి కష్టములనైన సహింపగల శక్తి సామర్థ్యములు గలవారినిగా చేయుటకును, వారి నాయన అనేక కష్టపరంపరలలో నుండి ప్రయాణము చేయించు చున్నాడు. వారును ఆయనకు ప్రియ పుత్రులై, తమ జీవితము నందు తమకు తటస్థించెడు సమస్త కష్టములును తమ క్షేమము కొఱకే యని వాని నెల్లను శిర సొగ్గి, బలయుతులై, నవజీవనము నొంది, ప్రసన్నహృదయముతో, జీవితములను గడుపుచు లోక కల్యాణమునకై తోడ్పడుచున్నారు. ఈశ్వరుని మంగళ

విధాన మెంత విచిత్రము! మన యెడల నాయన కెంత యనుగ్రహము ! ఎంత ప్రేమ !

హే పరమాత్మన్! ఓ పరమ పురుష! మా యీ భరత ఖండము నుజ్జ్వలముగా చేయుము. నీ యీ సమస్త దుర్బల సంతానముపైసి నీ కృపావృష్టిని వర్షింపుము. ఆర్య మహర్షుల నాటి యుచ్చదశను గోల్పోయి, నీచావస్థయందు పడియున్న ఈ మా దేశము నుద్ధరింపుము. ఆధ్యాత్మిక స్వాతంత్ర్యముతోపాటు, సమస్త స్వాతంత్ర్యములను గోల్పోయి, హీనావస్థలో పడియున్న ఈ పరాధీన దేశము నుద్ధరించుటకు నీవు గాక రక్షకులెవరు? ఈ మా దేశము దాస్య శృంఖలములచే బంధింపబడి, ఆరోజు కారోజు నానా క్లేశములతో, నానా విపత్తులతో ఆవృత మగుచున్నది. రేయిం బగళ్ళు దీనుల యార్త ధ్వనితో గగనమండలము ప్రతిధ్వనింపు చున్నది. ఓపరమ పితా! ఈదేశము నుద్ధరింపుము. ఓ పరబ్రహ్మమా, సమస్త మానవ హృదయములయందును, ధర్మ తేజము ప్రజ్వలింప జేసి, సమస్త మాలిన్యమును దగ్ధముచేయుము; శాంతివారిని వర్షించి, సమస్త సంతాపములను హరించివేయుము. నీ కరుణా రసమును ప్రవహింప జేసి, అందఱను దయావంతులనుగా జేయుము. నీవు మా యెదుట తల్లివలె, తండ్రివలె దర్శన మిమ్ము. మే మందరమును కలిసి, ఏకహృదయముతో, ఐకకంఠ్యముగా, నిన్నారాధింప గలుగుదుము గాక! ఆ సేతుహిమాచల పర్యంతము భారతీయు లందఱు, నీ విశ్వమానవసంతానముతో కలిసి, ఏకమనస్కులై, కోటికోటి కంఠములతో నిన్నుపాసింప

గల శుభదిన మెప్పు డాసన్న మగును! క్షుద్రులము, కించిద్జ్ఞులము, అల్పశక్తులము, స్వార్థపరులము, అగు మా ప్రయత్నములచే ఇదెన్నడైనను సాధ్యమగునా? సకల శుభ సంధాయకుడవు, సిద్ధి ప్రదాతవు, అమోఘసంకల్పుడవు అగు నీ కేది యసాధ్యము? నీ యనుగ్రహ మున్న సర్వశుభములును సిద్ధించును. ప్రభో! నీ కృప తప్ప మాకు వేఱు గతి లేదు. నిన్నే శరణ్యము వేడుచున్నాము. ఆశీర్వదించి రక్షింపుము.

ఓమ్. ఏకమేవాద్వితీయమ్.

---

ఓమ్ తత్సత్.

# మహర్షి మహోపదేశములు



## ౧౩ వ ఉపదేశము

ఇదం వా అగ్రే నైవ కించి దాసీత్
న దేవ సౌమ్యేద మగ్ర ఆసీత్
ఏక మేవాద్వితీయమ్
సవా ఏష మహా నజ ఆత్మా.

ఈ విచిత్ర జగత్తు పూర్వ మెంత మాత్రము ఉండి యుండలేదు. ఎక్కడను దీని జాడనైనను కానరాకుండెను. ఘనీభూతమైన అంధకారము మాత్రము సర్వత్ర వ్యాప్తమై యుండెను. అప్పుడా యంధకారము మరియొక యంధ

కారముచే కప్పబడిన దేమో యన్నట్లు అత్యంత నిబిడమై యుండెను. అంధకారము మూర్తీభవించినట్లుండెను. అప్పుడా యంధకారమును వెలిగించుచు కేవలము ఏకమాత్రుడును అద్వితీయుడును, సత్యస్వరూపుడును అగు పరబ్రహ్మము మాత్రమే యుండెను. ఎప్పుడు ఏ జ్యోతియు లేకుండెనో, కేవలము అంధకారము మాత్రమే యుండెనో, అప్పుడు సహితము, ఆ జ్ఞానజ్యోతి, ఆ పరమ పురుషుడు, తన మహిమయే తానై విరాజిల్లుచుండెను. సమస్త జ్యోతులును చల్లారి పోయినను, సూర్యుడు మరల ఉదయమగు నను నాశ లేకుండు నట్లు, చిరకాలమువఱకు అస్తమించి పోయినను, నక్షత్రము లన్నియు గగన మండలమునుండి సంపూర్ణముగా లోపించి పోయినను, అప్పుడు సహితము ఆ జ్యోతిర్మయ పురుషుడు దేదీప్యమానముగా ప్రకాశించుచునే యుండును. సృష్టికి పూర్వమందు, ఆయన స్వకీయమహిమయందు ప్రకాశించుచుండెను. వర్తమానకాలమునందును, ఈ సమస్త సృష్టికిని ప్రాణ స్వరూపుడై విరాజిల్లుచున్నాడు. ఈ సమస్త సృష్ట ప్రపంచమును సుదూర మగు భావికాలమున అనంత కాల గర్భమునందు లయమై పోవునప్పుడు సహితము ఆయన నిత్యవర్తమానుడు. ఆయనకు భూత భవిష్యత్తులు లేవు. ఆయన కాలాతీతుడు. అనంతకాలము నుండి అనంతకాలమువఱకు ప్రకాశించుచుండును. ఆయన భూత భవిష్యద్వర్తమాన కాలములకు నియంత. ఆయన నే డెట్లు ప్రకాశించుచున్నాడో రేపును అట్లే ప్రకాశించును.

అతడు మాత్రమే నిత్యవర్తమానుడు. ఆయన ఒక హస్తముతో భూతకాలమునందలి కార్యములను రెండవ హస్తముతో భవిష్యత్కాలమునందలి కార్యములను నియమించుచున్నాడు. ఆయన దేశకాలముల కతీతుడు. ఆయనపైన ఆకాశము గాని, కాలము గాని తమ యధికారమును చూపజాలవు. ఆయన సమస్తజగత్తును దేశకాలము లను సూత్రములచే బంధించి వేసెను. సమస్త ప్రపంచమునకును దేశకాలము లాధారములు, దేశకాలములకు పరమేశ్వరు డాధారము. ఆయన విశ్వ మంతయు నిండి పరిపూర్ణుడై యున్నాడు. పడుగు, పేకవలె, ఆధారమై ఆధేయమై ప్రకాశించుచున్నాడు.

ఎప్పుడు సమస్తము అసత్తుగా నుండెనో, కేవలము ఆద్యంత రహితమైన నిబిడాంధకారము మాత్రమే యుండెనో, అప్పు డా సనాతనపురాణపురుషుడు మాత్రమే, స్వకీయమగు జ్ఞానజ్యోతియందు విరాజమానుడై యుండెను. అప్పటి అంధకారము ఎంత గంభీరమై యుండెను! ఒక వర్షాకాలపు నిశీథ సమయమున, ఒక యున్నత ప్రదేశమునుండి, నలుదెసలును పరికించి చూచినప్పుడు, ఒక గ్రహముగాని, నక్షత్రముగాని, ఆకసమునందు కానరానప్పుడు, సమస్తాకాశమును దట్టమైన నల్లని మేఘములతో ఆవరించి యున్నప్పుడు, యావత్ప్రపంచమును నిశ్శబ్దమై యున్నప్పుడు, కేవలము అంధకారము మాత్రమే నయనగోచర మైనప్పుడు—అప్పుడు, ఆ నిబిడాంధకారమధ్యమున, పులకాంకితగాత్రులమై, స్వయంభు వగు

ఏ సనాతన మహాపురుషుని ప్రత్యక్షదర్శనమును చేయగలు గుదుమో, కేవలము ఆ పురాణపురుషుడు మాత్రమే, ఈ జగదుత్పత్తికి పూర్వమందు ఆదిమాంధకారమధ్యమున, స్వకీయ సత్యజ్ఞానజ్యోతిర్మయుడై, ప్రకాశమానుడై యుండెను.

సృష్టికి పూర్వమందు మరేదియు లేకుండెను. కేవలము ఏకమాత్రుడగు అద్వైతపరబ్రహ్మము మాత్రమే యుండెను. అప్పుడాయన సంకల్పించెను. సంకల్పించి, సమస్త విశ్వమును సృష్టించెను. ఆయన జ్యోతిష్మంతుడగు సూర్యుని సృజించెను. సమస్తాంధకారమును అంతర్హితమయ్యెను. చిరకాల వ్యాప్తమగు నా రాత్రి అవసానమై, ప్రథమ ప్రాతఃకాల సమయమున, తొలిసారి సూర్యోదయశోభ—ఆదీప్తి, ఆ దివ్య తేజమెంత ఆశ్చర్యకరము! నిశ్శబ్దమగు, ఆ చిరకాలవ్యాప్తమగు రాత్రిని ఛేదించుకొని, ఆ నవ ప్రభూత తేజోరాశి యగు సూర్యుడెక్కడనుండి వచ్చెను ? ఇతడెక్కడనుండి సహస్ర సహస్ర కిరణధారియై దశదిశల సుజ్వాలముగా చేయగలిగెను ? అట్టి ఆదికారణుడైన పరమేశ్వరుని యిచ్ఛ చేతనే, మన వాసస్థానమగు, ఈ తేజోమయ సుందర పృథివీ మండలము, ఆకాశ మార్గమున సూర్యునికి నలువైపులను వ్యాపింప నారంభించెను. ఆహా! అప్పుడీ భూమండలము కొంచమైనను ఎరుగదయ్యెను. ఎవరు తన్నట్లు ప్రేరేపించుచున్నారో, ఎందుకు ప్రేరేపించుచున్నారో, దాని కెంత మాత్రమును తెలియదయ్యెను. అప్పుడెవ రెరుగుదురు ? జ్వలించుచున్న అగ్నిహోత్రమువలె, తప్తమై, కరగి, నీటి

వలె ప్రవహించుచున్న లోహములతో నిండి, ఆవిరి రూప ముగా నుండు, మేఘావృతమైన, ఆ పృథివీ మండలము జీవులకు వాసయోగ్యమై, సమస్త సుఖములతో, సమస్త జ్యోతు లతో, సమస్త సౌందర్యములకు నిలయమై, ఇంత ఆశ్చర్యకర ముగా నలంకరింపబడునని, అప్పు డెవ రెరుగుదురు? అసంఖ్యా కములును అత్యద్భుతములును అగు నిట్టి జీవరాసులతో, ఇట్టి తరులతాగుల్మాదులతో సంపూర్ణము కాగలదని అప్పు డెవ రెరుగుదురు? దానియం దిట్టి బీజము లన్నియు ఎవరు చల్లిరి? ధన ధాన్యములతో, ఫల పుష్పములతో, సమస్తైశ్వ ర్యములకు ఆకరముగా, సమస్త సుఖభాండాగారముగా, దీని నెవ రలంకరించిరి? ఆ సూర్యచంద్రాదు లెక్కడనుండి వచ్చిరి? మనము నివసించు ఈ ధరామండల మెక్కడనుండి వచ్చెను? ఈ చెట్టుచేమలు, ఈ జీవ జంతువులు ఎక్కడనుండి వచ్చెను? గగన మండలమున అసంఖ్యాకము లగు మైళ్లదూరమున నుండు సూర్యునుండి అజస్రము వెలుతురు ప్రవహించుచున్నది; భూమండలము కాంతిమంత మగుచున్నది. అందువలన దాని యందు జీవనప్రవాహము నిరంతరధారగా ప్రవహించు చున్నది. మన యంధత్వము తొలగి పోవుచున్నది. ఈ రెంటిని అట్టి మంగళ సంబంధ పాశములతో ఎవరు నిబద్ధము గావించిరి? ఏమి యాశ్చర్యము! ఇదంతయు చేతనవిహీన మగు ఒక అంధ శక్తి యొక్క కార్యమా? ఈ ప్రాణము, ధనము, జీవనము, ఈ నిరుపమాన సౌఖ్యములు, ఇవన్నియు ఒక జ్ఞాన విహీన మగు శక్తి నుండి వర్షించినవా? లేక సర్వశక్తుడు, విజ్ఞాన

స్వరూపుడు, మంగళమయుడు అగు నొక మహాపురుషుని యిచ్ఛనుండి ప్రభవించినవా? ఈ పృథివీమండలము కేవలము ద్రవధాతుపిండస్వరూపమున నున్నప్పుడు మనుష్యు డెవ డైనను దీనిని చూడగలిగినయెడల, ఆవిరిమయమై, బాష్ప మయ మేఘములతో ఆవృతమై యుండిన, ఆ జడపిండమును జూచి, అత డెప్పు డైన, అది, ఈ విధముగా, సమస్తసుఖము లకు నిలయమై, ఆనందరాజ్యమై విలసిల్లు నని, ఊహాయం దైనను భావించియుండగలడా! కాని, సర్వమంగళవిధాత యగు పరమేశ్వరు డాలోచించి, ద్రవధాతుమండలము, శూన్యము నగు ఈ భూమండలము, సమస్తజీవులకును వాసయోగ్యమై, సకల సుఖములకును ఆకరమై, యలరారు నట్లు, దీని నంతను తన విచిత్రశక్తితో నింపివేసెను. కాలక్రమమున నిది చల్లబడి అసంఖ్యాకము లగు జీవరాసుల కాధారమయ్యెను. అసంఖ్యా కము లగు సౌఖ్యముల కాలయ మయ్యెను. బాష్పరాశి ఘనీభవించి, మేఘమై చల్లనిజలము వర్షింపసాగెను. ఆ జలమునందు ఎన్నెన్నియో జలచరములు, రకరకముల చేపలు, మకరములు, తిమితిమింగిలాదులు, ఇంకను ఎన్నెన్నియో కోట్ల కొలది జలజంతువులు విహరింపసాగెను. మఱల కొంతకాలము నకు ఆ జలగర్భమునుండి పర్వతము లన్నియు సూర్యాభి ముఖములై తలలెత్తి ఈశ్వరమహిమను ఘోషింపసాగెను. ఈ పృథివీమండల మప్పుడు కొంతభాగము స్థలమై, కొంత జల మయ్యెను. అనేక విధములగు ఉద్భిజ్జములు, నానావిధ జీవజంతువులు, దానియం దుత్పన్న మయ్యెను. ఇదంతయు

దానంతట నదే జరిగినదా, లేక ఇది యొక అంధశక్తియొక్క కార్యమా? కాదు కాదు. ఇదంతయు ఆ విజ్ఞానమయ పురుషుని దివ్యమహిమ. ప్రాణినిర్మాతైకశిల్పి యగు ఆయన గాక ఈ ఆశ్చర్యమయజగత్తును సృజించి, ఈ యపూర్వ నిర్మాణమును మరెవ్వరు చేయగలుగుదురు? ఆయన మన కన్నము తినుటకు దంతము లిచ్చెను. దంతము లియ్యక పూర్వము, తల్లి యురోజములయందు పాల నుంచెను. ఎంత యాశ్చర్యకరమయిన కౌశలము! ఆయన పరిపాలనశక్తి ఎంత యద్భుతావహము! ఈ నేర్పరితన మంతయు ఒక అంధశక్తి యొక్క కార్యమా? దీనియందొక విజ్ఞానము, ఒక మహాపురుషుని మంగళభావము, ఆలోచన, ఇచ్ఛ, ప్రకాశించుచుండలేదా?

ఎవడు మనలను సమస్తవిధముల సంరక్షించి పోషించుచున్నాడు? ఏ కరుణామయపురుషుడు మన రోగశాంతి కొఱకనేకవిధము లగు ఓషధులను సృజించి యుండెను? మన శరీరమునందలి ఏ యవయవమునకైనను బాధ కలిగినప్పుడు, ఎవని మంగళనియమమువలన, అది తిరిగి పూర్వము వలె స్వస్థమై మరల పనిచేయుటకు శక్తిమంత మగుచున్నది? ఆత్మ యెప్పుడు కలుషితమగునో, ఎప్పుడు పాపములయందు నిమగ్నమగునో, అప్పుడు ఎవడు దానియందు అనుతాపాగ్నిని రవుల్కొల్పి, సమస్త కలుషములను కాల్చివేసి, దానిని తిరిగి ఉద్ధరించును! ఈ సమస్తమంగళకార్యములకును ఎవడు విధాతయో, అతడే మన కనంతకాలమువఱకు తల్లి, తండ్రి, సంరక్షకుడు, సకలమును. అతడే మన కవసరమైనప్పు డెల్ల

సాహాయ్యము చేసి, సత్పథమునుండి తొలగకుండ సంరక్షించు చున్నాడు. ఇక మన కేమి భయము? అట్టి మహాపురుషుడు మనకు రక్షకుడై యుండగా, మన కేమి లోపము? ఆయన జడప్రపంచమున కెట్లధిపతియో, అట్లే ఆత్మకును అధిపతి. ఎట్లు సమస్త విశ్వమునకును ఈశ్వరుడో, అట్లే మనకును ఈశ్వరుడు. మన మాయన యనుగ్రహమునే యనుభవించుచు, దినములు గడపుచున్నాము. మన జీవితమునందలి సమస్త భోగములు సమస్తసుఖములు, ఆయననుండియే వచ్చుచున్నవి. మనము కృతజ్ఞతాపూరితహృదయములతో ఆయనకు నమస్కరింప గలిగినప్పుడు ఆ భోగములు, ఆ సుఖములు, ఎంత పవిత్రము లగుచున్నవి. సంపదలు మన కాయన ప్రసన్నముఖమును ప్రదర్శింపుచున్నవి. విపత్తులు ఆయన రుద్రముఖమును ప్రదర్శించి, గురువువలె శిక్ష నొసగి, మనల నాయన సన్నిధానమునకు తీసికొని పోవుచున్నవి. అప్పుడా విపత్తులే మనకు పరమసంపత్తులుగా పరిణమించుచున్నవి. సంపత్తునందును, విపత్తునందును, ఆయన కరుణయే. పగలును, రాత్రియు, ఆయన కరుణయే. సమస్త విశ్వమునందును ఆయనకరుణయే. ఇహమందెట్లో, పరమందును ఆయన కరుణయే. అనంతకాలమునకును మన మాయన కరుణ నాశ్రయించియే, అనంతోన్నతి నొందుచుందుము. మన మత్యంతబలహీనుల మగుటచే, మన మీ పృథివీమండలమందు కొలదికాల మైనను, ఆయనయొక్క మంగళ భావముపైననే ఆధారపడి, ఆయన శరణమునే నమ్ముకొనియుండ జాలకున్నాము. మన మెంత విశ్వాసహీనులము!

ఎవరితో మన మనంతకాలము సహవాసము చేయవలసి యున్నదో, ఎవరియొక్క మంగళచ్ఛాయయందు, అనేక విఘ్నములతో, విపత్తులతో కూడిన, ఈ స్వల్ప భౌతిక జీవితమును సురక్షితముగా గడపుచున్నామో, అట్టి మహాపురుషుని పైననే, మన జీవిత భారమును వేసి, మనము సుఖముగా జీవన నిర్వహణము చేయజాలకున్నాము. మన అనంతకాల జీవితముతో పోల్చినయెడల మన యీ భౌతికజీవితము క్షణమాత్రము. ఈ క్షణకాల జీవితమునందే మంగళమయుడగు ఆ పరమపురుషునిమీద ఆధారపడి, నిర్భయముగా, నిర్విచారముగా నుండలేని యెడల, మన అనంతకాల జీవితమునందు మనకు రక్షకు లెవరు? మన మీ ప్రపంచమునందలి అల్పసుఖములలో సుఖించుచు, అల్పదుఃఖములతో శోకించుచు, ఉండ వలసినదేనా? మన మీ ప్రపంచము నందలి క్షణికసుఖములతో మైమఱచి యుండవలెనని భగవదుద్దేశము కాదు. ఆయన మనయాత్మోన్నతి నపేక్షించుచున్నాడు. మనము ధర్మబలముచే బలవంతులము కావలెనని కోరుచున్నాడు. సుఖమునందును, దుఃఖమునందును, సామాన్యావస్థ నొంది నిశ్చలచిత్తముతో నుండ గోరుచున్నాడు. అతడే విధముగా, జడరాజ్యమును భౌతికనియమములచే బంధించియున్నాడో, అదేవిధముగా ఆత్మకొఱకు ధర్మనియమముల నేర్పఱచి దానికి స్వాతంత్ర్యము నిచ్చెను. మన మేవిధముగా ధర్మము నభ్యసింతుము? దృఢమనస్కులము, బలిష్ఠహృదయులము ఎట్లు అగుదుము? జ్ఞానమునందు ధర్మమునందు ఎట్లు ఉన్నతి నొందుదుము? - ఇదే ఆయన

యాలోచన, ఇదే ఆయన యాకాంక్ష. ఈ యభిప్రాయ మును నెఱవేర్చుకొనుటకే, అనేకోపాయముల నవలంబించు చున్నాడు. మఱియు ఆయనకూడ స్వయముగా మన కవసరమైనప్పు డెల్ల, సహాయము చేయుచున్నాడు. శీత కాలము వేసవికాలములవలె సంపదలు ఆపదలు, సుఖములు దుఃఖములు, మొదలగు ద్వంద్వావస్థలు, మన జీవితమునందు వచ్చుచున్నవి, పోవుచున్నవి. కాని, మనము, ధర్మపక్షమునే అవలంబించితిమేని, ఈశ్వరునిపై ననే భారము వేసితిమేని, మన యాత్మబల మెంతమాత్రము తగ్గిపోజాలదు. ఆత్మశాంతికి దేనివలనను భంగము కలుగజాలదు. అతడే ఇహపరముల కేకమాత్రరక్షకుడు. అతనికంటె మనకు వేఱు శరణ్యము లేదు. భవబంధవిమోచకు డగు ఆ పరమ పురుషుని మీదనే భారము వైచి, భయరహితులమై, జీవయాత్ర గడుప బ్రయత్నింతము. పరమదయాకరుడైన పరమేశ్వరుడు మన సత్ప్రయత్నముల సఫలము గావించుగాత !

ఓ పరమాత్మా! మా ఆత్మశాంతిని రక్షింపుము. నీ మంగళచ్ఛాయను సర్వత్ర వ్యాపింపజేయుము. మా బ్రాహ్మ భ్రాతృవర్గమును నీ ధర్మపథమునందు ముందుకు నడిపింపుము. మాయీ దేశమును నీ జ్ఞాన తేజముచే నుజ్జ్వలము గావింపుము. భూమండలము నంతను నీ శాంతిసలిలముతో శీతలము గావింపుము. ద్వేషాగ్ని నార్పివేయుము. భ్రాతృభావమును పెంపొందించుము. సమస్తమానవసంఘమును నీ యుపాసనయందు

ప్రవృత్తులను గావింపుము. నీవు తప్ప వేఱు శరణ్యము లేదనుము. ప్రభో! ఆశీర్వదించి రక్షింపుము.

ఓమ్. ఏకమేవాద్వితీయమ్.

---

ఓమ్ తత్సత్.

# మహర్షి మహోపదేశములు



## ౧౪వ ఉపదేశము

యాథాతథ్య తోర్థాన్ వ్యదధా చ్ఛాశ్వతీభ్యః సమాభ్యః.

రస స్వరూపుడు, ప్రేమ స్వరూపుడు నగు పరమేశ్వరునిదే ఈ సృష్టి. ఆ మంగళమయుని మంగళభావమువలననే ఇది పరిపూర్ణమై యున్నది. ఆ యానందమయుని ఆనంద కిరణములచే సమస్త దిశలును సముజ్జ్వలితము లగుచున్నవి. ఈ జగత్తునందు సుందరములును, ఉజ్జ్వలములును అగు సమస్త వస్తువులును ఆయనవే. ఇక్కడ ఏమే మున్నవో, అవన్నియు ఆయన యిచ్చినవే. ఆయనయే మన యీ పృథివీమండలమును జ్యోతిర్మయముగను, సౌందర్యవంతముగను, జీవనసుఖములతో పరిపూర్ణమైనదిగను, రచించి యున్నాడు. కాని, భూమండలమెంత వైభవయుక్తమై యున్నను, ఈ సమస్త భోగములను భోగించు భోక్త, రంగస్థలమున ప్రత్యక్ష మగు వఱకు

ఇదంతయు శోభావిహీనమై గృహస్థు లేని గృహమువలె వెల వెలబారుచుండెను. ప్రేమనిధి యగు పరమేశ్వరు డప్పుడు మనుష్యుని సృజించి భూమియొక్క వైభవమును సార్థకముచేసి యున్నాడు. నక్షత్రమండిత మగు గగనమండలము, సౌందర్య రాశి యగు పృథివి, ఈ రెండును మానవుడు లేనియెడల అర్థ హీనములు. ప్రేమ, మంగళభావము, ఆనందవితరణము, ఇవే సృష్టియొక్క ఉద్దేశములు. ఆయనకు స్వయముగా ఏ యఖండ మంగళభావము గలదో, మిగిలిన జీవులు సహితము, ఆ మంగళ భావము ననుసరించి, హృదయమునందు ధారణ చేసి, దానినే ప్రచారము చేయుచున్నారు. ఈ యుద్దేశముతోనే, ఆయన ధర్మజ్ఞు లగు సమస్త జీవులను సృష్టించెను. మన కే సాధు భావము కలదో, అది ఆయన మంగళభావముయొక్క నీడయే, ఛాయాపటమే, ప్రతిబింబమే! సాధుపురుషుల లక్షణ మేమి? స్వయముగా వా రేయానందము ననుభవించుచున్నారో, దాని నితరులు గూడ ననుభవించునట్లు చేయు వఱకు, వారు తృప్తి నొంది యుండజాలరు. భగవంతుడు తమకు దయచేసిన అన్న పానాదులు దీనులకు దరిద్రులకు పంచి యియ్యక, తాము మాత్రమే అనుభవించినయెడల వారి కెంతమాత్రము సంతోష ముండజాలదు. తామే నూతన సత్యమునైన కనుపెట్టినయెడల, వారి జిహ్వ వెంటనే దానిని పృథివియం దంతటను ప్రచారము చేయబోవును. ఈశ్వరుని తామొంటరిగా భోగించుచు, వారు తృప్తి నొంది, యూరకుండజాలరు. తా మనుభవించు ధర్మా నందము నింకొక వేయి హృదయములలో వర్షింపజేయుటకై

వారు విశ్వప్రియత్నములు చేయుదురు. ధర్మప్రచారమునందు వారేవిధమైన విఘ్నములను బాధలను లక్ష్య పెట్టరు. లోకుల వలని భయముచే వారణుమాత్రమును భీతచిత్తులు కారు. ఈ దుర్బలశరీర మొకవేళ ధర్మసమరమునందు పరిత్యజింప వలసి వచ్చినను, వారు కించిన్మాత్రమును సందేహింపరు. సాధు పురుషుల కింత త్యాగశీల మెక్కడిది? అది మంగళస్వరూపుడగు నా పరమేశ్వరునుండియే వచ్చినది. మహాత్ముల జీవితమునందు వ్యక్తమగుచున్న త్యాగశీలమునుండి, పరమేశ్వరుని యనంత మంగళ భావము, మనము కొంతవఱ కూహించుకొనగలము. ఆనంద స్వరూపుడైన పరమేశ్వరుడు తానే యానందము ననుభవింపుచున్నాడో అది విశ్వ మంతయు వ్యాపింపజేయు నభిప్రాయముతోనే ఆయన ఈ యనంత విశ్వమును సృష్టించెను. ప్రేమను వితరణను చేయుటకే, ఈ సమస్తజీవుల నాయన సృష్టించెను. ఆయన ధర్మానందముతో, మంగళ భావముల యొక్క ఆనందముతో, కోట్లకొలది ఆత్మలయొక్క హృదయ ములను నింపుచున్నాడు. ఉత్కృష్టజీవు లేవిధముగా ధర్మము నం దున్నతి నొందుదురు. ప్రేమచే పవిత్రులై, తన సింహా సనసన్నిధానమున చేరగల్గుదురు? ఇదే ఆయన సృష్టియొక్క పరమలక్ష్యము.

ఇందుకొఱకే ఆయన మన ఆత్మలను సృష్టించెను. శరీర ములనే వానికి వాసగృహములుగా నిచ్చెను. మఱియు, వీని కొఱకే ఆయన ఈ యనంత విశ్వమును నిర్మాణము చేసెను. గగన తలమునందు దూరాతిదూరమున జ్యోతులవలె విరా

జిల్లు అసంఖ్యాకము లగు సమస్త లోకములు, ఆయన రాజ్యము నందలి ఉన్నతజీవులకు ధర్మోపదేశము చేయు విద్యాలయ ములు. ఆయన యమృతపుత్రు లందరికిని నివాసగృహములు. ఏ సమస్త జీవులకు ఆయన యిట్టి ఉన్నతాధికారమును ఇచ్చి యుండలేదు? వానిని సంపూర్ణముగా సకల సుఖములనుండి దూరముగ జేసెనా ? లేదు. ఆయన ఎన్నటికిని అట్లు చేయ లేదు. అట్టి జీవరాసులకు సహితము, ఆయన ముక్తహస్త ముతో సుఖమును ఆనందమును వితరణము చేయుచున్నాడు. సకల స్థానములయందును ఆనందము నిరంతరధారగా వర్షించు చున్నది. ఒక్క జలబిందువును పరీక్షించి చూడుడు. అది అసంఖ్యాకములగు సుఖముల ననుభవింపుచున్న అసంఖ్యాకము లగు జీవులతో పరిపూర్ణమై యున్నది. ఏదైన నొక తోటలో ప్రవేశించి చూడుడు. అందలి మృగము లన్నియు చెట్లనీడల యందు విశ్రాంతి నొందుచు, సంతుష్టహృదయములతో నెమరు వేయుచు, ఆనందము ననుభవింపుచున్నవి. సమస్త పక్షిజాతులును ఉచ్చైస్స్వరముతో మధుర రుతములు చేయుచు తమ మనస్సులలోని ఆనందమును వ్యక్తము చేయుచున్నవి. వర్ష ఋతువులో తొలిసారి వర్షము కురియు నప్పుడు, జడము లగు వృక్షజాతులు సహితము, జీవజంతువులవలెనే, ఆనంద భరితము లయినట్లు కానవచ్చుచున్నవి. ఈలోకమునం దానంద మనుభవింపని జీవి యేది? మురికి గుంటలో కులకులలాడు పురు గులు సహితము ఆనందమునే అనుభవించుచున్నవి. కాని, ఇదం తయు విషయ సుఖమే. కనుకనే కేవలము ఈ క్షుద్రకీటకముల

కొఱకు, సమస్తమూఢజంతువులకొఱకు, ఈ సమస్తఉద్భిజ్జముల కొఱకు మాత్రమే, ఈవిచిత్రసృష్టి రచింపబడియుండలేదు. జ్ఞానమున కాకరము,శోభకు భాండారము అగు ఈ నిరుపమానప్రపంచము,ఈ సమస్త జ్ఞానవిహీన జీవులయొక్క ఐశ్వర్యము కాదు. ఇందేవియు ఆయన ప్రేమను, ఆయన మంగళాభిప్రాయములను గ్రహింపజాలవు. ఆయన ఈ జగత్తు నెంత మహైశ్వర్యకరమైన శోభతో నలంకరించెనో, ఈ వైభవమును జూచి, అవి ఆయన మహిమను గ్రహింపజాలవు. మానవులను సృష్టించుటచేతనే, ఆయన ఈసృష్టికి ఇంతశోభను, ఇంత మహత్త్వమును సాధింపగలిగెను. జీవాత్మయే సృష్టికి శిరోభూషణము. జీవాత్మయే ఆయన నిర్మాణచాతురికి పరమావధి. ఆత్మల మూలముననే ఆయన తన మంగళభావములను ప్రచారము చేయుచున్నాడు. ఈ జడజగత్తు కేవలము ప్రాణవిహీనయంత్రము వంటిది, పశుపక్ష్యాదులు తమ తమ ప్రవృత్తులకు తమ తమ ఇంద్రియప్రబోధములకు దాసులు. మనుష్యు డొక్కడే, ఆ యమృతపురుషుని మంగళభావమును గ్రహింప గలుగుచున్నాడు, అనుభవింప గలుగుచున్నాడు, ఆనందింప గలుగుచున్నాడు, మఱియు ఆయన అనుగ్రహముచే అమృతపుత్రు డనిపించుకొనుట కర్హుడగుచున్నాడు.

ఆయన పశుపక్ష్యాదుల కెటువంటి సుఖము లిచ్చి, వానిని ఆనందమునం దోలలాడించుచున్నాడో, అటువంటి సుఖముతోనే, మనుష్యుని తృప్తి నొందించుట లేదు. పశ్వాదులకు విషయసుఖమే పరమావధి. మనుష్యులకు విషయ

సుఖమే సర్వస్వము కాదు, విషయ సుఖము నీచావస్థ, తృణ ప్రాయము. ఎవరు ఆత్మోన్నతి నొందజాలరో, అందుచే బ్రహ్మానంద రసాస్వాదనము చేయజాలరో, అట్టి నిర్భాగ్యులైనను ఈశ్వరరాజ్యమునందు సంపూర్ణముగా సుఖవిహీనులై యుండరు. పశుపక్ష్యాదులకువలెనే, క్రిమికీటకములకు వలెనే, వారికొఱకును అనేకవిధములగు సుఖసామగ్రి సిద్ధము చేయబడి యున్నది. సూర్యోదయము మొదలు, సూర్యాస్తమయమువఱకు, ఏటేట ప్రతిఋతువునందును వారు నానావిధములైన విషయ భోగముల నొంది, ఆనందముతో కాలము గడపుచున్నారు. కాని, ఈశ్వరు డెంత కరుణాళుడు! ఆ సమస్త సుఖములతో వారిని సంతృప్తి నొంది యుండనిచ్చుటలేదు. వారి హృదయమునందు ప్రవేశించి, ఉచ్చసుఖములకొఱకు తపింప జేయుచున్నాడు. మనుష్యుడు కేవలము ఆహార నిద్రాదులతో సుఖవంతుడై యుండజాలడు. కేవలము విషయ సుఖములకొఱకే తపించుచు వానితోనే తృప్తి నొంది యుండజాలడు. మానవాత్మ తాత్కాలికముగా, అజ్ఞాననిద్రయందు పడి యుండును గాక! మహామోహజాలమునందు చిక్కుకొని ముగ్ధమై యుండును గాక! అట్టి దీనావస్థలో సహితము దుఃఖమిశ్రితము లగు నీ ప్రాపంచికసుఖములతో మాత్రము దెన్నడును సంతుష్టి నొంది యుండజాలదు. మనుష్యుడు వేలకొలది విషయసుఖములలో నోలలాడుచుండును గాక! సాటిలేని ఐశ్వర్యమును ప్రభుత్వమును అనుభవించుచుండును గాక! తాను కోరినదెల్లను తనకు లభించుచుండునుగాక!

తన సేవకులు, బంధుమిత్రాదులు, తన యభీష్టమును దెలిపియుఁ దెలుపక మునుపే దానిని నెఱవేర్చుచుందురు గాక! అయినను, అత డెందుకు సంతుష్టినొంది యుండజాలడు? అత డొంటరిగా కూరుచుండి, నాకు సమస్తైశ్వర్యములును కలవే, ఏ లోపమును లేదు. ఇక నా కేమి కొదువ? నేను సుఖి నౌదునా, కానా? అని ఒకసారి ప్రశ్నించుకొనిన యెడల, వెంటనే అతని యంతరాత్మ నీ శూన్యహృదయము నందు సుఖ మెక్కడిది? అని వెంటనే ప్రశ్నించును. అప్పు డతడు నిరాశ చెందును- అందుకు సందేహములేదు. ఈసమస్త విషయ సౌఖ్యములతో మానవుడు సంతృప్తి నొంది యుండ వలయు ననిఈశ్వరాభిప్రాయము కాదు. ఎవరిహస్తమునందు సమస్తానందములు కలవో, ఎవడు సమస్త కర్మములకు ఫల ప్రదాతయో, ఆయన యభిప్రాయమునకు వ్యతిరేకముగా సంచరించినయెడల, మనకు మంగళ మగునా? మనకు తృప్తి యుండునా? సంతోష ముండునా? మన మీ సమస్త ఐహిక సుఖములతోనే తృప్తినొంది కాలము గడుపుదము. ఇదా మన కోరిక? ఈ సమస్తవిషయసుఖముల కంటెను, అధికతరమైన సుఖప్రదానమును మనకు పరమేశ్వరు డొసంగి యుండలేదా! నిస్సందేహముగా, ఆయన మన కింతకంటె ఆనందప్రదములగు సౌఖ్యములనే దయచేసి యున్నాడు. మనము సత్యమునందు, ప్రేమయందు, సద్భావము నందు, అభివృద్ధి నొంది, ఆయన మంగళాభిప్రాయమును గ్రహింపగలిగి, ఆయన సాన్నిధ్య సుఖమును పొందుదుము గాక! ఇదే అయన కోరిక. ఆయన

మనుష్యుని జన్మ మెత్తించినందుకు ఇదే తాత్పర్యము. ఆయన మనలను దేవతలతోడి సహవాసమున కర్హులనుగా జేయ సమకట్టి యున్నాడు. మఱియు, తన సామ్రాజ్యమునకు తీసికొనిపోవుటకు మన హృదయముల యందు ధర్మబుద్ధిని ప్రతిష్ఠించి తన ధర్మరాజ్యమున కధికారులనుగా జేసి యున్నాడు. ఆయన మనలను విషయసుఖనిమగ్నులనుగా జేసి, మగ్ధులనుగా జేయుటకు సృష్టించి యుండలేదు. మనము ధర్మము కొఱకు, ఈశ్వరుని కొఱకు, ఎన్నెన్ని విషయ సుఖములను తృణ ప్రాయముగా పరిత్యజింపగలము! ఎప్పుడు పరిత్యజింపజాలము! ఆయన బ్రహ్మానందమును చవి జూడ నప్పుడు, పశువులవలె ఆహారవిహారములయందే ప్రమత్తులమై యున్నప్పుడు. అట్టి దీనదశ మన కెన్నడును సంప్రాప్తింపకుండును గాక!

ఓ పరమాత్మా! మమ్ముల నందఱను నీవైపునకు తీసికొనిపొమ్ము. మా సమస్త శరీరము, సమస్తహృదయము, సమస్త ఆత్మయు, నీ యమృత మార్గమునందే నియోగింపుము. నిన్ను పరిత్యజించిన యెడల, మాకు శాంతి లేదు, సుఖము లేదు. కేవలము విషాదాంధకారమే హృదయమును గప్పివేయును. నీవు మా హృదయమునందు లేనియెడల, మే మనుభవించు సుఖ మంతయు దుఃఖమే. నీవు లేని సంపత్తి విపత్తియే. నీవు లేని జయము పరాజయమే. మా దేహముయొక్క, మనస్సుయొక్క, ఆత్మయొక్క, సమస్త శక్తులు నీ నుండియే పొందగలిగితిమి. వాని నన్నిటిని నీకు హితమైన కార్యములు చేయుటయందే నియోగింపుము. మా హృదయభావముల నన్నిటిని

నీవైపున కున్నతి నొందింపుము. దీనబాంధవా! నీకు సాష్టాంగ ప్రణామము లర్పించుచున్నాము. ఆశీర్వదించి రక్షింపుము.
ఓమ్. ఏకమేవాద్వితీయమ్.

---

ఓమ్ తత్సత్.

# మ హ ర్షి మ హో ప దే శ ము లు



## ౧౫ వ ఉ ప దే శ ము

స సేతు ర్విధృతి రేషాం లోకానాం అసంభేదాయ.

సమస్త భూతములకును అధిపతియు, పోషణకర్తయు, అగు పరమేశ్వరుడు, నిరంతరవిభిన్నస్వభావము గల భూమ్యాది సమస్తలోకములును, విచ్ఛిన్నము గాకుండునట్లు తన యనంత హస్తములయందు పట్టి యుంచుచున్నాడు. ఆయన జగదాధారమూర్తి. సకల బ్రహ్మాండములును ఆయన వశమందున్నవి. ఏకమాత్రుడగు ఆ పరమదైవముయొక్క శాసనముచేతనే, ఈ సమస్తవిశ్వమును శాసింపబడు చున్నది. ఆయన నాశ్రయించియే, సమస్త చరాచరములును, సమస్త జీవజంతువులును తమతమ కార్యములను జేయుచున్నవి. ఆ జగజ్జనని యొక్క ఒడియందే సమస్త లోకములు, సమస్త జీవరాసులు ప్రతిష్ఠింపబడి యున్నవి. ఆయన మన కదృశ్యమును,

కూరాతిదూరమును అగు ఏ పూర్వకాలముననో, ఈ విశ్వ ప్రపంచమును సృజించి, ఇప్పుడు ఈ క్షణమునందు దీనిని విడిచిపెట్టి యున్నాడా? ఒక ఇంటిని కట్టిన వడ్రంగి, ఒక ఓడను నిర్మాణము చేసిన పనివాడు, ఏ విధముగా, ఆ గృహ మును, ఆ యోడను, కట్టి వెళ్ళిపోవునో, అటు తరువాత ఆ గృహాదులకును, ఆ పనివానికిని ఎట్టి సంబంధము నుండదో, అదే విధముగా ఈ విశ్వనిర్మాతయు జగన్నిర్మాణానంతరము తన యిష్టము వచ్చినచోటికి వెళ్లిపోయినాడా? లేక ఇప్పుడును ఈ సృష్టితో కూడ వెన్నంటి ఉన్నాడా? ఆయన దీనిని వదలి పోలేదు. సమస్తాకాశమును, సమస్త కాలమును, ఆయన శక్తితో నిండి యున్నవి. ఆయన సర్వసాక్షియై, సర్వ నియంతయై, సమస్తమును నడుపుచు, ఇప్పుడును వర్తమానుడై యున్నాడు. మన మందరము ఆయనయందే వసించు చున్నాము. ఆయనయందే జీవించుచున్నాము. సదా ఆయనచే స్పృశింపబడుచున్నాము. ఎవరి అమోఘ మగు ఇచ్ఛవలన ఈ జగత్తు సృష్టింప బడినదో, ఆయన సంకల్పము చేతనే ఈ జగత్తు రక్షింపబడు చున్నది. పూర్వకాలమునందు ఆయన సంకల్ప మెట్లు జరుగుచుండెనో, వర్తమానకాలము నందును, అట్లే ఆయన సంకల్పమే సిద్ధించుచున్నది. సృష్ట్యారంభము నుండియు, ఆయన ఇచ్ఛాస్రోతము నిరాఘాటముగా ప్రవహించుచుండుటవలననే ఈ యనంత విశ్వమునందలి సమస్త కార్యములు నిరాఘాటముగా సాగుచున్నవి. నే నెప్పుడు మాట్లాడుట కారంభించితినో, అప్పుడు నా యిచ్ఛ పని చేయుట

కారంభించెను. నే నింకను మాట్లాడుచున్నాను గాన, నా యిచ్ఛ ఇంకను విరామము నొందలేదు. ఎప్పుడు విరామము నొందునో, అప్పుడే నా మాట లాగిపోవును. అట్లే ఈశ్వరేచ్ఛయే విరామము నొందినయెడల, సమస్త ప్రపంచమునకును ప్రళయావస్థ ప్రాప్తించి యుండును. మన మీ యుపాసనామందిరమునందు ఆయనను సందర్శించియే,ఆయన అందఱియొక్క ప్రాణస్వరూపుడుగా నున్నాడని గ్రహించియే, ఆయున సర్వసన్నిహితుడగు చైతన్యమని తెలిసికొనియే, మన మాయన నుపాసించుచున్నాము. నే నీక్షణమునందు మాటలు చెప్పుచున్నాను. ఈ మాటలతోపాటు నా యిచ్ఛ ప్రకటిత మగుచుండలేదా? మీరు నే నొక మృతదేహము ననుకొనుచున్నారా? లేక జీవవంతుడగు మనుష్యుడ ననుకొనుచున్నారా? ఇట్టి సందర్భములో, ఎవడు నా వాక్కునకు శక్తి నిచ్చి నన్ను మాట్లాడించుచున్నాడో, ఎవని యిచ్ఛ ప్రకాశించుచుండ బట్టియే, నా వాక్కు, నా యభిప్రాయమును ప్రకటింప గలుగుచున్నదో, ఎవడు నా శరీరమునందు ప్రాణస్వరూపుడై ప్రకాశించుచున్నాడో, ఎవడు సమస్త జగత్తును ప్రాణముతో, జీవనప్రక్రియతో సంపూర్ణము చేయుచున్నాడో, అతడు నాకంటెను అధికతర జీవవంతుడు కాడా? అతడు సమస్త ప్రాణులయొక్క ప్రాణస్వరూపుడు కాడా? నిజముగా అతడు ప్రాణస్వరూపుడు, జీవవంతుడగు పరదేవత. ఆ జగత్ప్రాణము చుట్టును, సమస్త జగత్తు నిరంతర ప్రదక్షిణము చేయుచున్నది. ఆయననుండియే

సమస్తజ్యోతులు జ్యోతిని, సమస్త జీవులు జీవమును, పొందు చున్నవి. ఆయనయే ఈ సమాజముయొక్క అధిష్ఠాన దేవత. మన మాయన నెప్పు డుపాసించుచున్నామో, అప్పుడే ఆయన అది గ్రహించుచున్నాడు, ఆయనను మనము వర్తమాన పురుషుడుగానే చూచుచున్నాము. ఆయనను సందర్శించుటకు ఆయన నుపాసించుటకు, మనము అతీతమైన భూతకాలము జ్ఞాపకము తెచ్చుకొనవలసిన యవసరము లేదు. ఎప్పుడో పురాణయుగమున నవతరించె నని, మన కాయన దర్శనము ప్రాప్తించ లేదని బెంగపెట్టుకొన నవసరము లేదు. ఆయన యవతారములు దేశకాలబద్ధములు కావు. ఆయన యవతారము లనంతములు. ప్రతిమానవుని హృదయమునందును ఆయన క్షణక్షణమును అవతరించుచునే యున్నాడు. ఆయన యెప్పుడో భవిష్యత్కాలమున నవత రించునని నిరీక్షించుచు కనుపెట్టుకొని యుండ నావశ్యకము లేదు. ఇప్పుడు మన యెదుట ఏ వెలుగు వెలుగు నిచ్చు చున్నదో, మన సమక్షమున ఏ వాయువు వీచి, అందరికిని ప్రాణాధారకమై, మాట్లాడువారికి మాట్లాడుటకును, విను వారికి వినుటకును, శక్తి నిచ్చుచున్నదో, ఈ సమస్త విధాన మును ఆయన యిచ్ఛపయిననే, ఆధారపడి యున్నది. ఆయన యిచ్ఛ విరమించినయెడల, ఈ వెలుగు ఆరిపోవును. ఈ వాయువు స్పందహీన మగును, ఈ వాక్కు స్తంభించి పోవును.

ఆ జగత్కారణుని, జగత్పాలకుని, ఇచ్ఛామాత్రము చేతనే, సమస్త జగత్సంసారమును సమస్త లోకవ్యవహారమును

జరిగిపోవుచున్నది. అతడు రాజులకు రాజు, మహారాజాధిరాజు, త్రిభువన పాలకుడు. అతడు లోకము లేవియు విచ్ఛిన్నము గాకుండునట్లు, తాను సేతుస్వరూపుడై, వాని నన్నిటిని పట్టి యుంచుచున్నాడు. అత డఖిలబ్రహ్మాండములను ధరించుచున్నాడు. అతడు వానిచుట్టును గట్టై నిలుచుచున్నాడు. వీనిలో నేదియు హాని నొందకుండునట్లు సమస్తప్రపంచమును తన మంగళహస్తములతో పట్టి యుంచుచున్నాడు. అతడు సమస్తజగత్తునకును ప్రాణస్వరూపుడై విరాజిల్లుచున్నాడు. అయినను అతడు వీని కన్నిటికిని అతీతుడు. సమస్త బ్రహ్మాండములును ఆయన గర్భమునందే ఇమిడియున్నవి.

ఏ పరమ పురుషుని చేసైగ మాత్రము చేతనే, కోట్ల కొలది బ్రహ్మాండములు గతులు తప్పక, ఒకదాని కొకటి అడ్డమురాక, అనంతాకాశమునందు విహారము సల్పుచున్నవో, ఆయన వ్రేలిగుర్తు లెక్కడ కానరావు? శరత్కాలరాత్రుల యందు, షోడశకళాపరిపూర్ణుడైన చంద్రు డుదయించి, మేఘము చాటుననుండి మేఘము చాటున కీదుచు, మధ్యమధ్య మేఘవిరహితగగనమునందు ప్రవేశించి, నిర్మలశుభ్రకిరణములతో భూమండలమునకు వెండిపూత పూయుచు, జగన్మోహనాకారుడై, నేత్రపర్వము గావించుచుండునో, అప్పు డా చంద్రజ్యోత్స్నయందు, ఎవనియంగుళి నిర్దేశమును చూడగలుగుచున్నాము? ఎవని వ్రేలి సైగ మాత్రము చేతనే కోటి కోటి లోకములు గగనవిహారము సల్పుచున్నవో, ఆ సర్వనియంతయొక్క వ్రేలిచిహ్నమే చూడగలుగుచున్నాము.

ఎప్పుడు ఒక సాధుపురుషుడు సుఖజీవనము చేయుచు, ధర్మ మార్గమున నడువవలసి వచ్చినప్పుడు, కష్టములలో చిక్కుకొని తరువాత కొంతకాలమునకు ఆ కష్టములనుండి గట్టెక్కి తిరిగి సౌఖ్యము ననుభవింపుచుండునో, ఇట్లే ధర్మముకొఱకు నిరంతర సంగ్రామము సల్పుచు - సుఖమునుండి కష్టమునకును కష్టము నుండి సుఖమునకును, ప్రయాణము చేసిచేసి ధర్మమునందు బలిష్ఠుడై, సత్యమునందు దృఢవ్రతుడై, ధర్మరంగమున వీర పురుషుడై నిలువగలుగునో, అప్పుడు, అతని జీవనగ్రంథము నందు ఎవని వ్రేలి గురుతును చూడగలము? అఖిలబ్రహ్మాం డమునందు జరిగెడు ప్రతిశుభకార్యమునందును ఎవని వ్రేలి ముద్ర వేయబడియున్నదో, ఆ బ్రహ్మాండనాయకుని వ్రేలి గుర్తునే చూడగలుగు చున్నారము.

మానవాత్మ ఎప్పుడు మోహాంధకారముచే ఆవరింప బడి, పాపప్రవృత్తులచే పరాజయము నొంది, పాపకార్యముల నాచరించి, పాపాచరణమువలని శోకముచే, పశ్చాత్తప్తమై, మనస్సాక్షి యొక్క పోరాటముచే, పాపములను దగ్ధము నొందించి, ఆత్మ ప్రసాదలబ్ధిచే, ఆ పాపసంతాపము నుండి పరిత్రాణము నొంది, నూతన బలముతో, నూతన ప్రకాశముతో, సంచారము చేయునప్పుడు, ఆ మానవాత్మయం దెవరి హస్తచిహ్నమును చూడగలుగుదుము? ఏది మనకు కానరాకయే, లోకమునందలి సమస్తఘటనలను నియమించు చున్నదో, ఆ మంగళ హస్తముయొక్క చిహ్నమును చూడ గలము. ఎవని సంకల్పముచే దాహముచే తపించుచున్న ధరా

మండలము, వర్ష ధారల నొంది చల్లబడుచున్నదో, ఆయన యిచ్ఛచేతనే, తాపములచే తపించుచున్న హృదయములు, అను గ్రహజలము నొంది శాంతి లాభము నొందుచున్నవి.

అనంత విశ్వముపై వ్యాపించియున్న దివ్యదృష్టి మన మీద పడుటలేదా? అనంత విశ్వమును పరిశీలించుచున్న దివ్య నేత్రము మనలను పరిశీలించుచుండలేదా? ఆయన మన ఆత్మ లను సృజించి, ఈ భవసముద్రమునందు దించి, అసహాయు లనుగా జేసి, విడిచిపెట్టిపోయెనా? మనపై నెంతెంత మాలిన్య పంకము చేరనిమ్ము, మనల నెన్నెన్ని పాపమకరములు పట్టి యీడ్వనిమ్ము; ఆయనదృష్టి మనపైన పడుటలేదా, లేక, ఉదా సీనభావముతో, ఇదంతయు చూచి సహించు చున్నాడా? లేక, నిర్దాక్షిణ్య భావముతో చూచీ చూడనట్లు నటించు చున్నాడా? లేదు లేదు. ఆ కరుణాసముద్రుని యెడల దోష మెంచినయెడల, అపరాధము, అపరాధము. ఆయన సర్వద్రష్ట, దయాసాగరుడు. మన క్షేమముకొఱకు క్షణక్షణమును, అనేక మంగళవిధానములను విధించుచున్నాడు. ఇప్పు డీ యుపాసనా గృహమునకు మనలను ప్రేరేపించి తీసికొని వచ్చిన దెవరు? మన మెంత సోమరులము, ఎంత విషయాసక్తులము, ప్రాపంచిక సుఖములయం దెట్లు మునిగి యున్నాము, మన హృదయమునం దెప్పుడును ఎటువంటి కుటిలభావములు సంచారము చేయు చున్నవి? ఇట్టి ప్రతికూలస్థితిలో నున్న మనలను, ఈ యుపాస నామందిరమునకు, ఈ పవిత్ర బ్రాహ్మసమాజమునకు, ఎవ రాహ్వానము చేసి తీసికొనివచ్చిరి? ఎవడు సూర్యుని ప్రాతఃకాల

మునసే ప్రాచీముఖమున నుదయింపజేసి, మంచును విడగొట్టి, అరుణోదయకిరణములచే భూమ్యాకాశములకు బంగారుపూత పూయించుచున్నాడో, అతడే మనల నీ సాధుమండలితో ప్రవేశపెట్టి, మన మనోమాలిన్యమును కడిగివేయుచున్నాడు. మన మిక్కడకు వచ్చి, ఆయన యనుగ్రహజలమునందు జలక మాడి, పవిత్రహృదయుల మైతిమి. మన మందరమును కలిసి, ఏకహృదయులమై, ప్రేమ పుష్పములతో ఆయన నర్చింతము. భక్తి చందనముతో ఆయన పాదము లలంకరింతము. వైరాగ్యచామరములతో ఆయనకు విసరుదము. మనము మన భూతకాలదైన్యస్థితి స్మరణకు తెచ్చుకొన వలసిన యావశ్యకత లేదు. మన కాయన ఎప్పుడు దర్శన మిచ్చునో యని నిరీక్షించుకొని యుండవలసిన యావశ్యకతయు లేదు. ఆయన నిక్కడ ప్రత్యక్షముగా దర్శించి, ఇప్పుడే, మన సమగ్ర హృదయము నర్పింతము. అంతటను ఆయన ప్రభావమే. అంతటను ఆయన యధికారమే. ఆయన సర్వసాక్షియై అంతర్బాహ్యములయందు విరాజిల్లుచున్నాడు. ఒక మహోన్నత పర్వత శిఖరము నధిరోహించి, అటనుండి మేఘమండలములోనికి చొచ్చుకొనిపోయిన ఇంకొక పర్వతశృంగమును కాంచితిమేని, అక్కడ ఆయన గంభీరభావమును దర్శింప గలము. సముద్రపు టొడ్డున నిలువబడి, నుఱుగులు గ్రక్కుచు గంభీర నినాదము చేయుచున్న ఉత్తుంగతరంగమాలల కేసి చూచితిమేని, అక్కడను ఆయన అధికారమును దర్శింపగలము. ఒక నదీతీరమున వృక్షచ్ఛాయలయందు నిలువబడి, నదీ

పరివాహము యొక్క విచిత్ర లీలల వీక్షించితిమేని అక్కడను ఆయన యానందలీలలను దర్శింపగలము. ఆయన ఒక చోట నున్నాడు, ఒక కాలమునం దున్నాడు అనునది లేదు. ఆయన సమస్తదేశములందును సమస్తకాలమునందును సమానముగా నున్నాడు. దేశకాలాతీతు డగు ఆయన సమీపమున, అంధకార బంధురమైన అమవసనిసియు, ప్రపంచగ్రీష్మభానునితో వెలుంగు మట్టమధ్యాహ్నమును, ఉభయమును సమానములే. ఆయన ఈ యనంతవిశ్వమునం దెట్లు విరాజిల్లుచున్నాడో అణువు అణువునందును అట్లే విరాజిల్లుచున్నాడు. ఆయన మానవాత్మలయొక్క ఆంతరతమ ప్రదేశములయందు స్థానము నేర్పరచుకొని యున్నాడు. లోకములోని సమస్త సుందరపదార్థములును ఆయన సౌందర్యము నుండియే, సౌందర్యమును గ్రహించుచున్నవి. ప్రభాకరుడు ప్రభారాశి యగు ఆయన నుండియే, ప్రభ నొంది, జగత్తు నంతను ప్రభావంతము చేయుచున్నాడు. సుధాకరుడు, సుధామయుడగు ఆయననుండియే సుధ నొంది, జగమంతటను సుధావర్షమును వర్షించుచున్నాడు. తటిల్లతలు ఆయననుండియే విద్యుచ్ఛక్తి నొంది, కారు మబ్బుల లోని గాఢాంధకారమును వెలిగించి కన్నులు మిఱుమిట్లు గొలుపుచున్నవి. ఆయన ఈజగత్తునకు వెలుగు, ప్రాణము. మన మాయనను దర్శింప లేకపోయినయెడల, జగమంతయు కాంతి విహీనమై మాలిన్యవంతమై కానవచ్చును; అగణ్యనక్షత్ర ఖచితమైన అనంతాకాశము సైతము, శోభాశూన్యమై కానవచ్చును. ఆయన వినా ఈ జగమంతయు శూన్యగృహము.

ఆయన లేనిహృదయము శూన్యహృదయము. ఆయన నారా ధింపని గృహము శ్మశానసమము. అట్టి శుష్కహృదయము, శుష్కగృహమువలని లాభ మేమి? ఈ విశ్వమునందు ఆ దేవ దేవుని దర్శింపలేనియెడల, మన హృదయ సింహాసనము నందు ఆ పురాణపురుషుని ప్రతిష్ఠింప లేనియెడల అప్పుడు కేవలము విషాదాంధకారమే. బాహ్యమునం దంధకారము, అంతరమునం దంధకారము. ఆయనయే లేనియెడల, యావ త్ప్రపంచము లక్ష్యహీనము, అర్థహీనము, తాత్పర్య శూన్యము, శృంఖలారహితము. మనుష్య జన్మ మెత్తియు, ఆయనను దర్శింపలేనియెడల, ఈ జన్మ నిష్ఫలము. కాని ఈశ్వ రుని కరుణామహిమ మెట్టిది! ఆయన తన్ను తానే మన కర్పించుకొని, మన ఆత్మలకు సంతృప్తి నిచ్చుచున్నాడు. మన ప్రేమ, కృతజ్ఞత, శ్రద్ధ, భక్తి, పవిత్రత, ఈ మొద లయిన మంగళ భావము లన్నియు, కేవలము ఆయన నుపా సించుటచేతనే చరితార్థము లగుచున్నవి ఏ స్థానమునందు ఆయన యెడల కృతజ్ఞత గలిగిన బిడ్డ లందరు కలిసి, భక్తి పూరిత హృదయములతో, ఆయన నారాధింతురో, అదే దేవ లోకము. మన నైహికజీవితమును విరమించి, ఈ భూమం డలమునుండి తరలి ఆ యమృతనికేతనుని దగ్గరకు వెళ్ళినప్పుడు, అక్కడ మన మేమి సందర్శింతుము? త్రిభువనవంద్యుడు, లోకా రాధ్యుడు, సకలజనసంభజనీయుడు, పవిత్రమూర్తియగు పరమే శ్వరుడు సింహాసనాసీనుడై యుండగా, పరమేష్ఠ్యాది దేవతలు, ప్రహ్లాదాది భక్తులు, నారదాది మునీంద్రులు, వసిష్ఠాది

మహర్షులు, బుద్ధుడు, జీససు, మహమ్మదు, కబీరు, నానకు చైతన్యుడు మొదలుగాగల జ్ఞానయోగులు, భక్తియోగులు, కర్మయోగులు, అందరును గలసి, ఆయన యపరోక్షానుభూతి నొంది, బ్రహ్మానందరసపానప్రమత్తులై, తన్మయత్వము నొందుచు, ఆయన యనంత కల్యాణ గుణములను కోటికంఠములతో సంకీర్తించుచు, ఆనంద గానము చేయుచు, అపరూప నాట్యము సల్పుచు, ఆ యమృతపురుషు నుపాసించుచున్నారు. అది నిద్రాజాగరణములు, క్షుత్పిపాసలు, సుఖదుఃఖములు, జీవసమరణములు మొదలగు ద్వంద్వావస్థల కతీత స్థానము. అవాఙ్మానస గోచరము. కేవలము అనుభవైక వేద్యము. మన మిహలోకమునం దుండగానే ఆయన నారాధించి, ఆయన ప్రత్యక్షదర్శనమున కర్హుల మైతిమేని, అప్పుడు, ఆ దేవత లందరితో కలిసి, ఆ దేవదేవు నుపాసింపగలము. మానవజన్మ మెత్తినందులకు, మన కట్టి అమూల్యమైన అధికారము కలదు! మన ఆత్మ, సోపానము తరువాత సోపానము నధిరోహించి, ధర్మోన్నతపథమున ప్రయాణము చేసి చేసి, తుద కా యమృతపురుషుని యొడిలో చేరి విశ్రాంతి నొందగలుగును. ఇదే, మానవ జీవితముయొక్క పురుషార్థము. ఇదే, నరజన్మ మెత్తినందుకు ఫలము. మన మట్టి పరమపురుషార్థము నొందగలుగునట్లు పరమేశ్వరు డనుగ్రహించుచుగావుత!

ఓ పరమాత్ముడా! మేము నిన్నే శరణు జొచ్చుచున్నారము. మాకు నీ కంటె వేఱుగతి లేదు. నీ ప్రేమ పవిత్రతా

సౌందర్యములు మా హృదయము నాకర్షించుచున్నవి. నీ సౌందర్యమును మేము అనంతకాలమువరకు ధారణ చేసి యుంచగలుగునట్లు కటాక్షించుము. అనంత విశ్వమునందు విభాకర సుధాకర విద్యుల్లతా తారకలు మొదలగు తేజ స్వంతములగు ఏ యే జ్యోతులు కలవో, వాని కన్నిటికిని కాంతి నొసంగువాడవు నీవే. నీ విమలజ్ఞానజ్యోతి చేతనే, ఈ జగత్సంసార మంతయు నుజ్వల మగుచున్నది. నీవు మా నేత్రజ్యోతివి, ఆత్మజ్యోతివి, జ్యోతుల కెల్లను జ్యోతివి. సౌందర్యముల కెల్లను సౌందర్యమవు. నీవు మా యాత్మలను పాపతాపములనుండి యుద్ధరింప దలచితివేని, వెంటనే, మమ్ము నీవైపునకు తీసికొని పొమ్ము. ఈ సంసారము నందలి యాతన లింక సహింప జాలము. నీవు నిరంతరము మా కన్నుల యెదుట ప్రకాశింపుము. మేము నిన్ను విడువవలసి వచ్చిన యెడల, రవి శశి తారలు శోభావిహీనము లగును. ఓ ప్రాణ వల్లభా! నీవు మమ్ము సదా నీ యనుచరులను, సహచరులను గావించుకొనుము. మేము ధనమానయశస్సుల నాశింపము. నీవు తప్ప మాకు వేఱు శరణ్యము లేదు. నీవే మా సర్వస్వము. మమ్ము నిరంతరము నీ సహచరులనుగా, అనుచరులనుగా నుండ నిమ్ము. అదే మా గొప్పకోరిక. దానినే సఫలము చేయుము.

ఓమ్. ఏకమేవాద్వితీయమ్.

---

ఓమ్ తత్సత్.

# మహర్షి మహోపదేశములు



## ౧౬ వ ఉపదేశము

ఆత్మాన మేవ ప్రియ ముపాసీత,

పరమాత్మయే ప్రియతమ మైనదని తెలిసికొని, దానినే యుపాసింపుడు. ఎవడు పరమాత్మనే ప్రియతమమైనదని యుపాసించునో, అట్టివాని ప్రియవస్తు వెన్నడును, మరణశీలము కాదు. సమస్త వస్తువులతో, అత్యంత ప్రియమిత్రులతో, సన్నిహిత బంధువులతో, ప్రియతమ మగు శరీరముతో సహితము, ఎప్పుడో ఒకప్పుడు, విచ్ఛేదము కలిగి తీరును. బ్రహ్మముతో నెన్నడును విచ్ఛేదము కలుగదు. సర్వ స్రష్ట, సర్వలోక రక్షకుడు, అగు పరమేశ్వరుని ప్రేమనేత్రముల సమక్షముననే ఈ సమస్త జగద్వ్యాపారము నడుచుచున్నది. ఈ సాగరసహిత మగు పృథివీమండలము, ఈ యనంతాకాశము నందలి అనంత కోటి బ్రహ్మాండములు, వీని యన్నిటిమీదను ఆయన ప్రేమ దృష్టి ప్రకాశించుచున్నది. ఆయన యావత్ప్రపంచమును ప్రేమించుచున్నాడు. కాని, అసంఖ్యాకము లగు ఈ జీవరాసులన్నియు, ఆయనను తెలిసికొని, ఆయనను తిరిగి ప్రేమింప జాలవు. జగత్తునం దెన్నిన్ని చేతనాచేతనవస్తువులు గలవో, అవన్నియు ఆయనయందు ప్రేమను ప్రత్యర్పణము చేయ

జాలవు. మనుష్యు డొక్కడే, ఆయన ప్రేమను గ్రహించి, తిరిగి ఆయనను ప్రేమింపగలడు. పరమేశ్వరుడు సమస్త జీవులను ప్రేమించుచునే యున్నాడు. వానిలో వేనిదగ్గరనుండియు, తన ప్రేమకు బదులు ప్రతిప్రేమ నపేక్షించుటలేదు. మనుష్యు నొక్కనినుండియే, ప్రతిప్రేమ నపేక్షించుచున్నాడు. అతడు మానవుని ప్రేమించుచున్నాడు. తిరిగి మానవునినుండి ప్రేమను ప్రతిగ్రహించుచున్నాడు. మనుష్యుడు కేవలము ఈ ప్రపంచమునందలి వస్తువులను మాత్రమే ప్రేమించి సంతృప్తుడై యుండజాలడు. విశ్వబంధువగు పరమేశ్వరుని ప్రేమించినప్పుడే మానవునకు సంతుష్టి కలుగును. ఆయన మనుష్యునినుండి ప్రేమ నపేక్షించుట చేతనే మనుష్యుని స్వతంత్రునిగా జేసెను. అందువలననే మానవుడు పరమేశ్వరుని ప్రేమింపదగిన సువ్యవస్థలో నుంచబడి యున్నాడు. మనుష్యునకు ఇట్టి స్వాతంత్ర్యమునే ఇచ్చి యుండనియెడల, మనుష్యునినుండి ఆయన ప్రతిప్రేమ నపేక్షింపజాలడు. ఏ జీవులు ప్రకృతి కధీనము లయి యున్నవో వానినుండి ఆయన ప్రేమ నపేక్షించుటలేదు. ఎవరు స్వతంత్రులో ఎవరు హృదయపూర్వకముగా ఆయనను ప్రేమింపగలరో, అట్టి జీవులనుండియే, ఆయన ప్రేమను ప్రతీక్షించుచున్నాడు. వారే మనుష్యులు. ప్రీతి బలాత్కారముచే కలుగునది కాదు. ప్రార్థనచేతను లభించునదికాదు. ప్రేమను ధనముచేతను కొనజాలము. శాసనముచేతను ఆకర్షింపజాలము. దురదృష్టవంతుడైన క్రీతదాసుని దండించి యజమానుడు దాసుని ప్రేమ నాకర్షింపగలడా? స్వాతంత్ర్యమే ప్రేమ కాశ్రయభూమి, పునాది. మను

ష్యుడు తనను ప్రేమింపవలయునని ఈశ్వరేచ్ఛ. అందుకొఱకే ఆయన మనుష్యుని స్వతంత్రునిగా జేసెను. ఆయన మిగిలిన సమస్త వస్తువులను, సమస్త జంతువులను, ప్రకృతియొక్క అలంఘ్యములైన శాసనములచే బంధించి, కేవలము మనుష్యునికి మాత్రమే ఇష్టమున్నయెడల అనుసరించుటకును, ఇష్టము లేనియెడల ఉల్లంఘించుటకును అనుకూలములైన ధర్మనియమముల నిచ్చియున్నాడు. ఆయన మనలను ప్రేమించుమని నిర్బంధించడు. ఏ యాత్మ, ధర్మమునం దున్నతి నొందునో ఏ యాత్మ స్వతంత్రమైనదో ఏయాత్మ సర్వబంధములనుండి విముక్తి నొందెనో, ఏ యాత్మ మంగళభావములచే పరిపూరితమై యున్నదో, అట్టి ఆత్మనుండియే ఆయన ప్రేమను ప్రతీక్షించును. ఏ యాత్మ పరాధీనమైనదో, తన మనఃప్రవృత్తులకు వశమై యున్నదో, ఏ యాత్మ విషయజాలమునందు తగుల్కొని, అలసి సొలసి అవశమై యున్నదో, దేనికి ధర్మము యొక్క మహాదర్శమును పాలించుటకు, తన ప్రవృత్తికి కొంచెమైనను వ్యతిరేకముగా పనిచేయుటకు రవంతయైనను బలము లేదో, అటువంటి యాత్మనుండి ఆయన ప్రతిప్రేమను పొందజాలడు. మనము ఆయనయొక్క ప్రేమ, పవిత్రత, మంగళభావము, ఇవన్నియు చూచి, మోహపరవశులమై, మనంతట మనము, ఏ ప్రేమ ఆయన కర్పింతుమో, అట్టి ప్రేమనే ఆయన స్వీకరించును; తద్భిన్నమైన దానిని, మఱి దేనిని ఆయన గ్రహింపడు. మఱియు ప్రేమయొక్క స్వభావ మిట్టిది. మన మెప్పుడు ధర్మమునం దున్నతి నొందుదుమో,

ధర్మము యొక్క సౌందర్యమును రామణీయకమును గ్రహింప గలుగుదుమో, అప్పుడు మనప్రేమ, మన వశము గాక, తనంతట తానే, మంగళ స్వరూపుడైన ఆ పరమేశ్వరుని మీదికి వెళ్ళి వ్రాలును; మనము పశువులవలె సంచరించి, మన హృదయమునందలి సమస్తమంగళభావములను చల్లార్చు కొన్నప్పుడు, మన ప్రేమ ఆయన వైపునకు ప్రవహింప జాలదు. మఱియు, ఏ యాత్మ సమస్త బంధములనుండి విముక్తి నొందినదో, ఏది ఇంద్రియములు విషయములు, చేయు దురా లోచనలనుండి, పన్ను ప్రలోభనములనుండి, అనాయాసముగా తప్పించుకొన గలదో, ఏది ధర్మమునందును మంగళభావముల యందును, ఉన్నతి నొందినదో, దేనికి ఈశ్వరుని ప్రేమించుట కన్న మఱియేదియు అభిరుచిగా నుండదో, అట్టిఆత్మయే, ఆయ నను ప్రేమించుటకొఱకు వేలకొలది విషయ సుఖములను తృణ ప్రాయముగా పరిత్యజింప గలదు; ధర్మమార్గమున తటస్థించు వేలకొలది విఘ్నములను, విపత్తులను అనాయాసముగా నతిక్ర మింపగలదు. సూర్యోదయమైన వెంటనే, నిశాంధకార మును, ప్రాతఃకాలపు మంచును మంత్రించినట్లు విడిపోవును. అదేవిధముగా మన హృదయాకాశమునందు ప్రేమోదయమైన వెంటనే, సమస్త భయములును, సమస్త విచారములును, తొలగిపోవును. అట్టి భాగ్యవంతుడగు సాధుపురుషునియొక్క హృదయక్షేత్రమునందు, ఆత్మప్రసాదము సుధావర్షమును వర్షించును. మనస్సాక్షియొక్క ఆదరపూర్వకసంబోధ వ:నెడు నిర్మలచంద్రుడు ఉదయించి, విమలజ్యోత్స్నను వెద

జల్లును. ఆ పండు వెన్నెలయందు, పరమేశ్వరుని ముఖసౌందర్య మును సుస్పష్టముగా చూడగలిగినప్పుడు, ఎంతయానందము! ఆత్మప్రసాదముయొక్క పవిత్రమైన వెలుగు, దానియందు ఈశ్వ రునియొక్క విమలముఖజ్యోతి. ఆత్మజ్యోతియందు పరమాత్మ జ్యోతి. ఈపరిమిత జ్యోతి ఆయనంత జ్యోతితో కలిసినప్పుడు, జీవాత్మ పరమాత్మతో సంయోగము నొందినప్పుడు, ఆ యప రోక్షానుభూతిసమయమున, ఎంత ఆశ్చర్యకరమైన ప్రభ! ఏమి యానందము! అది నిరుపమానము, వాచామగోచ రము. ఈ విధముగా, అద్దమువలె ఆత్మ ఎంత పరిశుభ్ర మగునో, దానియం దీశ్వర ప్రతిబింబమును సుస్పష్టముగా ప్రకాశించును. మన ఆత్మ ఆయనతో సమ్మేళన మయినప్పుడు జగమంతయు సుధామయము, అమృతప్రాయము. అప్పుడు విశ్వము నవ వస్త్రధారిణి యగును. ప్రకృతి నూతనాలంకారభూషిత యగును. అప్పుడు విశ్వమే బ్రహ్మమందిరము. పవిత్రమూర్తి యగు పరబ్రహ్మమును, ప్రకృతి కోటి కంఠములతో స్తవము చేయుచుండును. విశ్వ మంతయు ఆయన శక్తితో, ఆయన మహిమతో, ఆయన దివ్యసుందరమంగళభావములతో పరి పూర్ణమై యుండును.

మన మెప్పుడు ఈశ్వరుని పరిత్యజించి, అల్పవిషయా సక్తులమై యుందుమో, అప్పుడే ఈ ప్రపంచము మన యెదుట క్షుద్రవేషధారిణియై కానుపించును. ఈశ్వరుని కంటె మఱి దేనియందైనను, అధికతరమైన ప్రీతిని స్థాపించితిమేని, దేనినైనను ఈశ్వరునికంటె ఎక్కువగా ప్రేమించితిమేని

దానివలననే మనము దుఃఖ మనుభవింపవలసి వచ్చును. అపారమైన ధన మార్జించుము, గొప్ప కీర్తిని సంపాదించుము, విశేషమర్యాదను పొందుము, గొప్ప గొప్ప బిరుదులను వహించుము. వీనిలో దేనివలనను నీ కాత్మశాంతి గలుగ జాలదు. ఇట్టి ఐహిక సుఖముల నార్జించుటలో సంక్షోభము, వానిని సంరక్షించుకొనుటలో సంక్షోభము, అవి పోయిన యెడల సంక్షోభము. ఆదినుండి అంతమువఱకు మనస్సంక్షోభమే. ఏ స్థితియందును శాంతి లేదు. అదియునుగాక, ఈ విష యములు శాశ్వతములు కావు. కాలము సంప్రాప్తమైనప్పుడు, ఈ ప్రాపంచిక విషయము లన్నియు నిమిషములో మటుమాయ మైపోవును. రెప్పపాటుకాలములో ఇవన్నియు నశించిపోవును. బ్రహ్మముకంటె, దారపుత్రధనజనాదికమే ప్రియతర మనిచెప్పు, విషయాసక్తుడగు దురభిమానితో బ్రహ్మవాది చెప్పు సంగతి పరమసత్యము. మనము దేని దేనిని ప్రియతమమైన దని యెంచి దాని మోహమునందు పడి ముగ్ధులమై యున్నామో, దాని నెల్లను పరమేశ్వరుడే వినాశము నొందించుచున్నాడు, మన మనస్సును క్షణభంగురము లగు ఈ క్షుద్ర విషయములనుండి తప్పించి, శాశ్వతములగు ఆముష్మికసుఖముల వైపునకు మర ల్చుటకు, మనలను తనవైపున కాకర్షించుకొనుటకు, ఆయన పన్ను ఉపాయము లపరిమితములు; ఒకప్పుడు ఆనందవర్ష మును కురిపించును. ఒకప్పుడు హృదయవిదారణము గావిం చును. విధానములు భేదములు. ఉద్దేశ్య మొక్కటే. అత డొక్కడే ప్రియతముడు. అతనికంటె ప్రియతరమైనది మఱి

యొకటి లేదు. నీ వీ జీవితమునందు ఈశ్వరుని సంచయము (సంపాదనము) చేసుకొంటివా, నీ శాశ్వతజీవనమున కాధార మగు ధనమును సంచయము చేసికొంటివి. ఈ ధనము దొరకిన యెడల మిగిలిన సమస్తమును దొరకినట్లే. ఈ ధనము సంపాదితమైన యెడల మఱి యేయుభావమును ఉండదు. ఇది ఐహిక ధనమువలె నశ్వరమైనది కాదు, తుప్పు పట్టునది కాదు, దొంగ లెత్తుకొని పోవునది కాదు. ఇది శాశ్వతమైనది. ఇది నీ వార్జింప గలిగినయెడల, దీనినుండి విచ్యుతి పొందుదు నను భయము నీ కెన్నడును నుండజాలదు. సకలసమయముల యందును సర్వావస్థలయందును ఆయన మనకు తోడునీడయై యుండును. ఆ చిరజీవనసఖుడు, మనల నెన్నడును పరిత్యజింపడు. అట్టి మన ప్రాణవల్లభుడు మన ప్రేమకొఱకై యెదురు చూచుచున్నాడు. మన మాయనను హృదయపూర్వకముగా ప్రేమించలేనంత అనర్హులమా, కృతఘ్నులమా, నిర్భాగ్యులమా? ఈప్రపంచము, ఈశ్వరుని విడిచిపెట్టి, దానినే ప్రేమించవలసినంత ప్రియమైనవస్తువా? మనల నీశ్వరునుండి విడదీయ గలిగినంత ఆకర్షణశక్తి ఈప్రపంచమునందు కలదా? ఈ ప్రపంచమునందేయే సుఖములు కలవో అవన్నియు మన మెఱిగినవే. స్వయంభువు, నిర్వికారుడు, అగు ఆ యమృతపురుషు నుండి విచ్ఛేదము నొంది ఈప్రపంచమునందలి అశాశ్వతములగు క్షుద్రవస్తువుల నాశ్రయించి, మన మేమి చేయగలము? మన యనంతకాల జీవితమున కాధారభూత మగు ధర్మమును మన శాశ్వత జీవితమునకు ప్రభువును, ఆశ్రయుడు నగు నా

పరమేశ్వరుని పోగొట్టుకొన్న యెడల, మన కాత్మశాంతి యెక్కడిది, రక్షణ యెక్కడిది? రండు, సోదరులారా! రండు. మన మందరమును కలిసి, ప్రేమస్వరూపుడగు మన ప్రియజనకునికి, మన ప్రేమపూర్వక హృదయముల నుపహారముగా సమర్పించి, మన జీవితములను సార్థకము చేసికొందము, రండు. మనము వారమున కొకసారి ఇక్కడ కలిసికొనుట వలని ఫలము ఈ ఒక్క దినము కొఱకా? ఇక్కడ, ఈశ్వరునియందు భక్తి, మానవులయందు ప్రేమ మొదలగు ఏ యే కల్యాణ గుణముల నార్జింతుమో, అవన్నియు, మన హృదయమునందు చిరస్థాపితములై యుండునుగాక! ఇదే మన యుద్దేశము. ఇదే మన యాకాంక్ష. ఇప్పుడీ బ్రహ్మ మందిరమునందును, ఈ యుపాసనాసమయమున, ఆ పరమపురుషుని ప్రేమముఖమును, మఱల మఱపు రాకుండునట్లు, అధమము తిరిగి ఇక్కడ సమావేశమగు వఱకు, ఈయారు దినముల వఱకైనను, ఆ ముఖబింబము యొక్క ప్రతిబింబము వాడకుండునట్లు మన హృదయముల యందు ధారణ చేయుదము ఈ యాఱు దినముల వఱకైనను హృదయము చల్లగా నుండునట్లు, మఱల తృష్ణార్తులము గాకుండునట్లు, ఆయన ప్రేమరసము నిప్పుడే తనివిదీర పానము చేయుదము. ఆత్మోన్నతియే మన లక్ష్యము, రెండు గంటల కాలము మాత్రమే నిలుచు క్షణస్థాయి యగు భావోద్రేకమువలన లాభ మేమి? ఈ యుపాసనాసమయమున మన హృదయములయం దావిర్భవించు మంగళభావములు, మన యనుదినజీవితమునందు, మనోవాక్కాయకర్మలయందు ప్రకా

శింపనియెడల, ప్రాపంచిక దుఃఖములనుండి విముక్తి నొ
దించి, మనల నభ్యున్నతి నొందింపనియెడల, పాప తాపముల
యధికారము వ్యాపించని యున్నతస్థానమున మనల ప్రవేశ
పెట్టనియెడల, నవజీవనముయొక్క ఇట్టి శుభలక్షణములు
కానుపించని యెడల, మన మిక్కడకు వచ్చి లాభ మేమి?
ఈ యుపాసనము వలని ఫల మేమి? ధర్మ మొక నాటిదా?
ప్రేమ రెండు గంటల కొఱకా? ఈశ్వరు డీ క్షణము వాడా?
ఆ దినమున కా దినము మనము ధర్మానుష్ఠానమునందు బల
వంతులము కావలెను. ఆత్మపరీక్ష చేసికొని, మన హృదయము
నందు, మూలమూలలయందు గూఢముగా దాగియున్న సమస్త
పాపములను పారదోలవలెను. కామ క్రోధాద్యరిషడ్వర్గముతో
దుర్మత దురాచార దురనుష్ఠానములతో, అనుక్షణసంగ్రామము
సలుపవలెను. అహరహమును దయాసత్యశౌచములను, ప్రేమ,
శాంతి తితిక్ష మొదలగు సాధుభావముల నార్జింపవల
యును. ప్రతిదినము, ప్రతి సంధ్యాకాలమున, మనహృదయ
ద్వారము తెఱచి, ఆయన యెదుట పెట్టవలయును. ఆయన
యందు సంపూర్ణముగా ఆత్మసమర్పణము చేసి, మన జీవిత
మొక మహాయజ్ఞము గావింపవలయును. ఆయన ప్రత్యక్ష
దర్శనము మనకు కాకుండునట్లు, మనకును ఆయనకును నడుమ
నిలిచియున్న అహంభావాది దుష్టభావములను పూర్ణాహుతి
గావింపవలయును. ఇహమందుండగానే, మన మాయనను
సంపాదింపగలినయెడల, ఏ ప్రాపంచికభయమును మన
కుండజాలదు. ఏ యభావమును మనల బాధింపజాలదు. మనల

నాయన నిరంతరము తన మంగళచ్ఛాయయం దాచ్ఛాదితము చేసి, సమస్తకష్టములనుండియు, సంరక్షించుచు, సమస్త శుభములను సమకూర్చుచుండును. కాల క్రమమున మృత్యుదేవత మనల నాహ్వానము చేసినప్పుడు, విదేశము నుండి స్వదేశమునకు మఱలు యాత్రికునివలె, భర్త సన్నిధి కేగు భార్యవలె, తల్లి యొడిలోఁ జేరు బిడ్డవలె, తల్లిపాలు ద్రాగుటకై పరుగిడు గోవత్సమువలె, సాగరసంగమము చేరు మహావాహినివలె, పరమానందముతో, ప్రఫుల్ల వదనారవిందముతో, మన పరమపిత సన్నిధానమున కేగగలము. సంపూర్ణ హృదయము, సంపూర్ణమానసము, సంపూర్ణ ఆత్మ ఆయనకు సమర్పింతము. ఓ పరమాత్మా! మా జీవితము నిస్సారమై యున్నది. మేము నరజన్మ మెత్తినందుకు ఫలము గాంచలేకున్నాము. పశువులవలెనే మేమును జీవనము గడిపివేయుచున్నాము. విషయసుఖములయందే మా జీవితము వ్యర్థమగుచున్నది. దినదినమును, మా సోదరు లెందరో మృత్యువు వాతఁ బడుచున్నను, ఈ జీవిత మశాశ్వత మని గ్రహింపలేకున్నాము. ఇట్టి యజ్ఞానాంధకారమునఁ బడియుండు మ మ్ముద్ధరించుటకు నీవుగాక సమర్థు లెవరు ? తండ్రీ! నీ పాలఁ బడుచున్నారము. దోసి లొగ్గి యాచించుచున్నారము. మా సర్వస్వమును నీ కర్పించి నిర్భయముగా, నిర్విచారముగా, జీవననిర్వహణము చేయు భాగ్యమును లభింపజేయుము.

ఓమ్. ఏకమేవాద్వితీయమ్.

---

ఓమ్ తత్సత్.

# మహర్షి మహోపదేశములు



## ౧౭ వ ఉపదేశము

"యథా సౌమ్య వయాంసి వాసో వృక్షం సంప్రతిష్ఠంతే
ఏవం హ వై తత్ సర్వం పర ఆత్మని సంప్రతిష్ఠతే"

ఓ ప్రియదర్శనుడా! సమస్త పక్షులు తాము వసించుచున్న వృక్షము నెట్లాశ్రయించుకొని యుండునో, అట్లే స్థావర జంగమాత్మకమగు ఈ విశ్వమంతయు, సర్వవ్యాపియు, సర్వాశ్రయుడును, అగు పరబ్రహ్మమునే ఆశ్రయించియున్నది.

మనము మానవజన్మ మెత్తినందులకు పరమేశ్వరుని గురించిన జ్ఞానమును ఎంతవఱకు ఆర్జింపగలిగితిమి? ఆయనను ఎంతవఱకు ప్రత్యక్షముగా దర్శింపగలిగితిమి? ఆయన కల్యాణ గుణముల నెంతవఱకు అనుభవమునకుఁ దెచ్చుకొనగలిగితిమి? మన హృదయసీమలయందు ఆయన పరిశుద్ధస్వరూపము ఎంత విస్పష్టముగా ప్రకాశించుచున్నది? ఆయనకును మనకును గల సంబంధమును గుఱించి మన మెంతవఱకు అనుభవపూర్వకముగా గ్రహింపగలిగితిమి? ఈ యంశములను గుఱించి మన మొకసారి ఆలోచించి చూతము. అతడు మహాత్ముడు, ప్రభువు, మహాపురుషుడు అని శ్రుతులు ఉద్ఘోషించుచున్నవి. సూర్య చంద్రాదులవలె అత డొక మహత్తమమయిన వస్తువు కాడు.

అతడు పురుషుడు. మన కత్యంత ప్రేమాస్పదు డయిన తండ్రి. వాత్సల్యనిధి యగు పరమపిత. ఆత్మసమర్పణము చేసినయెడల భయరహితమగు పరమపదము నొసంగ గల ప్రియజనకుడు. ఆయన ఎక్కడనో యొక రహస్యలోకమున, దూరాతిదూరమును, దురూహమును, దుర్గమమును అగు రహస్య ప్రదేశమున భక్తులెవ్వరును తనను సమీపింప లేకుండునట్లు తన సింహాసనమును ప్రతిష్ఠించుకొని, ప్రచ్ఛన్నముగా దాగి యుండలేదు. చిరకాలము నుండి ఋషిపుంగవులు, మునిసత్తములు, తత్త్వవేత్తలు చేయు తపస్సులు నిరర్థకములు కావు. అనంతకాలమునుండి వ్యాకులచిత్తుల హృదయ గహ్వరముల నుండి వెలువడు ఆర్తనాదములు అరణ్యరోదనములు కావు. ఆయన విశ్వవ్యాపి, విశ్వమంతయు ఆయన కన్నులే. విశ్వమంతయు ఆయన చెవులే. నిశ్చలచిత్తముతో, నిష్కల్మషహృదయముతో, ఆయన శరణము వేడి, విఫలమనోరథు లయిన వారు మందున కయినను కానరారు. చేయి జాచి ఆయన నడిగినవారు వట్టిచేతులతో మఱలిపోయినట్లు, చరిత్రయం దెక్కడను సాక్ష్యము కానరాదు. ఎక్కడనో వెదుకనేల? ఎవరినో అడుగనేల. ఈ యుపాసనామందిరమునందు చేరియున్న మనలో నెవ్వరు ఆయన నిర్హేతుకజాయమానకటాక్షమునకు సాక్ష్య మీయకుండ నుండగలరు? ఆయన తోడు నీడవలె, మనతో కూడ కూడ నధివసించుచున్నాడు. ఆయన మన కాశ్రయుడు. మన మాయన యాశ్రితులము. ఆయన మన హృదయములయందు అంతర్యామి యయి యుండి మన మర్పించు

భక్తిపుష్పములను ప్రేమతో గైకొనుచున్నాడు. హృదయపూర్వకముగా మనము చేయు ప్రార్థనల నాలకించుచున్నాడు. ఆయనకును మనకును గల ఈ సత్యసంబంధము మన హృదయములయందు దృఢముగా ముద్రితమయి యున్నది. మన ప్రభువయిన పరమేశ్వరుడు నేడుండి రేపు లేనివాడు కాడు. ఆయన పరమసనాతనుడు-పురాణపురుషుడు. అనంతకాలమునుండి అనంత కాలమువఱకు ఉండువాడు, దేశకాలాతీతుడు. దేశకాలములకు నియంత. పూర్వ మొక కాలమునందు, అనాదిని చంద్ర సూర్యగ్రహనక్షత్రము లేవియు లేని సమయమున, కేవలము నిబిడమగు అంధకారము మాత్రమే సర్వత్ర ప్రసారితమయి యుండెను. అప్పుడు అనంతుడును, అద్వితీయుడును, స్వప్రకాశుడును, జ్యోతుల కెల్లను జ్యోతియు నగు అద్వైత పరబ్రహ్మము మాత్రమే, ఆ నిబిడాంధకారమును వెలిగించుచు దివ్యతేజఃపుంజ మయి విరాజిల్లుచుండెను. అప్పు డీ బ్రహ్మాండము లన్నియు ఆయన యనంతగర్భమునందు సత్తామాత్రముగ లీన మయి యుండెను. ప్రేమస్వరూపుడగు ఆ పరమ పురుషుడు తన యవ్యాజప్రేమచే సృష్టి చేయ సంకల్పించెను. ఆయన సంకల్పమాత్రముచేతనే అనంతకోటి బ్రహ్మాండము లుత్పన్న మయ్యెను. ఆ యా బీజములనుండి వరి, యవలు, గోధుమలు మొదలగు ధాన్య ముత్పన్నమయిన రీతిని, ఈ జగత్తు ఉత్పన్నము కాలేదు. జ్ఞానస్వరూపుడు, ప్రాణస్వరూపుడు నగు ఆ జగత్ప్రసవితయొక్క ఇచ్ఛాశక్తినుండియే, ఈ సర్వసృష్టియు నిస్సృతమయ్యెను. ఆయన యిచ్ఛాశక్తి

నేటికిని విరామము నొందలేదు. ఆ యిచ్ఛాస్రోతము నేటికిని, జీవవంతముగా ప్రవహించుచున్నది. అనంతకాలమువఱకు అవిచ్ఛిన్నముగా ప్రవహించుచునే యుండును. ఆయన అందరికిని ఆశ్రయదాత. ఆయన మంగళేచ్ఛచేతనే సర్వమును ఉత్పన్నమయినది. ఆయన యిచ్ఛచేతనే సర్వమును పోషింపబడుచున్నది. అభివృద్ధి నొందుచున్నది. మన మీ పృథివియందుండగనే, ఈ ఐహిక జీవితమునందే, పై సమస్త సత్యములకంటె అమూల్యతరమయిన మఱియొక సత్యమును అనుభవపూర్వకముగా గ్రహింపగలిగితిమి. ఆయన విశ్వమునందలి సమస్త జీవరాసులకును, ఆశ్రయ మిచ్చుచున్నాడు. సమస్త జీవరాసులను ప్రేమించుచున్నాడు. వాస్తవమే కాని, మనుష్యులమయిన మననుండి ఆయన ప్రతిప్రేమ నపేక్షించుచున్నాడు. జగమంతయు, జంతుజాల మంతయు, ఆయన కటాక్ష వీక్షణము చేతనే, సుఖముగా జీవననిర్వహణము చేయగలుగుచున్నది. కాని, వానిలో నేనినుండియు, ఆయన ప్రతిప్రేమ నపేక్షించుటలేదు. మనుష్యునినుండి మాత్రమే, ఆయన ప్రతిప్రేమను గ్రహించుచున్నాడు. ఇదే ఆయనకును మనకును గల విశేష సంబంధము. ఈ భూమండలమునందు ఎన్నో జీవరాసులు కలవు. పరమేశ్వరునితో నిట్టి విశేషసంబంధము మఱేజీవికిని కానరాదు. ఆయన మననుండి ప్రేమను ప్రతీక్షించుచున్నాడు గనుకనే, మన మాయనను తిరిగి ప్రేమింపగలుగు లాగున, మన హృదయపూర్వకమయిన ప్రేమను ప్రత్యర్పణము చేయగలుగులాగున, ఆయన మన కొక మహాధికారమును దయచేసి

యున్నాడు. అమూల్యమయిన ఆ యధికార మేది ? మన కాయన యనుగ్రహించిన యిచ్ఛాస్వాతంత్ర్యమే. ఆయన మనను స్వతంత్రులనుగా జేసి, మన మాయనను ప్రేమించు బాధ్యతను మనమీద నే యుంచెను. మనలను బానిసలనుగా జేసి తన్ను ప్రేమించుమని నిర్బంధించుటలేదు. జ్ఞానమూర్తియయి, ధర్మదేవత యయి, శివస్వరూపు డయి, మన హృదయములం దవతరించి, మనలను జ్ఞానపిపాసులుగను, ధర్మాసక్తులుగను, మంగళభావసంపన్నులుగను చేసియున్నాడు. అపరూప సౌందర్యరాశి యయి, నిరుపమాన రమణీయమూర్తి యయి, జగన్మోహన స్వరూపు డయి, మన హృదయరంగమున నిరంతర నాట్యము సలుపుచున్నాడు. ఆయన చక్కదనమును జూచి మనసు పట్టజాలక, విమోహితులమై, మన మాయనను ప్రేమింతు మని లావణ్యరాశియగు ఆయన సుందర వదనారవిందమును జూచి మన హృదయభ్రమరములు మన కనకేము లయి ఎగిరి ఆయన మీద వ్రాలునని, ఇట్టి విచిత్రలీలల ననవరతము సల్పు చున్నాడు. ఇదే, ఆయన మనకు ప్రసాదించిన అధికారము లలో కెల్ల ప్రధానాధికారము. ఇదే, మనజీవితములో మనము సాధింపదగిన పరమలక్ష్యము. ప్రేమస్వరూపు డగు ఆ పరమపురుషుడు మన ప్రేమను ప్రతీక్షించుచున్నాడు గనుక, మనమును ప్రేమపూర్వకముగా మన సమగ్రహృదయ మును, ఆయన కర్పింతము. హృదయమును పవిత్రముగ జేసికొని, మనస్సునందలి కళంకమును, మాలిన్యమును కడిగివేసి, ఆత్మ జ్యోతిని ఉజ్జ్వలము గావించి, పరమప్రేమాస్పదు డగు మన

పరమపితను ప్రేమింతము. ఆయన హృదయపూర్వకమగు మన ప్రేమ నపేక్షించుచున్నాడు. బిడ్డలనుండి తండ్రి ఎట్లు ప్రేమను ప్రతీక్షించునో, నాయనా, బాబూ, రారా యని పిలుచుచు వారు వచ్చి కూరుచుండుటకు తన యొడి నెట్లు సిద్ధము చేసి యుంచునో, అదే విధముగా, మనమును పవిత్ర హృదయుల మయి, ప్రేమపూర్ణమగు తనయొడియందు మనంతట మనమే ఎప్పుడు వచ్చి విశ్రమింతుమో యని, మన ప్రియ జనకుడును అనుక్షణమును ప్రతీక్షించుచున్నాడు. తండ్రికి పుత్రగాత్ర పరి ష్వంగము కంటె ఏది యానందకరము? అట్లే నా సంతాన మెప్పుడు వచ్చి, నా కాలింగనసుఖము నిచ్చునో యని, మన పరమపితయు ప్రతీక్షించు చున్నాడు. ప్రేమయే మనకు గల సమస్తభాగ్యము, అదే మన సర్వస్వము. మన ప్రేమ, మన కెప్పుడు పరమేశ్వరుని పితృభావముతో చూచుటకు తోడ్పడునో, అప్పుడే, మానవకోటిని భ్రాతృభావముతో నాలింగనము చేసికొనుటకును తోడ్పడును. ఆప్రేమ మన కేకార్యమును చేయు టకు తోడ్పడినను, ఆ కార్యము పవిత్ర మగును. ఆప్రేమ ఈశ్వ రునియందు లగ్నమయి, ఆయనతోడి సంస్పర్శమువలన, పరి శుద్ధమయి, మజల ప్రపంచమునందు ఎప్పుడు వ్యాపించునో, అప్పుడే అది సకలస్థానములను తన మంగళోదకములచే నభి షిక్తములు గావించును. ఇట్టి భాగ్యము, ఇట్టియానందము, మనకు లభించుచుండగా, మన మాయనను ప్రేమింపకుండ ఎట్లూర కుండగలము? ప్రేమస్వరూప మగు ఏ కల్పవృక్షచ్ఛాయయందు మనము చిరకాలము సుఖింపవలసి యున్నదో, ఆయన విషయ

మయి, మన ముదాసీన భావముతో నుండి కాలము గడిపి వేసినయెడల, మనమెంత భాగ్యహీనుల మగుదుము? అట్టి దుర్దశ మన కెన్నడును ప్రాప్తింప కుండునుగాక !

జడజగత్తునకును,ఆయనకును గల సామాన్యసంబంధము వంటిదిగాక, మనకును ఆయనకును ఇంకొక విశేష సంబంధము కలదు. ఈ బ్రహ్మామందిరమునకు దీని పునాది ఎట్లాశ్రియమో, ఈ వెలుగునకు వాయువువంటి ఒకసూక్ష్మపదార్థ మెట్లాశ్రయమో, అట్లే, పరమేశ్వరుడు సకలాశ్రియములకును ఆశ్రయుడు. పునాది లేకపోయినయెడల, ఈ మందిర మెట్లు నిలువ జాలదో, ఒక సూక్ష్మపదార్థ మాశ్రయముగా లేనియెడల, ఈ వెలుతు రెట్లు ప్రసరింప జాలదో, అదే విధమున, ఆయన యాశ్రియము లేనియెడల, మన మెవ్వరమును ఉండజాలము. పక్షు లన్నియు తమ వాసస్థానమయిన వృక్షము నెట్లాశ్రయించి యుండునో, అదేవిధమున సకలభువనములును, సమస్తజీవ రాసులును, పరమాత్మ నాశ్రియించియే యున్నవి. సామాన్యముగా, సకలజీవరాసులకును ఆయనకును గల సంబంధ మిదే, ఆయన అందరికిని ఆశ్రయదాత. ఆయనకును మనకును ఇంతకంటె అధికమయిన విశేషసంబంధ మింకొకటి కలదు. కుమారుడు తండ్రికి ఎట్లు ఆశ్రితుడో, ప్రజలు రాజునకు ఎట్లు ఆశ్రితులో, భృత్యుడు ప్రభువునకు ఎట్లు ఆశ్రితుడో, అట్లే మనమును ఆయన యాశ్రితులము. మన మాయనకు చిరకాలదాసులము, చిర కాలప్రజలము, చిరకాల సంతానము. మన కాయన తండ్రి, తల్లి, ప్రభువు. స్వతంత్రుడగు ఒకపురుషునికిని,స్వతంత్రుడగు మఱియొక

పురుషునికిని ఎట్టి సంబంధమో, ఆయనకును మనకును అట్టి సంబంధమే. తన్ను ప్రేమించుమని ఆయన మనలను బలవంత పెట్టడు. మనము స్వతంత్రులము. మన ధర్మప్రకృతి మనమీద నిర్బంధముగా అట్టిబాధ్యతను మోపుటలేదు. ఆయన మనలను జడిపించి, భయపెట్టి తన్ను ప్రేమించునట్లు చేసికొనుట లేదు. అతడు ముందు మనలను ప్రేమించి, తరువాత మనప్రేమ కాంక్షించుచున్నాడు. "అభ్యున్నతి నొందుడు. మీయాత్మలను ధర్మబలముచే బలయుతములు గావించుకొనుడు. మీహృదయములను మంగళభావములతో సంపూర్ణము గావించుకొనుడు. నాదగ్గఱకు వచ్చి శాంతిలాభము నొందుడు" అని ఆయన మన కాదేశించుచున్నాడు. కాని, ఆయన యొక్క ఈ మహాదేశమును మనము సకలసమయముల యందును పాలింపజాలకున్నాము. మనము దుర్బలుల మని మనము తెలిసికొనుచున్నాము. మనమీదనే భారము వేసుకొని, మన స్వశక్తివలన కొంచెమయినను చేయజాలకున్నాము. మన బుద్ధిబలమువలన మన పుణ్యకార్యముల వలన, మన జీవితమునందలి ఈ పరమలక్ష్యమును సాధింపలేకున్నాము. మన మిట్టి దుర్బలులము, కించిద్‌జ్ఞులము, హీనులము అని అనుభవపూర్వకముగా నెప్పుడు తెలిసికొందుమో, అప్పుడు స్వాభావికముగా, సర్వాశ్రయుడు, జగదీశ్వరుడు అగు మన పరమపితను, మనకు తోడుపడు మని ఆహ్వానము చేయుదుము. మన జీవితముయొక్క యావద్భారమును ఆయన మీదనే వేయుదుము. ఆయన తప్ప మనకు వేఱుగతి లేదని

తెలిసికొని ఆయనకు శరణాపన్నుల మగుదుము. అప్పుడే, వ్యాకుల హృదయముతో ఆయనను మనము ప్రార్థింపగలము. మన సమస్త సుఖ దుఃఖములను ఆయనకు నివేదింపగలము. అప్పుడే, ఆయన మన ఆశలను పూర్ణము చేయువాడు, మన భారమును వహింపగలవాడు, మన యభీష్టములను తీర్ప గలవాడు అని తెలిసికొందుము. అప్పుడే ఏ గురూప దేశమును అవసరము లేకయే, మనంతట మనమే, "ప్రాణే శ్వరా! నీవు నాకు ఏకమాత్రరక్షకుడవు, నీకంటె నాకు వేఱు రక్షకులు లేరు. నా ప్రాణమును, నా హృదయమును, నా సర్వ స్వమును నీ వశము చేసికొమ్ము" అని ఆయనను వేడుకొందుము. మనంతట మనమే మన సర్వస్వమును ఆయనకు సమర్పింతుము.

మన సమస్త భారమును, విశ్వాసమును, శ్రద్ధాభక్తు లను ఆయనకు సమర్పించునప్పటి మంగళభావమును, ఔదార్య భావమును, మన మిప్పుడు మన హృదయములయందు ధారణ చేయజాలము. యావత్ప్రపంచమును ఆ విశుద్ధభావమును ధారణచేయజాలదు. ఆ ఆంతరంగిక సంపూర్ణ నిర్భరభావము యొక్క ప్రకాశభావమే ఉపాసన. నే నాయన యాశ్రితు డను, నా కాయన ఆశ్రయదాత, నేను క్షుద్రుడను, ఆయన మహాత్ముడు, అని నే నెప్పుడు తెలిసికొందునో, నా సమస్త అభావములను పూర్ణము చేసికొనుటకు, నాకు గల లోటుపాటుల నన్నిటిని తీర్చుకొనుటకు, ఆయన వైపునకే, ఎప్పుడు నా దృష్టిని మరల్చుకొందునో, అప్పుడే గూఢమును అవ్యక్తమును అగు నా గంభీరభావము ఉపాసనయందు

సువ్యక్తమగును. ఆ సుగభీరభావము నా హృదయమునందు ఏమూలనో దాగియుండజాలదు. అప్పుడు, నా హృదయాంతరాళమునుండి, "నన్ను అసత్యమునుండి సత్యమునకు తీసికొని పొమ్ము. అంధకారమునుండి వెలుగునకు తోడుకొని పొమ్ము. మృత్యుపథమునుండి తప్పించి అమృతత్వము నొందించుము" అను ప్రార్థన బయలువెడలును.

ఆయన యుపాసనయందే మన నవజీవితముయొక్క ప్రారంభము. ఆయన యుపాసనయందే మన అనంతజీవితముయొక్క ఫలము. మన వర్తమాన సుఖమునకయి ఆయన నుపాసింతము. భూతకాలమునందు మనము పొందిన అభ్యున్నతికయి, కృతజ్ఞతాభావముతో ఆయన నుపాసింతము. భవిష్యత్కాలమునందు మనము పొందబోవు ఆనందమునకయి ఆయన నుపాసింతము. వర్తమానకాలమునందు ఆయన మనకు ప్రత్యక్షపిత యనియు, పరమపూజనీయదేవత యనియు తెలుసుకొని, భక్తిశ్రద్ధలతో ఆయన నారాధింతము. గతకాలమునందు ఆయన ప్రసాదముచే అవిచ్ఛిన్నముగా మన మనుభవించిన సమస్త సుఖములకొఱకు, ఆయనకు కృతజ్ఞతాపూర్వక అభివందనములు సమర్పింతము. మన భవిష్యజ్జీవితమునందు, పాపప్రలోభనములతో పోరాడి జయశీలురము కాగలుగుటకు, ఆయన ప్రసన్నముఖమును ప్రత్యక్షముగా దర్శింపగలుగుటకు, ఆయన పాదపద్మముల చెంత జేరి, మనఃపూర్వకముగా ప్రార్థింతము. మన మాయనను చిరకాల మారాధింపగలుగుదుముగాక! ఆయన ప్రేమసౌరభమును, మంగళభావ

మును దినదినమును ఆస్వాదనము చేసి, క్రమోన్నతి నొంది ఆయనను పూజింతము. చిరకాలము ఆయన యనుగ్రహము ననుభవించుచు, ఆయనమీదనే భారము వేసి, ఆయననుండి బలమును, వీర్యమును, పుణ్యభావమును గ్రహింతము. దిన దినము, ఆయన కృపావర్షమునందు స్నానము చేసి మన హృదయములయందలి కృతజ్ఞతాభావము నుజ్వలము గావించు కొందము. వారము వారమును ఇట్టి హృదయపూర్వకమయిన ఆరాధనమునే సాధనచేసి, మన జీవితములను చరితార్థములు గావించుకొందము.

ఓ పరమాత్ముడా! మా హృదయములు అంధకార బంధురము లయి యున్నవి. నీ జ్ఞానజ్యోతిని వెలిగించి, నిన్ను గుఱించిన యథార్థజ్ఞానమును మాకు బోధింపుము. అశాశ్వతము లగు ఇహలోకభోగములనుండి మా మనస్సును మరలించి, శాశ్వతములగు ఆధ్యాత్మికసుఖముల వైపునకు మా దృష్టిని ప్రసరింపజేయుము. మృత్యుపథమునుండి మమ్ము తప్పించి అమృతత్వము నొందింపుము. బీడుభూములవలె కళావిహీనము లయియున్న మా హృదయసీమలయందు నీ కృపావర్షమును వర్షింపజేసి, భక్తిపుష్పములను పుష్పింపజేయుము. అనాథుల మగు మమ్ము రక్షింప నీవుగాక మఱియెవ్వరు సమర్థులు? తల్లి వయినను నీవే, తండ్రి వయినను నీవే, గురు వయినను నీవే, సమస్త బంధువులును నీవే, నిన్నే శరణము వేడుచున్నాము. మా మొఱ లాలకించి, మమ్ము నీ చెంత జేర్చుకొనుము. ఇదే

నీకు సాష్టాంగ ప్రణామము లాచరించుచున్నాము. ఆశీర్వదించి రక్షింపుము.

ఓమ్ ఏకమేవాద్వితీయమ్

---

ఓమ్ తత్సత్.

# మహర్షి మహోపదేశములు



## ౧౬ వ ఉపదేశము

తగ్ంహ దేవ మాత్మబుద్ధి ప్రకాశం
ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే.

స్వప్రకాశుడును, నా ఆత్మను బుద్ధిని ప్రకాశింపజేయు వాడును, అయిన అద్వైత పరబ్రహ్మమును, నేను మోక్షాసక్తుడ నయి, శరణు జొచ్చుచున్నాను.

పరమేశ్వరునకు సమస్త జగత్తునకును, ఏ సంబంధమో, ఆ ఆశ్రయ ఆశ్రిత సంబంధము, ఆయనకును మనకును సమానమే. అఖిలబ్రహ్మాండములకు ఆయన యెట్లు ఆశ్రయుడో, అట్లే మనకును ఆశ్రయుడు. ఆయన ఆశ్రయమును విడిచి, ఈ యనంత విశ్వమునందు ఒక్క అణువయినను ఉండజాలదు. అట్లే మనము ఆయన యాశయమును విడిచి, క్షణకాలమయినను

ఉండజాలము. ఆయనకును సమగ్రసృష్టికిని గల ఇట్టి సామాన్య సంబంధము గాక, మనకును ఆయనకును ఉచ్చతరమయిన, గురుతరమైన, మఱియొక విశేష సంబంధము కలదు. అది అతి నిగూఢమును, అత్యంతగాఢతరమును అయి యున్నది. ఆయనతో ఇట్టి మధుర సంబంధము జగత్తునందలి మఱేవస్తువునకును లేదు. తేజస్వంతము లగు సూర్యచంద్ర నక్షత్రాదులకుగాని, వీర్యవంతములగు పృథివ్యాదభూతములకు గాని, ఆయనతో అట్టి సంబంధము లేదు. కేవలము మనుష్యునకు మాత్రమే, ఈశ్వరునితో నట్టి చుట్టఱికము గలదు. ఆయనతో అట్టి సన్నిహిత సంబంధము కలిగియుండుటచేతనే, మన మందరమును, ఇప్పు డీ యుపాసనామందిరమునందు చేరియున్నాము. సమస్త జీవరాసులును ఆయనయందే యున్నవి. ఆయనవలననే పోషింపబడుచున్నవి. మనయెదుటనుండు ఈగోడలు, ఈ స్తంభములు, ఇవన్నియు ఆయన ఆశ్రయమునందే యున్నవి. కాని, ఈ ఆశ్రయ ఆశ్రితభావము వీనిలో నేవియు గ్రహింపజాలవు. పృథివ్యాది మహాభూతములుగాని, సూర్యచంద్ర నక్షత్రాది తేజోరాసులు గాని, పశుపక్ష్యాదిజీవరాసులు గాని, తమకు పరమేశ్వరుడు ఆశ్రయు డనియు, తా మాయన ఆశ్రితుల మనియు, ఆయన ఆశ్రయమునువిడిచి, తాము ముహూర్తకాల మయినను ఉండజాలమనియు, తమకు గల సమస్త శక్తులును ఆయననుండియే పొందుచున్నామనియు, గ్రహింపజాలవు. ఇట్లు గ్రహింపగల శక్తి, ఇట్టి మహాధికారము కేవలము మానవునకు మాత్రమే కలదు, జగత్పిత, తన అవ్యాజప్రేమచే,

విశ్వమునందు మరిదేనికిని లేని ఇట్టి అమూల్యమయిన జ్ఞాన ధనమును, మనుష్యునకు ప్రసాదించి యున్నాడు. కనుకనే మనుష్యునుండి ఆయన పూజను కోరుచున్నాడు. ప్రేమ నపేక్షించుచున్నాడు. ఆయన స్వయముగా ఒక మహద్వస్తువు కాడు. ఆయన ప్రేమాస్పదుడును ధర్మాశ్రయుడును అగు ఒక మహాపురుషుడు. అఖండజ్ఞానము, పరిపూర్ణ మంగళోద్దేశము, అమోఘమగు ఇచ్ఛాశక్తి గల యొక మహాపురుషుడు. కనుకనే ఆతడు మననుండి ధర్మమును ప్రేమను అపేక్షించుచున్నాడు. ప్రేమనిధి యగుటచే, మన హృదయములయందు ధర్మస్వరూపుడయి ప్రకాశించుచు, ఆయన నారాధించు విధానమును, ఆయనను ప్రేమించు పద్ధతిని మనకు బోధించుచున్నాడు. ఆయన నారాధించుటకు, సాధన సామగ్రియు, ఆయనయే మనకు సమకూర్చుచున్నాడు. ఆయన మన హృదయోద్యానములయందు శ్రద్ధ, భక్తి, ప్రేమ మొదలగు దివ్యపుష్పములను వికసింప జేయుచున్నాడు. మన మాయనను మన హృదయసీమలయందు సింహాసనము వేసి కూర్చుండబెట్టి, ఈ పుష్పములతోనే పూజచేయుచున్నాము. శిలానిర్మితములగు ప్రాచీరములతో కట్టబడిన, పరిమిత భౌతిక దేవాలయములకంటె అనంతవిశాలము లగు మన హృదయమందిరములే, ఆయనకు ప్రియతరస్థానములు. నేడుండి రేపు వాడిపోవు భౌతికపుష్పములకంటె, సౌరభవిహీనము లగు సువర్ణపుష్పములకంటె, నిరంతరవికాసస్వభావము గల మన హృదయ పద్మములే ఆయనకు ప్రియతరములు. మన హృద

యములను పరీక్షించగల ఆ పరమపురుషునకు, వివిధాడంబర ములతో గూడిన బాహ్యార్చనలకంటె హృదయపూర్వక ముగా నర్పించిన భక్తికణములే అధికరసవంతములు. నిర్బం ధముచేగాక, మన యిచ్ఛానుసారముగా నాయనను పూజింప గలుగుటకై, ఆయన మనను స్వతంత్రులనుగా జేసెను. మన మాయన నారాధించి సుఖింపవచ్చును. ఆయనకు దూరముగా తొలగి కష్టముల ననుభవింపవచ్చును. ఉభయకార్యములకును మనకు స్వాతంత్ర్యము కలదు. దండము చేత బూని, భయ మును పురిగొల్పి, సేవకులచే పని చేయించు క్రూరు డయిన యజమానునివలెగాక, బిడ్డను చేరదీయు తల్లివలె, ఆయన మనను ప్రేమతో నాహ్వానించుచున్నాడు. "బిడ్డలారా, రండు. మీ ఆత్మలను, మీ మనస్సులను నా కర్పింపుడు. భక్తిశ్రద్ధలతో న న్నర్చింపుడు. నాకు నమస్కరింపుడు. శాశ్వతానందమును గైకొనుడు. తుచ్ఛము లగు విషయ సుఖముల నాశింపకుడు. అవి నశ్వరములు. సత్యమును నిత్యమును అగు ఆధ్యాత్మికా నందమును చూరగొనుడు'' అని మృదు మధుర స్వరముతో మనను పిలుచుచున్నాడు. ఆయన ఏ మేమి కోరుచున్నాడో, దాని నెల్లను ఆయన కర్పింతము. దాని నాయన ప్రేమపూర్వ కముగా గ్రహించును. లోకములో 'మనది' అనదగిన దేము న్నది? ఒక తృణముపయినైనను మన కధికారము లేదు. ఒక ఇసుక రేణువు నయినను మనము సృష్టింపజాలము. ఆయన నిష్కారణ ప్రేమచే, దాన విక్రియ సత్త్వాది సమస్తాధికారము లతో, సమస్తస్వాతంత్ర్యములతో, మనకు దయచేసిన మన

హృదయములు తప్ప, 'మనది' అని చెప్పుకొనుటకైన లేశ మాత్రమును ఈ విశ్వమునందు లేదు. ఇట్టి విషయములో మన మాయన కియ్యరాని దేమున్నది? మనంతట మనము దేనిని సంపాదించియుండలేదు. స్వార్జిత మనునది మన కణు మాత్రమును లేదు. ఎవరినుండి సమస్తము గ్రహింపగలిగితిమో, వానిని ఆయన తిరిగి కోరినప్పుడు, ఆయనకు ప్రత్యర్పణ చేయుటలో సంకోచ మెందుకు? ఆయన పాదపీఠముమీద, కామక్రోధాది సమస్త పశుభావములను, బలిగా నర్పింతము. ప్రేమభావముల నభ్యున్నతి నొందించి, ఆయన చరణ కమలములయం దర్పింతము. హృదయమునందలి అవిశ్వాస ద్వేష సంశయాది సమస్త కంటకములను, ఊడబెరుకుదము. హృదయ పుష్పముల నన్నిటిని వికసింపజేసి, ఆయనకు పుష్పాంజలి సమర్పించి, ఆయనను మన భక్తికుసుమ సౌరభము నాఘ్రాణింప జేయుదము. జగదేకవీరుడు, త్రిలోకాధినాధుడు అగు ఆ దివ్య సుందరమూర్తి, భిక్షుకుడై, మన హృదయద్వారముకడ వేచి యుండగా, భక్తిభిక్షము పెట్టగల భాగ్యము మనకు లభించినది. ధన్యుల మైతిమి. మనకు గల సర్వస్వమును ఆయనకు సమర్పించి కృతార్థుల మగుదము.

మన మెవరిని పూజించుటకై ఇచ్చట చేరియుంటిమో, అతడు మనలను ఉదాసీనభావముతో, నిర్లక్ష్యభావముతో, చూచుచుండుటలేదు. మన ప్రార్థనలకు, అర్చనలకు, ఆయన కేవలము మూగసాక్షివలె తటస్థుడుగా లేడు. ఆయన మనతో కూడ నున్నాడు. మనకు సకలశుభకార్యముల యందును

సాహాయ్యము చేయుచున్నాడు. ఈ నిమిషమునందు సహితము, ఆయన మన హృదయములయందుండి, మన ప్రేమను భక్తిని ప్రస్ఫుటీకృతము చేయుచున్నాడు. ఆయన మన మనస్సులయందు సమస్తపవిత్రభావములను ఉద్దీపనము చేయుచున్నాడు. మంగళభావములను ప్రేరేపించుచున్నాడు. స్వాతంత్ర్యభావమును బలపరుచుచున్నాడు. ధర్మభావములను పెంపొందించుచున్నాడు. చూడుడు! ఆయనకును మనకును ఎట్టి నిగూఢసంబంధమో! ఆయన మనమీద అజస్రము తన ప్రేమవర్షమును కుంభవృష్టిగా కురిపించుచున్నాడని మనము తెలిసికొన్నప్పుడు, అనవరతము తన అమోఘసాహాయ్యమును మనపయి ప్రవహింపజేయుచున్నాడని, మనము తెలిసికొన్నప్పుడు, మనము మన సమస్త ప్రేమను, సమస్త విశ్వాసమును ఆయనయందు సమర్పించుటకు వెనుకంజవేతుమా? ఓ సాధు యువతీ యువకులారా, మీరు పాపప్రలోభనములతో పోరాటము సల్పి, విజయ మొందవలయునని దృఢసంకల్పులయి యున్నారు. మీకీ ధర్మరంగమున విజయశంఖమును పూరించి, ధైర్యదుందుభిని మోగించి, వీరోత్సాహములను ప్రజ్వలింపజేయగల నాయకు డెవడు? మీరు మీ దుర్బలత్వమును తెలుసుకొనుచున్నారా? శత్రువును సంహరించుటలో మీ సహస్ర సహస్ర ప్రయత్నములు విఫలములగుట గాంచి నిరుత్సాహు లగుచున్నారా? ఉచ్చతర సోపానముల నధిరోహించి, మోక్షసామ్రాజ్యమును చూరగొని, విజయపతాకమును స్థాపించుటకు మీకు సామర్థ్యము చాలదని,

మీ రధైర్యపడుచున్నారా? వద్దు వద్దు. అల్పైన్నడును నిరాశలు కావలదు. మన పరమపితయగు పరమేశ్వరుడు, మన అంతశ్శతుౖవులతో, బాహ్యాశతుౖవులతో, పోరాడి విజయము గాంచుటకు కావలసినంత దివ్యబలమును, దుర్బలములయిన ఈ మర్త్యదేహముల యందే ప్రేరణచేయుటకు సంసిద్ధముగా నున్నాడు. ఆయన మన హస్తములను పట్టుకొని, విషమస్థానముల యందు నడిపించి, పాపతాపముల నుండి సంరక్షించి, సురక్షిత మయిన స్థానమును చేర్చుటకు కృతసంకల్పుడయి యున్నాడు. రణరంగమునందు గాయములు తగిలి శిధిలము లయి యున్న మన శరీరములను తన అమృతహస్తముయొక్క స్పర్శమాత్రము చేతనే, దివ్యదేహములుగా మార్చుటకు సమకట్టియున్నాడు. మన మందరమును ఆ యమృతనికేతనుని సాన్నిధ్యమున చేరుటకు ప్రయాణము చేయు యాత్రికుల మయియున్నాము. ఆయన శరణు జొచ్చినయెడల, మార్గమధ్యమునందు ఏ యపాయమును పొందక, ఏ కిష్టమునకు లోనుగాక, నిర్విఘ్నముగా, మన గమ్యస్థానమును పొంది, మానవజన్మమును సార్థకము చేసికొనగలము.

అభయప్రదాత యగు పరమేశ్వరుని యాశ్రయమును మన మెప్పుడు పొందగలుగుదుమో, అప్పుడు మన కింకేమి భయము? ఆయన మనను స్వతంత్రులనుగా జేసి, మనను విడిచి పెట్టియుండలేదు. ఆయన మనకు వెంటవెంటనే యున్నాడు. ఆయన మనకు స్వాతంత్ర్యము నిచ్చి, మన క్షుద్రశక్తులమీదనే, మన జీవితముయొక్క యావద్భారమును ఉంచియుండలేదు.

మన జీవితప్రయాణమునందు, మన స్వశక్తిని నడుచుచు, ఒక సారి పడి, మ మ్ముద్ధరింపు మని కేక వేసినయెడల, ఆ కేకకు అందనంత దూరములో తాను కూరుచుండి, మన కర్మము మన మనుభవింతుమని, ఉదాసీన భావముతో, ఆయన మనలను విడిచిపెట్టియుండలేదు. అట్లు మనను వదలివేసి తా నెక్కడనో దూరముగా పోయి కూర్చున్న యెడల, మన కట్టి స్వాతంత్ర్యము లేకపోయి యుండుటయే మే లయి యుండును. మనము మన దౌర్బల్యముచే, పాపప్రలోభనములయొక్క వలలో, నొక సారి చిక్కుకొనిన యెడల, మన పునరుద్ధరణమునకు ఆశయే లేకపోయి యుండును. ముక్తజీవుల మగు మన జీవితముకంటె బద్ధజీవులగు పశుపక్ష్యాదుల జీవితమే మెరుగయి యుండును. పశుపక్ష్యాదులు తమ కాయన ఏ నియమముల నేర్పరచియున్నాడో, వాటిని మీరజాలవు. ఆ నియమముల నుల్లంఘించుటకు వానికి స్వాతంత్ర్యము లేదు. అవి సృష్ట్యాదినుండియు, ఆయన యెట్లు నడిపించుచున్నాడో, అట్లే నడుచుచున్నవి. సుఖజీవనము చేయుచున్నవి. వాని సుఖమునందు వృద్ధియు లేదు. క్షయమును లేదు. మనుష్యు డట్లుకాదు. మనుష్యుడు ధర్మనియమములను పాటించి నిరతిశయసుఖము ననుభవింపగలడు. ధర్మనియమముల నుల్లంఘించి, అధర్మప్రవృత్తు డయి, పశువులకంటెను హీనస్థితి నొందగలడు. కనుక మనకు ఎప్పు డాయన స్వాతంత్ర్యము నొసంగియున్నాడో, అప్పుడు మనను విడిచిపెట్టక, మనము మన స్వాతంత్ర్యము నెట్లుపయోగించుకొనుచున్నామో, నిరంతరము కనుపెట్టి చూచుచు, మనతోకూడ

కూడ నుండవలసిన బాధ్యత ఆయనమీద మరింత ఎక్కువగా నున్నది. కనుక, వాస్తవముగా మన నాయన విడిచి పెట్టక, కూడకూడ నుండి ధర్మమార్గమున నడిపించుచున్నాడు. ఈ సంగతి మన జీవితమునందు, అనేకసారులు మన అనుభవము వలననే తెలియవచ్చుచున్నది. తండ్రి బిడ్డకు నడక నేర్పు సమయమున, బిడ్డను స్వాతంత్రముగా విడిచిపెట్టును. కాని, సంపూర్ణముగా విడిచిపెట్టి యూరకుండడు. ఎక్కడ పడి పోవునో, కాలు విఱుచుకొనునో, చేయి విఱుచుకొనునో యని కనుపెట్టి చూచుచునే యుండును. శిశువు, ఎప్పుడు తనంతట తాను, తన బలమువలననే నడుచుటకు ప్రయత్నించునో, అప్పుడు భయముతో మెల్లమెల్లగా అడుగులు వేయుచుండును. ఎప్పుడు తండ్రి చేయి అందిచ్చునో, అప్పుడు సాహసముతో అడుగులు వేయుచుండును. మన పరమపితయు, అదేవిధమున కూడకూడ నుండి ఒకప్పుడు విడిచిపెట్టుచు, ఒకప్పుడు చేయందిచ్చుచు, మనను ధర్మమార్గమున నడిపించుచున్నాడు. ఆయన మనలను ఈ ప్రాపంచిక క్షేత్రమునందు విడిచిపెట్టియున్నాడు. ఈ క్షేత్రమునందు తటస్థించు విఘ్నములతో విపత్తులతో సమరము సల్పి, క్రమక్రమముగా సంగ్రామదక్షుల మయి, బలసంపన్నులము కాగలుగుదు మనియే, అట్లు చేసియున్నాడు. కాని, ఆయన మనను సంపూర్ణముగా విడిచిపెట్టి దూరముగా తొలగియుండలేదు. మన మెన్నిసార్లు పడిన, అన్నిసార్లును, లేవనెత్తి ధైర్యమును పురికొల్పి, తిరిగి క్షేత్రమునందు నిలువ గలుగునట్లు చేయుటకు, మన వెంట వెంటనే నడుచుచు,

నిరంతరము సహాయపడ సంసిద్ధుడయి యున్నాడు. ఆయన ఒకప్పుడు మన సాధుకృత్యములను మెచ్చుకొని, తన ప్రసన్న వదనముతో మనకు ప్రోత్సాహమును కలిగించుచున్నాడు. ఒకప్పుడు తన రుద్రముఖమును ప్రదర్శించి, మన పాపచింతలను అణచివేయుచున్నాడు. ఒకప్పుడు మన నేరములకు తగిన దండనను గావించి, మన ప్రవర్తనను దిద్దుచున్నాడు. ఈవిధముగా, ఆయన మన ఆత్మలయందుండియే, మనతోకూడకూడ పనిచేయుచునే యున్నాడు. మన హృదయమునుండి ఎప్పుడు మనఃపూర్వకమయిన ప్రార్థన బయలు వెడలునో అప్పుడే మన హృదయమునందు, ఆయన దివ్యబలము అవతరించును. ఆయనకును మనకును గల నిగూఢమయిన విశేష సంబంధమిదే. కావున మోక్షార్థులమై, సమస్తశోక మోహములనుండి విడివడి, ఆయన నిరతిశయ బ్రహ్మానందము ననుభవించుటకయి, స్వప్రకాశుడును, మన ఆత్మబుద్ధి ప్రకాశకుడును అయిన ఆ పరమపురుషుని శరణు జొత్తము. ఆయన మనలను కరుణించి ఉద్ధరించును గావుత !

ఆత్మబుద్ధి ప్రకాశకుడవయిన ఓ పరమేశ్వరా! మేము ముముక్షులమయి నీ శరణము వేడుచున్నాము. నీవు మా హృదయములందు శుభబుద్ధిని ప్రసాదించుము. మంగళభావములను ప్రేరణ చేయుము. నీ యిచ్ఛానుసారముగా మమ్ము నడిపింపుము. ఓ దేవా, మమ్ము నీ విశ్వసనీయభృత్యులనుగా జేసికొనుము. ఆశీర్వదించి రక్షింపుము.

ఓమ్. ఏకమేవాద్వితీయమ్.

---

ఓమ్ తత్సత్.

# మహర్షి మహోపదేశములు



## ౧వ ఉపదేశము.

సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ,
యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్
సోఽశ్నుతే సర్వాన్ కామాన్,
సహ బ్రహ్మణా విపశ్చితా.

సత్యస్వరూపుడును, జ్ఞానస్వరూపుడును, అనంతుడును అగు పరబ్రహ్మము, దేహమనెడు ఆకాశమునందు, ఆత్మయను గుహాయందు, ఉన్నవానినిగా ఏ సాధకుడు తెలిసికొను చున్నాడో, అతడు సత్యకాముడై, సర్వజ్ఞుడగు పరబ్రహ్మ ముతో సమస్త కామములను అనుభవించు చున్నాడు. మఱియు పరమేశ్వరుని యిచ్ఛతో తన యిచ్ఛను మేళగింప గలుగు చున్నాడు.

మనము మనకు బాహ్యమందుండు సమస్త వస్తువుల యందును పరమేశ్వరుని సుందర మంగళ స్వరూపముయొక్క దేదీప్యమాన ప్రకాశమును చూడగలుగుచున్నాము. ఈ యనంతాకాశమును, దీనియందుండు సమస్త వస్తువులును, ఆయనయొక్క దివ్యమంగళభావమును ప్రచారము చేయు చున్నవి. సమస్త జీవరాసులకును జీవన మొసంగుచు నిరంతర

ధారగా ప్రవహించు నదీప్రవాహములయందు ఆయనయొక్క ఆనంద లీలలను మంగళోద్దేశమును, గంభీర నాదముతో ఘోషించుచుండు ఉత్తుంగ తరంగ మాలికలతో నిండిన మహా సముద్రములయందు ఆయన మహాశక్తిని, జగమంతను తేజోమయముగా చేయు సూర్యకిరణములయందు ఆయన స్వయంప్రకాశమును దర్శించుచున్నాము. ఇక బాహ్యమునుండి అంతరమునకు దృష్టి మరలించితిమేని, మన హృదయముల యందు, ఆయన యావిర్భావమును, ఆయన మంగళలీలను ప్రత్యక్షముగా దర్శించుచున్నాము. ఎప్పుడు మనము మన హృదయేశ్వరుని ప్రత్యక్షముగా దర్శింతుమో, అప్పుడు ఆయన ప్రేమను, ఆయన పవిత్రతను, ఆయన మంగళభావమును ఎంత ప్రకాశమానముగా చూడగలము? ఆయన మన హృదయము లకు అధినాథుడు. మన హృదయములయొక్క ప్రియధనము. మనము మన హృదయములకు ఇనుపతలుపులు తగిలించి, మూసుకొని ఉండకుందుముగాక! హృదయస్వామిని హృదయ రాజ్యమునుండి బహిష్కరింపకుందుముగాక! పరమేశ్వరుని యొక్క సౌందర్యభవనమునకు పరమేశ్వరుని రానిత్తము. హృదయరాజ్యమునందు హృదయనాథుని ప్రతిష్ఠింతము. మన సమస్తచిత్తవృత్తులను ఆయనకు సేవకములుగా జేసి, ఆయ నకు పరిచర్య చేయుదము. ఈ జగన్మధ్యమున పరమేశ్వరుడు సింహాసనాసీనుడై కొలువుదీర్చి యున్నాడు. ఆయనకు నలు పార్శ్వములయందును సూర్యచంద్రులు, నక్షత్రములు, గ్రహ ములు, ఉపగ్రహములు, ఆయన యాజ్ఞలను శిరసావహించి,

సునియతములయిన సుందరనియమములకు లోనయి, అణుమాత్రము గతులు తప్పక, ఆయనకు ప్రదక్షిణము జేయుచున్నవేమో యన్నట్లు తమకు నిర్మితములయిన ఆయా కక్ష్యలయందు నిరంతర సంచారము చేయుచున్నవి. అదేవిధమున, మనమును మన హృదయేశ్వరుని, హృదయమధ్యమున ప్రతిష్ఠాపించి, సమస్త చిత్తవృత్తులను, ఏకీభవింపజేసి, ఆయనకు హితమయిన కార్యములయందే, నియుక్తము గావింతము. మన గృహస్వామి గృహమునకు వేంచేసియున్నాడు. మన మిక ఇతర చింతలు మాని, ఆయనకు సేవచేయుటయందే నియుక్తులమగుదము? ఎవని భాగ్యము మనము అజస్రము అనుభవించి, సుఖముగా జీవనయాత్ర చేయుచున్నామో, ఆయనయే స్వయముగా దర్శన మిచ్చినప్పుడు, ఆయన ధన మాయనకప్పగించి, ఋణవిముక్తుల మయి శోక మోహములనుండి విముక్తులమగుదము. ఆయనకు ప్రియమయిన కార్యములు చేసి శ్రద్ధాభక్తులతో ఆయన నారాధింతము. ఆయనకొఱకు ఏకార్యమును చేయుదుమో, అది అతిస్వల్పమయినను, గొప్పదిగాను, పవిత్రమయినదిగాను పరిణమించును. మనము ఆయన కార్యమే యనుకొని, ఒక ఆకలిగొన్న వ్యక్తికి పట్టెడన్నము పెట్టగలిగితిమేని, అదెంత స్వల్పమయినను, అది మహాకార్యమే. మఱియు, మన యశస్సును, మర్యాదను, స్వార్థపరత్వమును చరితార్థత నొందించుకొనుటకు వేయిమందికి షడ్రసోపేతముగా సంతర్పణము చేసి, వస్త్రదానములు చేసినను, అది ఈశ్వర సంప్రీతికొఱకుగాక, స్వలాభార్థమయి చేయబడుటచే, అది అతిక్షుద్ర

కార్యముగానే పరిగణింపబడవలయును. ఆయన యాశ్రయము నందుండి, మన మే కార్యము చేసినను, ఆ కార్యము అక్షయ మగును. దాని ఫల మనంతము. కాబట్టి పరిశుద్ధ హృదయుల మయి, ఆయనను మన హృదయసీమలయందు స్థాపింతము. ప్రాణప్రదముగా ఆయనకు హితమయిన కార్యమునే చేయ యత్నింతము. అప్పు డాయనతోగూడ, సమస్త కామ్య విషయములను ఉపభోగింపగలము.

మనము ఈశ్వరునికి ప్రియసంతానము. స్వతంత్ర పురుషులము. మనము హృదయపూర్వకముగా దేనిని ఆయనకు సమర్పింతుమో, దానినే ఆయన గ్రహించును. అట్లు కాని యెడల, దాని నాయన గ్రహింపడు. ప్రేమపూర్వకముగా, శ్రద్ధాభక్తులతో, హృదయపూర్వకమగు ఇచ్ఛాశక్తితో, మన మేపూజ నాయన కర్పింతుమో దానినే ఆయన స్వీకరించును. మనఃపూర్వకముగా, ఇచ్ఛానుసారముగా, ఏమంగళ కార్యములను చేతుమో, అవియే ఆయనకు ప్రియమయిన కార్యములు. పరమేశ్వరుడు మనను స్వతంత్రులనుగా సృజించెను. స్వాతంత్ర్యమే మన గురుతరమైన అధికారము. మిగిలిన యావత్ప్రపంచమును నియమబద్ధమయిన ఒక యంత్రము వంటిది. ఈశ్వరుడు ఆ యంత్రమును ఉల్లంఘింపరాని తన చండశాసనములచే, నడుపు యాంత్రికుడు. ఆయన మనుష్యుని మాత్రము స్వతంత్రునిగా జేసి, తననుండి వేరుపఱచి, పృథగ్భావముగా, విచ్ఛిన్నముగా, తన బద్ధనియమములకు, బాహ్యమునం దుంచియున్నాడు. సూర్యుడు, చంద్రుడు, వాయువు,

వర్షము, శీత, గ్రీష్మ, వసంతములు, మొదలయిన సమస్త సృష్టియును, ఆయన నియమముల ననుసరించి నడుచుచున్నవి. ఇం దేదియు ఆయన నియమముల నతిక్రమించి ఒక వెంట్రుక వాసి యయినను ముందు వెనుకలకుగాని, పార్శ్వములకుగాని, నడువ జాలవు. మనుష్యుడు ఆయన యిచ్ఛను సులభముగా నతిక్రమించి సంచరించుచున్నాడు. ఇచ్ఛాపూర్వకముగా ఆయన ధర్మసేతువు నుల్లంఘించుచున్నాడు. పాపములను మూట కట్టుకొను చున్నాడు. మన శ్రేయస్సును కోరి, ఆయన మనకు స్వాతంత్ర్య మిచ్చియుండగా, దానియొక్క ఫలమూ, యీ దుర్గతి? మన పరమపితనుండి విచ్ఛిన్నుల మయి, ఇట్టి దురవస్థ ననుభవింపుచు కాలయాపనము చేయవలసినదేనా? ఏమి యీ విపరీతము! ఆయన ఒకటి తలచిన మరియొక డయ్యేనే. నిజముగా పయికి నిట్లే తోచుచున్నది. కాని, దీనికి ఒక అంతరార్థము, ఒక రహస్యవ్యాఖ్యానము కలదు. ఈశ్వరుడు, ముందుగా, మనను తననుండి విచ్ఛిన్నము చేసి దూరముగా నుంచివేసెను. ఎందుకు? మనము ఇచ్ఛాపూర్వకముగా ఆయన దగ్గరకు వెళ్ళి, ఆయనతో కలుసుకొందుమని, మన కాయన కొంత సొత్తు నిచ్చి, దానిపయి మనకు సర్వస్వాతంత్ర్యమును పూర్ణాధికారమును, ఇచ్చివేసెను. ఎందుకు? మనము మనం తట మనమే, 'మనది' అను సర్వస్వమును ఆయన కర్పించి ఆయన యనుగ్రహమును పొందగలుగుదు మని. ఒకసారి, ఆయనకు దూరముగా నుండనియెడల, మనము నిరంతరము ఆయన వశమందే యుండియుందుము. మన హృదయము

నందు ప్రేమోదయమే కాకపోయి యుండును. మనము ఇచ్ఛాపూర్వకముగా, ఆయనను సమీపించితిమన్న మాటయే లేకపోయి యుండును. నాకు, 'నాది' అనునది ఏమియు లేక పోయినయెడల, నేను నా యిష్టప్రకారము నాకే ఉంచుకొనుటకుగాని, ఎవరికయినను ఇచ్చివేయుటకుగాని, నాకు స్వాతంత్ర్యము గలట్టిది, ఏదియు నాకు లేనియెడల, అట్టి నిరర్థకుడనయిన నాకు, ఈశ్వరునకు దానమిచ్చుటకు ఏముండును? ఆయన మనను సమీపించి శూన్యహస్తములతో మరలిపోవలసినదే. కాని, దయానిధియగు పరమేశ్వరుడు, మనను అట్టి జాలికరమైన స్థితియందుంచలేదు. ఈశ్వరుడు మనకేమి దయచేసియున్నాడో, దాని నంతను మనకు సంపూర్ణమయిన స్వాతంత్ర్యముతో నిచ్చియున్నాడు. దానిపయిన మనకు సంపూర్ణాధికారమే. మనయిష్టము. దానిని బాగుచేసుకున్నను సరే, పాడుచేసుకున్నను సరే - ఇట్లేల చేసికొంటివని ప్రశ్నించువారు లేరు. దానిని చక్కగా వాడుకొని సుఖింపవచ్చును. దుర్వినియోగము చేసి కష్టము లనుభవింపవచ్చును. ఎవరికేమి బాధ? ఈశ్వరుడు మనకిచ్చిన దానిపైన మనకింత స్వాతంత్ర్యమున్నది కనుకనే, మనము మన యిచ్ఛాపూర్వకముగా, ఆయనతో నిట్లు విన్నవించగలము. "ప్రభో! నీ నుండియే, నేను 'నాది' అను సమస్తమును పొందగలిగితిని. నీకే దానిని తిరిగి సమర్పించుచున్నాను. నీవు దయచేసి, నేను సమర్పించు నా సర్వస్వమును గైకొనుము. నీవెట్లు జగత్తునకు ప్రభువయి, సూర్యచంద్రాదులను, పృథివ్యాదిభూతములను

శాసించుచున్నావో, అట్లే నా హృదయమునకు సహితము అధినాథుడ వయి, నన్ను సహితము శాసించుము. నా యిచ్ఛను నీ యిచ్ఛకు వశము చేసికొనుము." అని మన మందరము ఆయనతో మనవి చేయగలము మరియు మన యిష్టానుసారముగా మన సర్వస్వమును ఆయనకు సమర్పింపగలము. ఇదే దీని రహస్యము. విశ్వమునందు దేనికిని లేని ఇట్టి అధికారమును, ఇట్టి ఆనందమును, ఆయన మనకు దయచేసిన ఈ స్వాతంత్ర్యమువలననే మనకు లభ్యమయినవి. ఇట్టి విమర్శ వలన, మన జ్ఞానమునకు సంతృప్తి కలిగినది. స్వాతంత్ర్య మనునది మన కెంత అమూల్యమయిన అధికారమో, మన కిప్పుడు తెలిసినది. మనము పృధివ్యాది భూతములవలె, సూర్యచంద్ర నక్షత్రాది గోళములవలె, అంధములగు జడపిండములముగాము. మీరరాని భౌతిక నియమములకు లోనయిన వారముగాము. మన ఆత్మలయొక్క నియమములు జడమును శాసించు భౌతికనియమములకంటె, ప్రశస్తము లయినవి. ఇవి ధర్మనియమములు. ఏది సత్యమో, ఏది మంగళమో, ఏది పవిత్రమో, దానిని మనము తెలిసికొనగలము. సత్యమంగళ పవిత్రతలకు స్థానమయిన పరమేశ్వరునితో మనకు గల ఈ నిత్య సంబంధమును ఎవరును వినాశము నొందింపజాలరు. మన ఆత్మలకు ఏశక్తి గలదో, అది జగత్తునందలి సకలశక్తులకంటెను బలీయము. ఆ శక్తియొక్క ప్రభావమువలననే, మనము, సమస్త ప్రతికూలావస్థలలోను, ధర్మమునందు మనకు విరక్తిని గలిగించు సమస్తఘటనలలోను, ప్రయాణము చేసి, ధర్మము

నందును ధర్మమూర్తియగు పరమేశ్వరునియందును, దృఢవిశ్వాసము కలవారమును, గాఢానురక్తులమును కాఁగలుగుచున్నాము. ఆయన హస్తమునందు మన హృదయమును, మనస్సును, ఇచ్ఛాపూర్వకముగా సమర్పింప గలుగుచున్నాము. మనకు స్వాతంత్ర్యము కలదు గదా యని, స్వేచ్ఛాచారులమయి, ధర్మనియమముల నుల్లంఘించి, విహరించితిమేని, ధర్మనేతయును పాపనుదుడును అయిన, ఆయన నుండి విచ్ఛిన్నులమయి, గొప్పనష్టము ననుభవింతుము. కాని, మన స్వాతంత్ర్యమును సద్వినియోగము చేసితిమేని, మనహృదయమును ఇచ్ఛాపూర్వకముగా ఆయన వశము చేయుటకే మన స్వాతంత్ర్యము నుపయోగించితిమేని, సర్వజ్ఞుడు, సర్వశక్తుడు, దయాస్వరూపుడు నగు ఆయన చెంతజేరి, నిరతిశయానందము ననుభవింపగలుగుదుము. ఆయనకును మనకును గల, ఉచ్చతరసంబంధమును, మరింత గాఢతరముగా చేసికొందుము. ఆయన సమస్త జడజగత్తును నడుపు యాంత్రికుడు. కాని, మనకు తండ్రి. మన మాయన బిడ్డలము. సేవకులముగాము, దాసులముగాము. ఆయన సమస్తజగత్తునకును ఆశ్రయుడు. ఆయనకు మన మెంత సన్నిహితులమో, జడజగత్తునం దేదియు, ఆయన కంత సన్నిహితము కాదు. ఆయనకును మనకునుగల బాంధవ్యమువంటి బాంధవ్యము, ఆయనకును విశ్వమునందు మరి దేనికిని లేదు. కాని, మన మింత సన్నిహితుల మయినను, అనంతకాలము వఱకు ఇంకను సన్నిహితుల మగుచునే యుందుము. ఆయన ఆశ్రయలాభమును అంతకంతకు అధికముగా

పొందుచునే యుందుము. ఆయన సమస్త జీవరాసులను ప్రేమించుచున్నాడు, మనను ప్రేమించుచున్నాడు. కాని, మననుండి ప్రతిప్రేమను ప్రతీక్షించుచున్నాడు. కనుక, మన మందరమును కలిసి, ఆయన పాదములను ప్రేమపుష్పములతో పూజింతము. ఓ పరమాత్ముఁడా! నీవు నీ అవ్యాజ ప్రేమచే మమ్ము స్వతంత్రులనుగా సృజించితివి. మమ్ము పరిత్యజింపకుము. మా యావద్వ్యాపారము నీది, నీవే మా సహాయసంపత్తి. నీవే మాతల్లివి, తండ్రివి, గురువవు. సఖుడవు. సకలమును నీవే. మేము నీశరణాపన్నుల మగుచున్నాము. మాకు నీ సుందర ప్రసన్న ముఖమును ప్రదర్శించుము. నీ ప్రేమవారిచే మా హృదయములు పవిత్రములు గావింపుము. మా యావజ్జీవము, నీకు హితమయిన మంగళకార్యములు చేయుటయందే గడుప గల్గు నంతటి వజ్రసంకల్పమును, మా కనుగ్రహింపుము.

ఓమ్. ఏక మేవాద్వితీయమ్.

---

ఓమ్ తత్సత్,

# మహర్షి మహోపదేశములు



## ౨౦ ఉపదేశము

యోవై భూమా, తత్సుఖం, నాల్పే సుఖమస్తి.

ఏది సర్వాధిక వస్తువో, దేనికంటె అధికమయినదిగాని, దేనితో సమానమయినది గాని మరియొకటి లేదో, దాని నాశ్రయించిననే, శాశ్వతమును, నిరతిశయమును అగు సుఖము

లభించును. ఏది అల్పమయినదో, అశాశ్వతమయినదో, దాని నాశ్రయించిన యెడల, అల్పమును తాత్కాలికమును అగు సుఖము మాత్రమే కలుగును. మొదటిది బ్రహ్మానందము, రెండవది విషయానందము.

అనేకభయములతో నిండియుండు ఈ సంసార సాగరమును సుఖముగా దాటవలె నను సంకల్పమే మీకున్న యెడలను, దానికి అవతలిగట్టున నుండెడు భయరహితమగు బ్రహ్మపదమును పొందవలె నను తీవ్రేచ్ఛయే ఉన్నయెడలను, మహాత్ముడగు పరమేశ్వరుని వైపునకు మీ లక్ష్యమును మరల్పుడు. ఈ క్షణమునుండియు ఆ జగదేకరక్షకునియందు మీ జీవితములను సంపూర్ణముగా నర్పింపుడు. మీ జ్ఞానమును ప్రజ్వలితము గావించి ఆయన మహాసత్యములను అవగాహనము చేసికొనుడు. మీ ప్రేమను వ్యాపింపచేసి, ఆ ప్రేమ స్వరూపునియం దర్పింపుడు. మీయిచ్ఛాశక్తిని బలయుతము గావించి ఆ మంగళమయుని యిచ్ఛతో నమ్మేళనము గావింపుడు. ఆయన సత్యములను తెలుసుకొనుటకే మీ సమస్త జ్ఞానశక్తుల నుపయోగింపుడు. లోకములోని సమస్త వస్తువుల కంటెను, మీ శరీరముకంటెను, మీ ప్రాణముకంటె సహితము, ఆయననే అధికముగా ప్రేమింపుడు. ఆయనకు హితమయిన కార్యములు తప్ప, మరివేనిని మీ రిచ్ఛయింపకుడు, మీ మనస్సును, మీ హృదయమును, మీ యిచ్ఛాశక్తిని ఆయన వశము చేయుడు. ఆలోచించిన ఆయనను గురించియే ఆలోచింపుడు; ప్రేమించిన ఆయననే ప్రేమింపుడు, ఇచ్ఛ

యించిన ఆయన కిష్టమయిన దానినే యిచ్ఛయింపుడు. సంపూర్ణముగా ఆయనకు శరణాపన్నులు కండు. మనము మనశరీరమునుగాని, మన మనస్సునుగాని, మన స్వశక్తి వలన పొందలేదు. 'మనది' అనునది మన కేమేమి కలదో, మనకు దేనిదేనిపయిన అధికార మున్నదో, దాని నెల్లను ఆ పరమేశ్వరు నుండియే, మనము పొందితిమి. మనకు గల స్వాతంత్ర్య మను అమూల్యమైన అధికార మేది కలదో, అది సహితము. ఆయన అనుగ్రహించిన వరప్రసాదమే. ఈ పరమ రహస్యమును మన మింత స్పష్టముగా గ్రహింపగలుగుట, ఆయన కరుణచేతనే. కావున, మన మీ క్షణమందు చేయ దగిన పని యేమి? మనము ఈశ్వరునుండియు, ఆయన ధర్మము నుండియు, విడిపోయి, మన నీచభావములలో మునిగి, రాత్రిం బగళ్లు శోకమోహములలో బడి కుందుచుండ వలసినదేనా? లేక, మనంతట మనము, ఇచ్ఛాపూర్వకముగా, ప్రేమతో, 'మనది' అను సమస్తమును, ఆయనకు సమర్పించి ఆ మహా త్యాగముచే మన హృదయములయం దావిర్భవించు మహా నందము ననుభవింతమా? అల్పాశ్రయమువలన మనకు సుఖము లేదు. ఈ ప్రపంచము తనకు గల సర్వస్వమును మన కిచ్చియు మనకు తృప్తి కలిగింపజాలదు. ఆజ్యాదిహవిస్సులు హోమము చేసినకొలదిని, అగ్నిహోత్రము మరింత ప్రజ్వరిల్లినట్లు, ప్రాపంచిక భోగముల ననుభవించిన కొలదిని, తృష్ణానివారణ మునకు బదులు, తృష్ణాభివృద్ధియే అగుచుండును. ఐహికైశ్వ ర్యములయందు శాంతి లేదు. మనము ఎండమావులవంటి సాం

సారిక సుఖముల వెనువెంట పరుగు లెత్తుచున్నాము. పరు గెత్తిన కొలదిని, పగర్పు ఆయాసమే కాని, మన దాహ శాంతికయి బిందుమాత్రజల మయినను పొందలేక పోతిమి. ఈ సంసారములో, మాటి మాటికి, దెబ్బలు తిని తిని, తుదకు ఆ యమృతనికేతనుని చెంత చేరవలసినదే. దుఃఖ ముచే కృశించి కృశించి తుద కా సుఖసాగరుని శరణు వేడ వలసినదే. అల్పవిషయములయందు సుఖము లేదని, మన అనుదిన జీవితముయొక్క అనుభవమువలన, మనకు తెలియ వచ్చుచున్నది. ఇక్కడ సుఖము లని చెప్పబడు సమస్తమును, తుదకు దుఃఖముగానే పరిణమించుచున్నవి. మన మాత్మ బంధువు లనుకొని, ఆలింగనము చేసుకొన్నవారే, తుదకు శత్రువులుగా మారిపోవుచున్నారు. ఈ సంసారము సుఖము లకు స్థానభూతము కాదు. ఈశ్వరు డీసంసారమును సుఖనిలయ ముగా చేసి యుండలేదు, ఉద్దేశించియుండలేదు. ఆయన మన నీ సంసారమునందు ప్రవేశపెట్టినది, దీనియందలి సుఖదుఃఖ ములలోను ఉచ్ఛనీచావస్థలలోను, సకలపరిస్థితులలోను, శిక్ష నొంది, ఇక్కడి యనుభవముల నన్నిటిని చక్కగా గ్రహించి, తుదకు ఆయన యొడియందు చేరుదుమనియే. ఈ భౌతిక ప్రపంచమును, ఆయన మనకు శాశ్వత నివాసముగా నేర్పరచి యుండలేదు. మన మిందు ప్రయాణికులము, యాత్రికులము, కాపురస్థులము కాము. మన చిరనివాసము, ఆ యమృత నికేతనునియందే. ఇక్కడకు వచ్చినది, ఇక్కడ స్థిరవసతుల నేర్పరచుకొని, మన అనంతజీవితమును ఇక్కడనే గడుపుటకు

కాదు. ఇక్కడ మనము విషయములతో నిరంతర సంగ్రామము సలిపి, విషయరాజ్యమునందు అడుగడుగు చొప్పున, విషయరంగము నంతను స్వాధీనపఱచుకొనవలయును. విషయ ప్రపంచమా మహావిశాలము. శత్రువులా, మహా భయంకరులు, మాయావులు. యుద్ధము చేయు టెట్లు? శత్రుసంహార మెట్లు? మన వైపునకు, మన బలము వైపునకు, ఒక్కసారి మన దృష్టిని మరల్చితిమేని, మన దౌర్బల్యము, మన భీరుత్వము, సమస్తమును నిరుత్సాహజనకము లే. జయము కలలోనివార్త. అపజయమే నిశ్చయము అని తోచును. కాని, మన జీవిత భారమును మనమీద పెట్టుకొనక, మన జీవితము నాయన కర్పించి, యావద్భారమును ఆయన మీదనే ఉంచగలిగితిమేని, మన హృదయములయందు ఆ ధర్మమూర్తి దివ్య బలమును, దివ్యోత్సాహమును ప్రేరణచేయును. సుఖసంపదలకంటె, దారిద్ర్యమే, కష్టములే, దుఃఖములే, మనల నా పరమేశ్వరుని సన్నిధానమున చేర్చుట కెంతో తోడ్పడుచున్నవి. దీన హృదయముతో, పశ్చాత్తప్తమానసముతో, మనము విడిచిన కన్నీళ్లే, మన ఆత్మోద్యానమునందలి ధర్మవృక్షములకు జీవనము నిచ్చి, మనల నభ్యున్నతి నొందించి, ఈశ్వరాభిముఖముగా జేయుచున్నవి.

మీరు మీదనుకొను సమస్తమును ఈశ్వరున కర్పింపుడు. జ్ఞానములో, ప్రేమలో, ఇచ్ఛలో, ఆ సత్య శివసుందర స్వరూపుడగు పరమేశ్వరునితో సమ్మేళన మగుడు. మనకు సర్వస్వమును దయచేసిన మన జీవనవల్లభునకు, మన యిచ్ఛా

పూర్వకముగా, కృతజ్ఞతాభివందనములతో, తిరిగి, మన సర్వస్వము సమర్పింపలేక పోయినయెడల, మనకు స్వాతంత్ర్యము వలని లాభమేమి? నేను గాకపోయిన, రేపయినను, ఈ సమస్తమును మనము విడిచిపెట్టి పోవలసినదే. భూమండలాధిపతి యయినను, తన యావదైశ్వర్యమును ఇక్కడ విడిచిపెట్టి పోవలసినదే. గుడ్డి గవ్వైనను మనవెంట రాదు. ఎప్పుడో ఒకప్పుడు, మనము తలచుకొని తలచుకొని మురియుచున్న, ఈ ధన మాన యశస్సుల దగ్గర, ఈ బల కుల పాండిత్య గర్వముల దగ్గర, సెలవు పుచ్చుకొని, ఈ ప్రపంచమునుండి తరలిపోవలసినదే. ఇప్పుడు జీవించియున్నా మనుట యెంత నిశ్చయమో, ఇక కొంతకాలమయినను, ప్రయాణమయి పోదుము అనుటయు అంత నిశ్చయమే. కొంత కాలమయిన తర్వాత, నా యీ వాక్కు స్తంభించి పోవును. ఈ కర చరణాద్యవయవములు నిస్సారము లయిపోవును. ఈ మనస్సు శూన్య మయిపోవును. నిస్సహాయుడ నయి, నే నొక్కడనే మిగిలిపోదును. నేను మనఃపూర్వకముగా, ఈశ్వరునికొఱకు, ఏ మేమి విడువలేకపోతినో, ఏయే శక్తులను ఈశ్వరునికి హిత మయిన కార్యములయందు వినియోగింపలేకపోతినో, వాని నన్నింటిని మృత్యుదేవత, నానుండి బలత్కారముగా లాగి వేయును. అప్పుడు ప్రాణమిత్రులుగాని, ఆత్మబంధువులుగాని, అడ్డము వచ్చి, అణుమాత్రమును సాహాయ్యము చేయజాలరు. సోదరీ సోదరులారా! జాగ్రత్తపడుడు. మీ హృదయము అంధకారావృతము గాకమునుపే, మీ హృదయమునందు

జ్ఞానజ్యోతి వెలుగుచుండగానే, ఈశ్వరునుండి మీ రేమేమి పొందితిరో, వాని నెల్లను ఆయనకు సమర్పించి, అనంత ఫలమును గైకొనుడు. అస్థిరములు, అకించిత్కరములు అగు వస్తువుల నర్పించి, వానికి బదులుగా, అమూల్యము, అక్షయము అగు ధనము నార్జింపుడు. మీ జీవశక్తి చల్లారకమునుపే, మీరు సర్వసంపదలతో తులదూగుచుండగానే, మీ ప్రాణమును, మనస్సును, సర్వస్వమును, మీ యిష్టానుసారముగా ఆయన కర్పించి ధన్యు లగుడు. మన యీ తుచ్ఛ జీవితములను, ఆయన హస్తములం దుంచితిమేని, ఇవే అమూల్యములు, అక్షయములు అగును. ఆయన యనుగ్రహమును సంపాదించుటకు మనము చేసెడు ఏ త్యాగమయినను త్యాగమనిపించుకొనునా? ఈ సమస్తమును ఆయనకై త్యాగము చేసి, మనము బిందుమాత్రి త్యాగానందమును పొందగలిగితిమేని, ఈశ్వరుని అనుగ్రహమును లేశమాత్రమయినను ఆర్జింపగలిగితిమేని, ఆ యానందమును చవి జూచినప్పుడు, మనము చేసిన త్యాగమునకయి సంకోచింతుమా! ఇప్పుడు మన హృదయమునం దుండెడి సమస్తకామములును, ఈ సంసారమునందలి సమస్త క్షుద్రవిషయములతో, పెనవేసికొని యుండుటచే, మనము సులభముగా వానిని త్రెంపుకొనలేక యున్నాము. కాని, ఒక్కసారి మన హృదయములయందు, ఆయన యావిర్భావమును దర్శింపగలిగిన యెడల, ఒక్కసారి ఆయన మంగళచ్ఛాయయందు విశ్రాంతి నొందగలిగితిమేని, మన హృదయగ్రంథు లన్నియు శిథిలము లయి

పోవును. ఆయనకొఱకు త్యాగము చేయుట అత్యంత సులభముగా కానవచ్చును. "ఆయన ప్రసన్నముఖమును దర్శించుటకు, నా సర్వస్వము ఇచ్చుట అనగా నెంత ? ఆయనకు సమర్పించుటకు అర్హమయినది నాదగ్గర ఇంక నేమియు లేక పోయెనే" అని నాకు గర్వభంజనమయి, సిగ్గుచే తల వంచుకొనవలసి వచ్చును. అప్పుడు ఈ ప్రపంచముయొక్క పయిమెరుగులు, లోపలి నిస్సారత, కన్నులకు కట్టినట్లు ప్రత్యక్షమయి, "ప్రభూ! పరమేశ్వరా! నిన్ను నా హృదయమునందు చిరకాల మెట్లుంచుకొనగలను! నీవు నా సమస్తమును గ్రహించుము. నన్ను నీ దగ్గర నుండనిమ్ము, నాకు నీ పాదములదగ్గర కొంచెము చోటిమ్ము" అని ఆయనను వేడుకొందును. కాని, మనము నీచస్వభావుల మగుటచే, ఉపాసనయొక్క పరక్షణమందే, తిరిగి సంసారముయొక్క ఆకర్షణముచే, మోహపరవశుల మగుచుందుము. ఈశ్వరుని గురించిన సమస్త మంగళభావములును, వేసవికాలపు నదీజలమువలె, మన హృదయము నుండి ఎగిరిపోవును. తిరిగి ఆయననుండి విచ్ఛిన్నులమయి, దూరముగా నుండిపోదుము. ఉపాసనాకాలమందు మనల నుజ్జ్వలాత్మ లూగించిన దివ్యావస్థ స్వప్నప్రాయ మగును. కలగాంచి మేలుకొన్నట్లగును. కాని, బ్రహ్మధర్మముయొక్క ప్రసాదము వలన మనమొక అమూల్యసత్యమును కనుగొంటిమి. మనము ఎడతెగక కృషి చేయుచుంటిమేని, మన ప్రయత్నము లెన్నడును విఫలములుగావు. ఈశ్వరు డెప్పుడును మనకు విముఖుడు కాడు. ఈ సత్యమును మనము మన ప్రతి

దినానుభవము వలననే కనుగొనుచున్నాము. ఓ సాధు యువకులారా! మీ దుర్బలత్వమును జూచుకొని, మీ రెందుకు కించ నొందెదరు? మీ రెంతమాత్రమును నిరాశులు కావ లదు. మీకు ఆత్మశోధన గావించుకొని, హృదయమును పరి శుద్ధము గావించుకొనవలె నను నిజమయిన దృఢసంకల్పమే యున్న యెడల, అంతకంటె వాంఛింపదగినది మఱియేమున్నది? మీ యభీష్టము తప్పక నెఱవేరును. మీ కే సాధు సంకల్పము కలదో, ఈశ్వర సంకల్పమును అదే. ఆయనయొక్క ప్రీతి సంతానమును, ధర్మమునందును, పవిత్రతయందును, వర్ధిల్లవలె ననియే ఆయన కోరిక. ఆయన స్వయముగా తన ప్రియ సంతా నముయొక్క హృదయములయందు పవిత్ర జీవనముయొక్కయు, ఉన్నతాదర్శములయొక్కయు, దివ్యవాహినుల ప్రవహింప జేయుచున్నాడు. మనము మన హృదయమందిరమునందు ఆయన లేకుండ జూచి, దానికి ఇనుప తలుపులు తగిలించి, పెద్ద గడియలతో బిగించుకొని యుండనియెడల, ఆయన యెన్నడును మనకు దూరముగా నుండజాలడు. అప్పటికిని, ఆయన పుత్రి వాత్సల్యముచే మనతోడి ఎడబాటును సహింపజాలక, తలుపు లెప్పుడు తెఱతురా, ప్రవేశమెప్పుడు దొరుకునాయని, ద్వారము కడనే వేచియుండును. ఆయన దయాసముద్రమునకు పారము లేదు. సోదరీ సోదరులారా! ఆయనయందు మీ హృదయ మును, మీ మనస్సును, సమస్తమును సమర్పింపుడు. మాయ మర్మము లెరుగని నిష్కల్మషహృదయముతో, ఆయనను సమీ పింపుడు. మీ కాయన తప్పక స్వాగత మొసంగును. లోకము

నందు ఏ తండ్రియయినను, బిడ్డ సమీపించినప్పుడు, ఎత్తుకొని ముద్దాడక, విముఖుడయి యూరకుండగలడా? మన తండ్రులకు తండ్రి, జగదేకపిత, మనము సంపూర్ణహృదయముతో ఆయ నను ప్రేమింపబోయినప్పుడు, ఆయన తన నిర్దాక్షిణ్య భావ మను శీతలవారితో, మన హృదయమునందలి ప్రేమాగ్నిని, చల్లార్చివేయునా? మన మాయన ధర్మరక్షణార్థమయి, ప్రాణ ములను సహితము గోల్పోవుటకు సంసిద్ధముగా నుండగా, ఆయన మనకు తన అమోఘసాహాయ్యమునంపక, నిరసన భావముతో చూచుచు నూరకుండునా? మనము పాప తాప ములనుండి ఉద్ధరింపబడగోరినప్పుడు, ఆయన, మనకు చేయూత నిచ్చి, పాపపంకము నుండి ఉద్ధరింపడా? మన మాయన సన్ని ధిని చేరి, మన కృతఘ్నతకు, మన యపవిత్ర జీవితమునకు, కన్నీ రోడికగట్టునట్లు ఏడ్చుచుండగా, ఆయన తన ప్రేమహస్తము లతో మన కన్నీళ్ళను తుడిచి, దుఃఖోపశమనము చేయక యూర కుండగలడా? మన మాయనకొఱకు బెంగపెట్టుకొని, ఆయన ముఖసందర్శనమునకయి తపించుచున్నప్పుడు, ఆయన తన ముఖ చంద్రుని మనకు ప్రదర్శించి, మన హృదయతాపమును చల్లార్చడా? అట్లెన్నడును కాజాలదు. ఆ కరుణాసింధువు, ఆ దీనబాంధవుడు, ఆ శరణాగతవత్సలుడు, అట్లెన్నడును ఊరకుండ జాలడు. అట్లూరకుండుట ఆయనకు స్వభావవిరు ద్ధము. ఆయన కభిముఖముగా మన మొక్క అడుగు ముందుకు పెట్టగలిగితిమేని, ఆయన వేయి అడుగులు ముందుకు వచ్చి మనను కౌగిలించుకొనును. మన మాయనను బిందుమాత్రము ప్రేమించినయెడల, ఆయన తన ప్రేమసింధువును మనపయి

ప్రవహింపజేయును. అహా! నిష్కల్మష హృదయముల యందు ఆయన తన ప్రేమసుధను ఎట్లు వర్షింపజేయుచున్నాడు! రండు! సోదరులారా! రండు! మనమందరమును, సరళహృదయములతో ఆయనను సమీపింతము. మన నీచ ప్రవృత్తులను మలినభావములను విడిచి, ఆయన యెదుట నిలబడి ఆయనతో నిట్లు నివేదింతము. "ప్రాణేశ్వరా! నీవు మా జీవనమునకు జీవనమవు. జ్యోతుల కెల్లను జ్యోతివి. మాకు నీ ప్రసన్నముఖమును ప్రదర్శింపుము. మా హృదయములను నీ వైపున కాకర్షించుకొనుము. మేము నీకు దూరముగా పోజాలకుందుముగాక! నిన్ను మా హృదయమునుండి ఎన్నడును దూరముగా నుంచకుందుముగాక! ఈ శుభముహూర్తమునుండియు, మా సమస్తనీచప్రవృత్తులను, మలినభావములను పరిత్యజించుచున్నాము. మేము సంపూర్ణముగా, నీ యధీనుల మగుచున్నాము. నీ యనుగ్రహమును ప్రాణపదముగా సంరక్షించుకొందుము గాక! నీ మంగళ భావములనే మా హృదయములయందు ధారణచేయుదుము. ఇక ఈ సంసారముయొక్క ఆకర్షణములో చిక్కుకొని మోహజాలములో పడకుందుముగాక! అనుదినమును నీ వైపునకు ఉన్నతి నొందించుము. నీ కండ్లయెదుటనే మా జీవితమును గడుపనిమ్ము. నీ హస్తమునందే మాజీవితమును సమర్పించుచున్నాము. మా సర్వస్వమును నీవే గైకొనుము" అని నివేదింతము. దయానిధి యగు పరమేశ్వరుడు మన ప్రార్థనల ఫలింపజేయును గాక! ఓమ్ ఏకమేవాద్వితీయమ్.

---

ఓమ్ తత్సత్.

# మహర్షి మహోపదేశములు



## ౨౧. ఉపదేశము

ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్
తేన త్యక్తేన భుఞ్జీథాః మాగృధః కస్యస్విద్ధనం.

ఈ జగత్తునందు ఏమేమి కలదో, అదంతయు ఈశ్వరునిచే వ్యాప్తమయి యున్నది. ఆయన త్యాగమునే అనుభవింపుడు. ఎవరి ధనమును ఆశింపకుడు.

కోడి తన పిల్లలను రెక్కలక్రింద దాచి సమస్త అపాయములనుండియు ఎట్లు సంరక్షించునో, అట్లే పరమేశ్వరుడు ఈ యనంత విశ్వమును తన శక్తిస్వరూపపక్షముల క్రిందనుంచి సంరక్షించుచున్నాడు. సమస్త జగత్తును ఈశ్వరశక్తి చేతనే ఆచ్ఛాదితమయియున్నది. అణువు మొదలుకొని, బ్రహ్మాండము వఱకును ఆయన సత్తాతో పరిపూర్ణమయి యున్నది. జడ ప్రపంచమునందు, ఆయన పడుగుపేకలవలె వ్యాపించి యున్నాడు. జీవాత్మయందు, ఆయన విడదీయ రాకుండునట్లు, కలిసి మెలసి యున్నాడు. ఆయన యాశ్రయమును విడిచినయెడల, సమస్త జడప్రపంచమును నిమిషములో లోపించిపోవును. ఆయనను విడిచినయెడల, జీవుల మానసిక క్రియలన్నియు, అంతరించును. హృదయములయందలి ప్రేమాగ్నులు చల్లారిపోవును. ఆత్మజీవనము వినాశము

నొందును. ఆయన శక్తియందే మనయందరి శక్తియు, ప్రకా శించుచున్నది. ఆయన ప్రాణస్వరూపుడయిన, మనయందరి యందును, ప్రకాశించుచున్నాడు. గనుకనే, మనమందరమును జీవించుచున్నాము. ఇంద్రియగోచరుడు కాకపోయినను మన ఈశ్వరుడు శూన్యవస్తువుకాడు. ఎవరి ఆశ్రయమును జల నుండి విచ్ఛిన్నమయిన యెడల, మన ఆధ్యాత్మిక జీవనము శుష్కించిపోవునో, ఆయనను మనము మన ప్రాణస్వరూపునిగా దర్శింపవలెను. అతడు మన మనసులో మన మూహించుకొన్న ఒక కల్పిత పురుషుడు కాడు. సోదరులారా! అతడు శూన్య వస్తువుకాడు. కేవలము గుణసముదాయము మాత్రమే కాడు. అతడు కేవలము శక్తివిహీనమయిన ఒక జ్ఞానముగాని, జ్ఞాన విహీనమయిన ఒక అంధశక్తిగాని కాడు. గుణమెప్పుడును వస్తువును విడిచి స్వాతంత్ర్యముగా నుండజాలదు. ఆయన అనంత జ్ఞాన సమన్వితుడును, మహాశక్తిసంపన్నుడును, మంగళ భావ పరిపూర్ణుడును, అగు ఒక మహాపురుషుడు. సత్యమునకు ఆకరుడు. సకలాత్మలకును ఆశ్రయుడు. మనకందరకును ప్రియ జనకుడు. ఆయనతోకంటె మరెవ్వరితోను మనకట్టి జీవత్సం బంధములేదు. ఆయన ఇంద్రియాతీతుడు. మనయొక్క యే యింద్రియమునకును గోచరుడుకాడు. ఇంద్రియముల ద్వారా మన మాయనను దర్శింపజాలము. కాని, ఆయనను దర్శించు టకు మన హృదయము యొక్క వందలకొలది ద్వారములు తెరువబడి యున్నవి. ఆ పరమపిత ఇక్కడనే యున్నాడు. మన హృదయమునందే యున్నాడు. ఈ యనంతాకాశము

ఆయన సత్తాతో పరిపూర్ణమయి యున్నది. మనశరీరము నందు మన ఆత్మ ఎట్లు ఓతప్రోతభావముగా, వ్యాపించి యున్నదో, అట్లే, ఈ విశ్వమునందు ఆయన ఓతప్రోతభావ ముగా వ్యాపించియున్నాడు. ఆయన, శక్తిస్వరూపుడయి మన హృదయములయందు వాసము చేయుచున్నాడు. ఎవని యొక్క జ్ఞానముతో, శక్తితో, మంగళభావముతో ఈసమస్త జగత్తును పరిపూర్ణమయి యున్నదో, అతడే మనలో మన ఆత్మలకు ఆత్మయయి, ప్రకాశించుచున్నాడు. ఆయనవలె, మనకు అంత సన్నిహితమయిన వస్తువు మరియొకటి లేదు. ఆయనతో పోల్చినయెడల, మిగిలిన సకలమును మనకు దూరమునందే యున్నవి. ఆయనకు మన హృద యమునందు ఎట్టి ప్రవేశము కలదో, అట్టి ప్రవేశము లోకము నందు మరెవ్వరికిని లేదు. మన ప్రాణమిత్రులు, ఆత్మబంధు వులు, సహితము మన హృదయమునందు ప్రవేశింపజాలరు. వీరందరును శరీరమునకు బాహ్యమునందుండియే, మనతో వ్యవహారము జరుపుచుందురు. తల్లి, బిడ్డయొక్క అంతరంగము నెరుగజాలదు. బిడ్డ, తల్లియొక్క అంతరంగము నెరుగ జాలదు. భార్య, భర్తయొక్క హృదయము నెరుగజాలదు. భర్త, భార్య యొక్క హృదయము నెరుగజాలడు. వీరందఱును ఒకరి యభి ప్రాయముల నొకరు తెలిసికొనుట, ఒకరి సుఖదుఃఖముల నొకరు తెలిసికొనుట, మాటలు, చూపులు, ముఖలక్షణములు మొదలగు బాహ్యచిహ్నముల వలననే ఒకరును ప్రత్యక్షముగ, యథార్థముగ, హృదయమునందు ఉన్నదున్నట్లు తెలుసుకొన

జాలరు. అట్లు తెలిసికొనగలవాడు, హృదయ మధ్యమున ప్రవేశించి, సమస్త చిత్తవృత్తులును గ్రహింపగలవాడు, పరమేశ్వరు డొక్కడే; హృదయేశ్వరు డను నామము ఆయనకే సార్థకము. ఆయనకును మనకును ఆకాశమాత్రపు ఎడమయినను లేదు. ఆయన ఆత్మయందు ప్రవేశించి, సర్వత్ర వ్యాప్తమయి యున్నాడు. ఆయన నిరాకారు డన్నమాట సత్యమే. ఆయనకు మనవలె శరీరముగాని, ఇంద్రియములుగాని లేవు. అయిన నేమి? నిరాకార మనగా శూన్యమని అర్థము కాదు. నేను నన్ను తెలుసుకొన్నప్పుడు, మీరు మిమ్ము తెలుసుకొన్నప్పుడు, మనము మనలను శూన్యముగా తెలిసికొనుచున్నామా? మన ఆత్మలు నిరాకారములుగదా యని, మనము మనలను తెలుసుకొనజాలకున్నామా? ఎవరయినను తన శరీరమే తానని అనుకొనుచున్నారా? ప్రతివాడును తాను తన శరీరముకంటె భిన్నుడ ననియు, అద్భుతశక్తియుతమగు, ఆత్మ యను ప్రసిద్ధనామము గల ఒక వ్యక్తిననియు, తన స్వరూపమును గురించి, తాను, ప్రత్యక్షానుభవమువలన తెలుసుకొనుట లేదా? అట్టి విషయములో, నిరాకారుడును, పరమాత్మస్వరూపుడును, మన సమస్త జీవనమునకును ఆశ్రయదాతయు, నగు పరమేశ్వరుని మన మేల తెలుసుకొనజాలము? కొంచె మాలోచించిన యెడల తన్ను తాను తెలుసుకొన లేనివా డుండడు. తన్ను తాను తెలుసుకొనుట, పరమేశ్వరుని తెలుసుకొనుటకు ప్రథమ సోపానము. నా సమస్త శక్తులును పరిమితము లని నేను తెలుసుకొన్నప్పుడు, నేను ఒక దానిలోను అనంతుడను

కానని తెలుసుకొన్నప్పుడు, నా పరిమితత్వముయొక్క జ్ఞానముతోపాటు, అనంతత్వముయొక్క జ్ఞానము సహితము, సమ్మిళితమయి యున్నది. పరిమితత్వముయొక్కయు, అనంతత్వము యొక్కయు భావములు, నాలో చూచాయగానైనను ఉండనియెడల, నేను పరిమితుడను, అనంతుడను కాను, అని నేననుకొనజాలను. దుఃఖజ్ఞానముతోపాటు సుఖజ్ఞానమును, చీకటియొక్క జ్ఞానముతోపాటు వెలుగుయొక్క జ్ఞానమును, నీడయొక్క జ్ఞానముతోపాటు ఎండయొక్కజ్ఞానమును, ఇట్లే, సమస్త ద్వంద్వములయొక్క జ్ఞానములును, సమ్మిళితములయి యుండును. ఒకదానిని విడిచి మరొక టుండదు. అట్లే అపరిమితత్వముయొక్క జ్ఞానము సహితము, పరిమితత్వముయొక్క జ్ఞానముతో పెనవేసుకొని యున్నది. గనుకనే మన పరిమిత జ్ఞానము అనంతజ్ఞానమును ప్రకాశింప జేయుచున్నది. పరిమితములయిన మన ప్రేమ భావము, మంగళభావము మొదలయినవి నిష్కళంకుడు, పరిపూర్ణ పవిత్ర స్వరూపుడు, మంగళమయుడు, ప్రేమమయుడు, అగు ఆపరమపురుషుని వైపునకు మనను తీసుకొని పోవుచున్నవి. మన యీశ్వరుడు అనంతుడు ఆదిమధ్యాంతరహితుడు, అని బ్రాహ్మ ధర్మము ఘోషించుచున్నది. ఎవడు సీమరహితుడో అనంతుడో, విశ్వవ్యాపియో, ఆ మహాత్ముడే, మన యీ క్షుద్ర హృదయ కుటీరములయందు సహితము, తన అచింత్య మహిమచే సంపూర్ణుడయి యున్నాడు. ఆయన మంగళ భావ మనంతమయినను, దానికి మన క్షుద్ర జీవితములయందు

సహితము, సంపూర్ణ ప్రకాశము కలదు. ఆయన సర్వవిధముల, అనంతుడయినను ఆయననుగురించి కొంతవర కయినను మనము తెలుసుకొనగలము. ఆయనను మన శక్తికొలదిని ఆరాధింప గలము. మన మర్పించు భక్తిశ్రద్ధలు, ఒక మనఃకల్పితపురుషు నకు కావు. కలలో జూచిన ఒక మాయామయునకు కాదు. ఒక శూన్యవ్యక్తికి కాదు. విశ్వాశ్రియుడగు ఒక సత్యపురుషు నకు. అనాదికాలమునుండియు, భగవద్భక్తుల ప్రేమగీతము లన్నియు అరణ్యరోదనములు కావు. అట్లే అయిన యెడల, మన కీశ్వరు డుండి ఏమి ప్రయోజనము? అత డుండినను ఒకటే, లేకున్నను ఒకటే, కాని, అది వాస్తవము కాదు. ఆయనకును మనకును గల సంబంధము అత్యంతసామీప్యసంబంధము. నిజము విచారించినయెడల, ఆయనకంటె సన్నిహిత బంధువు మనకు మరొకడు లేడు. ఆయన సమస్తజగత్తునకును ప్రభువే. కాని, మనకు తండ్రి. ఆయన సమస్త ఆకాశమునకును అతీ తుడు. కాని, మనలో ప్రతివారికిని అత్యంత సమీపమున నున్నాడు. ఆయనతో మనకు గల సహవాసము ఒకప్పుడుండి ఒకప్పుడు లేకపోవునది కాదు. అతడు మనకు నిత్యసంగి. నన్ను నే నెప్పుడు చూచుకొందునో, అప్పుడే, ఆయనను నా కాశ్రయునిగా చూచుచున్నాను. మన కెంతో దూరమున నున్న సూర్యునుండి, ఇంకను దూరముగా నుండు మరియొక సూర్యునిలోగాని, మన కత్యంత దూరమునం దుండెడు నక్ష త్రముకంటె, ఇంకను దూరాతిదూరమునం దుండెడు మరి యొక నక్షత్రములోగాని, ఆయన సింహాసనము ప్రతిష్ఠింపబడి

యుండ లేదు. సురమ్యమగు ఆయన యమృతనికేతనము మన హృదయములయందే. ఆయన జ్ఞానమునకు ఆకరుడు. నా జ్ఞానమునకు పుష్టినిచ్చు అన్నము వంటి వాడు. ఆయన చిరంతన ములును శాశ్వతములును అగు సత్యభావముల కన్నిటికిని, ఆశ్రియస్థానము. ఆయన అవినశ్వరము లగు సకలధర్మముల కును సంస్థాపకుడు, ప్రతిష్ఠాత.

మన ఆత్మేశుడగు, మన హృదయధన మగు అట్టి పర మేశ్వరుని మన మేల చూడలేకున్నాము? మనకును ఆయనకును గల యెడ యెంత? మన అహంకారమే యెడము. మన విష యేచ్ఛలు, మన భోగవిలాసములే యెడము. ఆయనకును మనకును, ఆకాశమునకును మనకునుగల యెడ మయినను లేదు. మన స్వార్థపరత్వము, కుటిలభావములు, అహంభావము- ఇవే మనను ఆయననుండి దూరము చేయుచున్నవి. "పాపపంకము నుండి, మీ హృదయమును నిర్మలము చేసికొనుడు, విషయ వాంఛలను పరిత్యజింపుడు, బ్రహ్మానంద మనుభవింపుడు" అని బ్రాహ్మధర్మ మాదేశించుచున్నది. మన మపవిత్రు లముగానే నిలిచియున్న యెడల, ఆ పరమపవిత్రుని చేర గలుగుదు మను ఆశ యెక్కడిది? ఆయనను పొందవలయునను వ్యాకుల హృదయ మెట్లు కలుగును? మనము పాపచింతలచే నీచుల మయి, దీనులము హీనులము అయి, ఈశ్వరుడు మన కేసి చూచుట లే దనుకొందుము. కనుకనే, మన హృదయ నాథు డగు పరమేశ్వరుని మన హృదయముల యందు చూడ లేకుందుము. ప్రేమవిరహితుల మయి, మనహృదయములనుండి

మన మాయనను త్రోసి వేసినను, ఆయన నిరాశ చెందక, మన హృదయములయం దెప్పుడు ప్రవేశింతునా యని, హృదయ ద్వారమున ఆయన యెట్లు వేచియుండునో, ఎన్నెన్ని విధముల ప్రయత్నించుచుండునో, మన మప్పుడు తెలిసికొన జాలము. ఈశ్వరుని మీ సమీపమున చూడ దలచితిరా, హృదయమును పవిత్రము చేసికొనుడు. హృదయమునం దేమూల నయినను, ఏ పాపలేశ మయినను, గూఢముగా దాగియున్న యెడల, శోధించి శోధించి, దానిని తరిమి వేయుడు. అప్పుడే మీ రాయన ప్రసన్నముఖమును దర్శింపగలరు. పాపలేశము లున్నను, అవి కొలదికాలములోనే కొండంత లయి ఈశ్వరుని మనకు మఱుగు పరచును. ఈశ్వరుడు మనలో నెవ్వరిని దూరముగా నుంచి, సహించి యుండజాలడు. మన నెప్పుడు తన వశము చేసుకొందునా యని, ఆయన నిరంతరము, సమయము కొఱకయి వేచియుండును. అట్టి మన పరమపితకు, మన ప్రాణసఖునకు మన హృదయ ద్వారము నెందుకు తెఱచి యుంచకూడదు? ఆయన యనుగ్రహజలములో జలకమాడుటకొఱకు మన మేల ప్రతీక్షింపకూడదు? వ్యాకుల చిత్తములతో మన మాయన నేల వెదుకకూడదు?

ఆ పరమపిత మనకొఱకు ఎంతపని చేయుచున్నాడో, మనము సకలసమయములయందును, మనసునం దుంచుకొన జాలము. సదా, మనసునం దుంచుకొన గలిగినయెడల, మన మాయన నిట్లు మఱచి యుండగలమా? చూడుడు. అచింతనీయమైభవసంపన్నుడు, ఆద్యంతరహితుడు, అఖిల బ్రహ్మాండ

నాయకుడు అగు ఆ మహాపురుషు డెక్కడ? కీటాణుతుల్యులము, హీనులము, మలిన చిత్తులము అగు మన మెక్కడ? ఇట్టి క్షుద్రుల మగు మనను సహితము ఆయన మఱచిపోడు. మనము ఆయన యనుగ్రహమున కెంతమాత్రమును పాత్రులము కాము. అయినను, ఆయన మనకొఱ కింత విశ్వప్రయత్నము చేయుచున్నాడు. మన మాయన కరుణకు యోగ్యుల మగుటకు ఏమి చేయుచున్నాము? ఆయన మననుండి ఏమియు ఆశింపడు. కేవలము మన ప్రేమను మాత్రమే కోరును, సోదరులారా! మన మందరమును నమ్రభావముతో ఆయనను సమీపించి, "నాయనా, నీతోడి యెడబాటును మే మిక సహింపజాలము. ఇదిగో, ప్రేమపూర్వకమైన మా సంపూర్ణ హృదయమును నీ కర్పించుచున్నాము. నీవు మా గతాపరాధముల నన్నిటిని క్షమించి, ప్రసన్నుడవయి, మమ్ము నీ యక్కున చేర్చుకొమ్ము" అని నివేదింతము.

ఓ పరమాత్ముడా, నీవు మా కెంతో సమీపమున నున్నావు. నీ వెంతో దూరమున నున్నా వని, మే మనుకొనుచుందుము. నిన్ను దర్శించుటకు ప్రయత్నాభావము చేతనే మేము నిన్ను చూడలేకున్నాము. వ్యాకులహృదయముతో మే మొక్కసారి నిన్ను స్మరించినయెడల, వెంటనే నీవు దర్శనమిచ్చుచున్నావు. నీ వాశ్రితవత్సలుడ వన్నమాట మఱచిపోయి, మేము శోకమోహములలో పడి కొట్టుకొనుచున్నాము. దీనజన బాంధవా! మా సమస్తహృదయమును, సమస్త బలవీర్యములను, నిన్నన్వేషించుటయందే వినియోగింతుముగాక!

నీకు హితమయిన కార్యములు చేయుటయందే మా సమస్త జీవనమును గడుపుదుముగాక! నీవే మా కిహపరములకు ఏక మాత్రగతి వని తెలుసుకొని, నిన్నే శరణు జొత్తుముగాక!

ఓమ్. ఏకమేవాద్వితీయమ్.

---

ఓమ్ తత్సత్.

# మహర్షి మహోపదేశములు

## ౨౩ వ ఉపదేశము

నావిరతో దుశ్చరితాత్ నాశాన్తో నాసమాహితః
నాశాన్తమానసో వాపి ప్రజ్ఞానే నైన మాప్నుయాత్.

ఎవడు దుష్కర్మములను విడిచిపెట్టడో, ఎవడు చలింపని ఇంద్రియములు కలవాడయి, శాంత మనస్కుడు కాడో, ఎవని చిత్తము సమాహితమయి స్థిరముగా నుండదో, ఎవడు ఈషణ త్రియములలో చిక్కుకొని మనశ్శాంతిని గోలుపోవునో, అట్టి పురుషుడు కేవలము శాస్త్రజన్యజ్ఞానమువలన పరమేశ్వరుని పొంద జాలడు.

ఎప్పుడు విషయ వాంఛలు, భోగాసక్తి, చిత్తమును విక్షిప్తముగా జేయునో, ఎప్పుడు మానవ జీవితముయొక్క మహాలక్ష్యమును మఱచిపోయి, నీచచింతలతోను, కోరరాని కోరికలతోను, మనస్సు సంపూర్ణమయి యుండునో, అప్పుడు, మన మాయనను సందర్శింపజాలము. ఎవడు విషయాసక్తి

రహితుడయి, విషయములనుండి మరల్చబడిన ఇంద్రియవ్యాపారము కలవాడై, సమాహిత చిత్తముతో, ఈశ్వరున కభిముఖుడగునో, అతని జ్ఞానమునందు, అనంతుని మహిమ దేదీప్యమానముగా ప్రకాశించును. ఎవని చిత్తము పాపాలోచనములతో కళంకితమయి యుండునో, ఎవని హృదయము ప్రాపంచిక భావములతో, భౌతిక సుఖేచ్ఛలతో పరిపూర్ణమయి యుండునో, అతడు కేవలము జ్ఞానముద్వారా, పరబ్రహ్మమును తెలిసికొనజాలడు. శాస్త్రజ్ఞానము కలవాడు ధర్మాధర్మములను గురించి మహోపన్యాసములియ్యవచ్చును. మాట మాటకు వేదమునుండిగాని, బైబిల్ నుండిగాని, ఖురానునుండిగాని, మఱియే ఇద్గ్రంథమునుండిగాని అశ్వధాటిగా సూక్తులను చదివి వినిపించ వచ్చును. ప్రస్థానత్రయమును భాష్యములతో ప్రసంగించ వచ్చును. మహామహోపాధ్యాయుడని దిగంత విశ్రాంతమగు కీర్తిని పొందవచ్చును. పాండిత్యము వేఱు, ధర్మజీవనము వేఱు. జ్ఞానము వేఱు, భక్తి వేఱు. ఏ హృదయము సంసారమాలిన్యముచే పంకిలమగు జలముతో పరిపూర్ణమయి యున్నదో, దేనియందు పరమేశ్వరుని నిర్మలమగు అమృతవారి ప్రవేశించుటకు బిందుమాత్రస్థానమయినను మిగిలి యుండలేదో, అట్టి హృదయము మీదుగా, ఆయనయొక్క అమృతవర్ష ప్రవాహము, నిరంతరధారగా, జీవనదివలె ప్రవహించుచున్నను, ఏమి లాభము? ఎవరి చిత్తము విషయ చింతలతో విక్షిప్తమయి యున్నదో, ఎవరియొక్క సమస్త జీవనము మృత్యుస్వరూపమగు సంసారముతోనే సంశ్లిష్టమైయున్నదో,

వారు ఈశ్వరుని అమృతవారిని ఎట్లు రుచిచూడగలరు? అమృతా స్వాదనము చేయుటకు వారికి సమయ మెక్కడిది? హృదయము సంపూర్ణముగా విషయాసక్తులనుండి విరతి నొందనియెడల, దానియందు పరమేశ్వరుని మంగళభావ కిరణములు వ్యాపింప జాలవు. కావున, సోదరులారా! ముందుగా, హృదయమును పరిశుద్ధము గావించుకొనుడు. అప్పుడు, ఈశ్వరుని అమృత వర్షముకొఱకు ప్రతీక్షింపుడు. స్వర్గమునుండి అమృతవారి ఎప్పుడు వర్షించునో, ఆ సమయ మిది యని, నిశ్చయముగా నిరూపింపజాలను. చాతకమువలె, తృష్ణార్తులయి, అమృతవర్ష మెప్పుడు కురియునా యని, కనిపెట్టుకొని యుండుడు. ఎప్పుడు వర్షించునో, అప్పుడు ఉత్సాహముతో, అమృతపానము చేసి, తృష్ణానివారణము చేసికొనుడు. ఎప్పుడు మనస్సు, ఈ విధముగా శాంత మయి, సమాహితమయి, నమ్రభావమును వహించునో, అప్పు డది సులభముగా పరమేశ్వరుని వైపు నకు మరలును. ఇప్పుడు చంద్రునియొక్క ప్రభావమును చూడుడు. ఆయనయొక్క అమృతకిరణములు సహస్ర సహస్రధారలుగా వర్షించుచున్నవి. భూమండలము వెండి కొండవలె ప్రకాశించుచున్నది. వృక్షములు తమ ఆకు పచ్చని వర్ణమును విడిచి, రౌప్యవర్ణముతో వెండి చెట్లవలె శోభిలుచున్నవి. నెలనెలకును ఇట్లే పూర్ణచంద్రునియొక్క శుభ్రకాంతులు భూమిమీాద వర్షించుచున్నవి కాని ఎప్పుడు దానియొక్క మాధుర్యమును గ్రహించి, దానియందు అనంతు డగు పరమేశ్వరుని మహిమను అవలోకింపగలుగుచున్నాము?

మీలో నెవ్వరయిన ఏకాకిగాగాని, స్నేహబృందముతోగాని పున్నమినాటిరాత్రి గంగాతీరమునందుగాని, మరే నదియందుగాని నౌకావిహారము సల్పియుండిరా? నదీజలోపరిభాగమునందును, సైకతస్థలులయందును, తీరసౌధోపరిభాగముల యందును, పరిసరోద్యానములయందును పండు వెన్నెలలు గాయుచుండగా, సమస్త వస్తువులును వెండిపూతలతో శోభిలుచుండగా, నదిమీదనుండి వీతెంచు మందమలయమారుత ముతో హృదయములు చల్లబడుచుండగా, పగ లంతయు సూర్యాతపముచే తప్తమయిన సమస్తభూమండలమును చంద్రకిరణములతో స్తబ్ధమయి, పులకాంకితగాత్రమై తనివిదీర అమృతరసాస్వాదనము చేయుచుండగా ఎవని హృదయము కరుగదు? ఎవని హృదయమునందు అనంతమహిముని పాదచిహ్నములు అంకితములు గావు? అట్టి మంగళసమయమునందు ఎవని హృదయక్షేత్రమునందు ఆ పరమపురుషుడు తన అనంతమహిమతో ఆవిర్భవింపడు? నిస్సందేహముగా మీలో ననేకులు ఇట్టి సుందరదృశ్యమును దర్శించియేయుందురు. ఇట్టి అనుభవమాధుర్యమును అనుభవించియేయుందురు. ఆ సుధాకరుని చూచి ఆ లావణ్యరాశియొక్క సౌందర్యచింతనములో నిమగ్నులయి తన్మయత్వము నొందిననాటి భావము నొకసారి స్మరణకు తెచ్చుకొనుడు. ఎట్టి యవస్థలో మన మనస్సు అనంతుని మహిమచింతనములో నిమగ్నము కాగలదో తెలియవచ్చును. అనంతుని మహిమలను చింతించుచు తదేకధ్యానయుక్తుల మయి యున్నప్పుడు మన మనసులందు విషయవాంఛలకు చోటుం

డునా? మాసమాసమును మన మట్టి నిండుచందురుని దర్శించు చునేయున్నాము. హృదయసమ్మోహనకర మగు ఆ చంద్రజ్యోత్స్నయందు ప్రకృతియందలి సౌందర్య దృశ్యములకు సౌందర్యము నిచ్చెడు సుందరమూర్తియగు పరమేశ్వరుని దివ్య గుణానుచింతనములో మన మనస్సు నిమగ్న మయి యున్న ప్పుడు మనము భౌతికసుఖచింతనముపుండి ఉన్నతినొంది, ఆ యమృత నికేతనునియందే విశ్రాంతినొందుదుము. ఈ ప్రపంచమునకు దాసులమయి విషయసుఖములే పరమావధి యని తలచుచు సమస్తభోగములయందు మునిగి ప్రమత్తుల మయి ఇంద్రియసేవజేయుచు స్వేచ్ఛావిహారుల మయి ప్రవర్తించుచో మన మేవంక జూచినను, భూమ్యాకాశములు వెదకినను ఈశ్వర మహిమను లేశమాత్రమును చూడజాలము. మనస్సు ఈశ్వరున కభిముఖమయియున్నప్పుడు మానవుడు తన సుఖదుఃఖములవైపు చూడజాలడు. అప్పుడు స్వకీయసుఖము సంతోషము నియ్యజాలదు. స్వకీయదుఃఖముచే మనస్సు తల్లడిల్లదు. అప్పుడు మనసునందలి నీచభావము లంతరించి, అపరూపమగు ఒక ఔదార్యభావము హృదయమునం దలముకొనును. అనుకూల వాయువులు వీచి హృదయమునందలి సమస్త సాధుభావములకును ప్రాణము పోయును. హృదయము ఈశ్వర మహిమతో వెలుగొందును. అప్పుడు ప్రకృతియం దంతట ఉషఃకాల కాంతులయందు, సూర్యాతపమునందు, సంధ్యారాగమునందు చంద్రజ్యోత్స్నయందు, నక్షత్రరాజులయందు, అమవస నిసియందు, సముద్రపు కెరటములయందు, పర్వతశిఖరములయందు

సర్వత్ర ఆ యనంతుని మహిమయే ప్రకాశించును. కేవలము దర్శన శాస్త్రాధ్యయనముచేత, కేవలము తత్త్వవిమర్శనముచేత పాండిత్యమబ్బునుగాని ఈశ్వరోపలబ్ధి కలుగజాలదు. అక్షర పరబ్రహ్మముయొక్క అపరోక్షానుభూతికి నిష్కామప్రవృత్తి కోరికలు లేని మనస్సు కావలెను. ఈశ్వరదర్శనముకొఱకు తీరని వ్యాకులత; ఆయనను దర్శింపని జన్మ మేల? ఆయనను పొందని తనువేల అనునంతటి వైరాగ్యభావము హృదయమునం దంకు రింపవలెను. ఆయనతోడి సహవాసము లభించని దిన మొక యేడుగా కానుపించవలెను. ఆయన లేని ఐశ్వర్యము దారిద్ర్య ముగా, ఆయనలేని సుఖము దుఃఖముగా తోచవలెను. అట్టి జీవనముకంటె మరణమే మేలని యనిపించవలెను. సాధకుని హృదయమునందు వైరాగ్యపూర్వక మగు అట్టి దర్శనేచ్ఛయే జనించినయెడల దీనజనబాంధవుడు, శరణాగతవత్సలుడు అగు పరమేశ్వరుడు దర్శన మియ్యక యూరకుండగలడా? అప్పుడు ఆ త్రిలోకాధినాథుడు శిశువుయొక్క యాక్రందనధ్వనివిని పరుగెత్తు కొనివచ్చు తల్లివలె, లేగదూడయఱపు విని పరుగెత్తుకొనివచ్చు గోవువలె సంభ్రమముతో సాధకుని హృదయాంతరాళము నందే అవతరించును. అప్పుడు సాధకునికి ఎటు జూచినను పర మేశ్వరుడే తోచును. అంతరమునం దతడే. బాహ్యమునం దతడే. సకల స్థానములయందు, సకల విషయములయందు ఆయనమహిమయే వెలుగొందుచుండును. చంద్రుడు, సూర్యుడు, నక్షత్రములు మొదలయిన సమస్తజ్యోతులును వ్రేలుపెట్టి చూపించినట్లు ఆయననే చూపించును. సముద్రము లాయ

పనే ఘోషించును. పర్వతము లాయననే చాటించును. నందన వనము లాయననే కీర్తించును. వాయు వాయననే శబ్దించును. పక్షు లాయననే గానముచేయును. ప్రకృతియంతయు ఆయననే మననముచేయును. ఎంత యాశ్చర్యము! కౌటిల్యముతో, విషయ వాసనలతో నిండియున్న హృదయము, క్షణకాలముక్రిందట అంధకారావృతమయి యున్న హృదయము సరళభావము, విషయవైరాగ్యము, ఈశ్వర దర్శనోత్సుకత, వ్యాకులత ఉదయించిన వెనువెంటనే అంధకారము పటాపంచలయి పరమాత్మజ్యోతితో మహాతేజోమయ మయ్యెను. ఈశ్వరప్రేమ దవానలమువంటిది. నిశ్చయముగా ఈశ్వరప్రేమకు హృదయమునందు బిందుమాత్రస్థానము నియ్యగలిగితిమేని సకల పాపములును భస్మము లగును. సకలసంశయములును నివారణయగును. హృదయము భక్తిప్రపూర్ణ మగును. ఏది ఏండ్ల తరబడి తర్కముచేత శాస్త్రాలోచనచేత పాండిత్యగర్వముచేత దుస్సాధ మయ్యెనో, అది ఈశ్వరునియందు హృదయార్పణముచే నిమిషమాత్రములో సుసాధ్య మయ్యెను. సమస్త మోహములును దూర మయ్యెను. ఆయనయందు గల బిందుమాత్రప్రేమచేతనే సమస్తసత్యములును, మనయెదుట ఉజ్జ్వలములై ప్రకాశించుచుండగా మన మాయనకు సంపూర్ణహృదయమే అర్పింపగలిగితిమేని అప్పుడు మనభాగ్య మేమని చెప్పను!

మనకుగల విశుద్ధప్రేమ ఈశ్వరుని ప్రకాశింప జేసినట్లు వేదముగాని, తర్కముగాని, షడ్దర్శనములుగాని ఆయనను ప్రకాశింపజేయజాలవు. ఆత్మను పవిత్రము చేసుకొనినయెడల సాధు

వర్తనపూర్వక మగు సాధుభావముతో హృదయము పరిపూర్ణముకానియెడల, కేవలము పుస్తకములద్వారా, పుస్తకముల లోని పురుగులవలె రాత్రింబగళ్లు కేవలము గ్రంధపఠనముతో జీవితము గడిపినయెడల ఎంతమాత్రమును లాభము లేదు. అధ్యయనమువలన అధ్యాపకులము కాగలము. జగన్మాన్యులగు పండితులము కాగలము. శాస్త్రాలోచనచే శాస్త్రులనిపించుకొనగలము. బుద్ధిబలముచే తర్కవాచస్పతులనిపించుకొనగలము. కాని, ఈశ్వరుని మాత్ర మెన్నడును పొందజాలము. ఆయన సామీప్యమును పొందదలచినయెడల, శిశువులవలె నిష్కపట చిత్తముతో, మాయమర్మము లెరుగని మనసుతో, ప్రేమ పరిపూర్ణ మగు హృదయముతో, ఆయనను సమీపింపుడు. గర్వవస్త్రముల విడువుడు. నమ్రవసనముల ధరింపుడు. విశ్వగ్రంథమును పఠింపుడు. పంక్తిపంక్తియందు, మాటమాటయందు, అక్షర అక్షరమునందు, ఆయననే దర్శింపుడు. సరళ హృదయమునందే, పవిత్ర జీవితమునందే, నిష్కామకర్మ యందే పరమాత్మ ప్రకాశించును. అప్పుడు నేను ఆయనవాడనగుదును, ఆయన నా వా డగును. ఈ యనంత విశ్వములో, ఆయన, నేను తప్ప, మరెవ్వరు లేనట్లు కానుపించును. నా హృదయమునందు స్థానము పొంది ఆయన సంతృప్తుడగును. ఆయనయందు స్థానము పొంది నేను పరితృప్తుడ నగుదును. నా ప్రేమ ఆయన వైపునకు ప్రవహించును. ఆయన ప్రేమ నా వైపునకు ప్రవహించును. ఉభయుల ప్రేమయు సమ్మిళితమయి అమృతఫలములు ఫలించును.

సోదరీ సోదరులారా! ఆ యమృతనికేతనునితో నమ్మేళన మొంద దలచినయెడల, మీ ఆత్మలను పరిశుద్ధము గావించుకొనుడు. నిండు మనసుతో ఆయనను ప్రేమింపుడు. సర్వత్యాగులయి, ఆయన యనుచరులయి, ఆయన శరణమునే వేడుడు. ఆయనయందు ప్రేమ, ఆయనకు హితమయిన కార్యములు చేయుట అను ద్వివిధాంగములు గల ఉపాసనాద్వారము తప్ప, మృత్యువును జయించుటకు, మృత్యుంజయుని సమీపించుటకు, మోక్షసామ్రాజ్యమును చూఱగొనుటకు, ఉపాయాంతరము లేదు.

ఓ పరమాత్ముడా! నీవు మా సమస్తదుష్ప్రవృత్తులను అణచివేయుము. ఇంద్రియచాంచల్యమునుండి విరతులను జేయుము. నీచకామములనుండి తప్పింపుము. పరిశుద్ధమగు నీ ప్రేమయందే మమ్ము ముంచివేయుము. నీ ప్రియకార్య సాధనయందు మమ్ము నియుక్తులనుగా జేయుము.

ఓమ్ ఏకమేవాద్వితీయమ్.

---

ఓమ్ తత్సత్.

# మహర్షి మహోపదేశములు

## ౨౩ వ ఉపదేశము

యదిదం కించ జగత్సర్వం, ప్రాణ ఏజతి నిస్సృతం.

ఎవడు ప్రాణస్వరూపుడో, అతడు సర్వభూతముల

యందును ప్రకాశించుచున్నాడు. జీవనంతమగు ఈమహావాక్యముసు మనము బ్రాహ్మధర్మమునుండి గ్రహించితిమి. ప్రాణస్వరూపుడగు పరమేశ్వరునుండియే జగమంతయు బహిర్గతమగుచున్నది. ప్రాణస్వరూపుడగు ఆ పరమపురుషుని నియమముల వలననే, సమస్తజీవరాసులును, సమస్తభూతములును, తమ తమ వ్యాపారములయందు ప్రవేశించి పనిచేయుచున్నవి. ఆ ప్రాణస్వరూపుని యిచ్ఛాస్రోతము నేడును అవిచ్ఛిన్నముగా ప్రవహించుచుండ బట్టియే, ఈ చరాచరప్రపంచమందలి సమస్తమును నిరంతరాయముగా తమ తమ కృత్యములను నిర్వహింపగలుగుచున్నవి. ఎవడు చిరజాగరితుడగు జీవవత్సర బ్రహ్మమో, ఎవడు మన హృదయముయొక్క పరమధనమో, ఆ పరమపురుషు నుపాసించుటకొఱకే మన మీ బ్రహ్మ సమాజమునందు చేరియున్నాము. ఆయనకు మన ప్రేమను సమర్పించుటకే మన మిక్కడ కలసికొంటిమి. ప్రేమస్వరూపుడగు ఆయన ప్రేమనేత్రములను దర్శించి, మన జీవితములను సార్థకము చేసికొందము. అతడు సర్వజ్ఞుడు, సర్వవ్యాపి, సర్వనియంత. అతడు మన శాశ్రియదాత. ఆయన యుపాసనార్థమయి, ఆయన ప్రేమను స్మరించుకొనుటకొఱకు, మన మందరమును ఇక్కడ సమావేశ మయితిమి. ఆయనయందు మనకు గల ప్రేమను ఉజ్జ్వలముగా జేయుడు. జడప్రపంచమువలె ఆయన మన యింద్రియగోచరుడు కాడు. మన మాయనను జ్ఞాననేత్రముతో దర్శింపవలయును. ఆయన జ్ఞానస్వరూపుడు, ప్రేమస్వరూపుడు, ధర్మస్వరూపుడు. ఆయనను పూజించుట

కయి ఉత్సాహముతో పూనుకొందము. కుటిలములగు విషయచింతలు, ఈ సమయమునందు మన హృదయములను బంధింపకుండునుగాక! మన మనస్సు బాహ్యవిషయములయందు విక్షిప్తము గాకుండును గాక! ఏ యమృతాస్వాదనము కొఱకు మన మింతవరకు నిరీక్షించి యుంటిమో, ఆ సంతోష సమయ మిప్పు డాసన్నమయినది. మన హృదయ ద్వారములను తెఱచి, మన మనస్సులను ఆయన యానందరసముతో నింపుదము. ఎవనితో మన కనంతకాల సంబంధమో, ఆయనయే వేంచేసి, మన హృదయములను పూర్ణము చేయుచున్నాడు. మన మెంత భాగ్యవంతులము! మన దేశ మిప్పుడు దేశములలో కెల్ల దుర్బలదేశమయి యున్నది. ఆత్మస్వాతంత్ర్యముతో పాటు సమస్త స్వాతంత్ర్యములును నన్నగిల్లినవి. మనమును దుర్బలులమయి యున్నాము. అయినను ఈశ్వరున కెంత యనుగ్రహము! ఆయన ఈ సమాజమందిరమునందు మన సమక్షమున ప్రకాశించుచున్నాడు. తల్లికి బలవంతులగు బిడ్డలయందుకంటె దుర్బలసంతానమునందే ప్రేమ యధికము. అట్లే ఈశ్వరప్రేమయు, మన దేశముపయి అధికముగా ప్రకాశించుచున్నది. ఆయననుండి అట్టి యనుగ్రహమును పొందుచు, మన మాయనకు భక్తిపూర్వక ప్రణామములను సమర్పింపకుండుట తగునా? ఆయన యనుగ్రహమే మనకు సర్వస్వము. నే డీ సమాజమందిరమునకు వచ్చి, ఆయన ప్రసాదమును విశేషముగా ననుభవింపుచున్నాము. ఈ యనుగ్రహస్మరణమే, మనలను ప్రతివారమును ఇక్కడకు వచ్చునట్లు

చేయునుగాక ! మనము కించిన్మాత్రమయినను ప్రయత్నించిన యెడల, ఆయన ప్రసన్నుడయి తన యనుగ్రహమును ముక్త హస్తముతో ప్రసాదించును. మన మాయన పైపునకు ఒక్క అడుగు పెట్టగలితిమేని, ఆయన వేయి అడుగులు ముందుకు వచ్చి, మనపయి అమృతవర్షము కురిపించును. మనము మనుష్యజన్మమెత్తియు ఆయనకును మనకును గల సన్నిహితసంబంధమును రక్షించుకొన జాలకున్నాము. ఆయన యొక్క సుందర మంగళభావమును దర్శించి ఆత్మను తేజస్వంతముగాం చేసికొందము. సమస్త కుటిలభావములను పరిత్యజించి, ఆత్మలను పవిత్రము గావించుకొందము. ధర్మస్వరూపుడగు పరమేశ్వరుని యధీనుల మగుదము. స్వేచ్ఛాచారములు పరిత్యజింతము. స్వేచ్ఛాచారులు స్వతంత్రులు కారు. వారు తమ కుటిలప్రవృత్తుల కధీనులు, దాసులు. జ్ఞానహీనములు, ధర్మహీనములు నగు పశువులే స్వేచ్ఛాచారము గలవి. ఎవరు తమ యింద్రియములను, తమ మనస్సును తమ వశము చేసికొన జాలరో, ఎవరు తమ ప్రవృత్తిస్రోతమును ధర్మమున కనుకూలముగా ప్రవహింప చేయజాలరో, ఎవరు తమకు తాము స్వతంత్రులు గాక, అన్యులకు, తమ ప్రవృత్తులకు దాసులో, వారికంటె భాగ్యహీనులు, పరాధీనులు మరెవరు? “ఇంద్రియాణాం విచరతాం యన్మనోనువిధీయతే। తదస్య హరతే ప్రజ్ఞాం వాయుర్నావ మివాంభసి” అన్నట్లు మన స్సెప్పుడు స్వేచ్ఛాచారియయి, ఇంద్రియములను వశపఱచుకొనజాలక, తానే ఇంద్రియములకు వశమయిపోవునో, అప్పుడు వాయువు

జలములందు నౌకను ముంచివేసినట్లు, పురుషునికి వశముగాని మనస్సు, పురుషుని బుద్ధిని వినాశము నొందించును. పరాధీనత వలని కష్టములు వర్ణనాతీతములు. పాప ప్రవృత్తుల వశమగుట వలని యనర్థము ఒక్క ముఖముతో వ్యక్తము చేయబడ జాలదు. పాపరోగమునకు పరమౌషధము కేవలము బ్రాహ్మ ధర్మమే. ఏ బ్రాహ్మధర్మముయొక్క ప్రాణము స్వయముగా పరబ్రహ్మమో, ఆ ధర్మముయొక్క బలముచేతనే, మనము తిరిగి స్వాతంత్ర్యలాభమును పొందుదుము. బ్రహ్మ నామ స్మరణముచేతనే, దాస్యశృంఖలములు శిథిలము లయి జారి పోవును. బంధనము తెగుటయే స్వాతంత్ర్యము లభించుట. స్వాతంత్ర్యము లేకపోయినయెడల, సుఖ సౌభాగ్యము లనుభ వించుట యసంభవము. పరాధీనతయే సకల దుఃఖములకు మూలకారణము. స్వాతంత్ర్యమే స్వర్గము. పరాధీనతయే నర కము. పాపమునుండి విముక్తి నొందుటయే, ఆత్మయొక్క స్వాతంత్ర్యము. ఆత్మస్వాతంత్ర్యముతో పాటు సమస్తవిధము లయిన స్వాతంత్ర్యములును పొందనగును. బ్రాహ్మధర్మము ద్వారా మన దేశమునందు ఎన్నెన్ని సత్కార్యములు సాధింప బడుచున్నవి! ఒకసారి భావించి చూడుడు. ఏకేశ్వరుని మాన సికోపాసన, జాతిభేద నిర్మూలనము, సర్వమానవసౌభ్రాత్ర త్వము, మానవసేవ, స్త్రీస్వాతంత్ర్యము, సర్వమత సమ్మేళ నము, అనుదినజీవితమునందు ఆధ్యాత్మికసాధన, ఆత్మ, ప్రకృతి, మానవచరిత్రలయందు బ్రహ్మదర్శనము, మొదలగు శుభకార్యము లెన్నెన్ని సాధింపబడుచున్నవి! వాని నన్నిటిని

ఒకసారి హృదయమునందు ధారణ చేయగలిగినయెడల, ఆ ధర్మముయొక్క మహిమ కొంతవరకు తెలియవచ్చును. ఈశ్వర రాజ్యము ఎంతవరకు వ్యాపించియున్నదో, అంతవరకు బ్రాహ్మధర్మముయొక్క బలము, ఆధిపత్యము వ్యాపించియున్నది. మనము మన స్వాతంత్ర్య సంపాదనము కొరకు, కొంచెమయినను ప్రయత్నము చేసినయెడల, పరమాత్మయొక్క అనుగ్రహముకొరకు, మన హృదయమునందు,కించిన్మాత్రమయినను వ్యాకులత జనించినయెడల,దాని ఫలసిద్ధి కేవలముబ్రాహ్మధర్మముయొక్కసాహాయ్యమువలననే లభింపగలదు. కేవలము బ్రాహ్మధర్మము నాశ్రయించుటయే, పాపమును పరాజయము నొందించుటకు పరమతరణోపాయము. మన దేశముయొక్క పూర్వపుఔన్నత్యమును ప్రస్తుతపుటాధ్యాత్మికదురవస్థను గుర్తెరిగిన వారందరు ఈ బ్రాహ్మధర్మము విషయమయి తటస్థముగా నుండకుందురుగాక! బ్రాహ్మధర్మమే గ్రహించని యెడల, ఈ దేశముయొక్క దురవస్థకు మేర యుండదు. అవసాన ముండదు. ఈశ్వరుని ప్రేమముఖమును దర్శించుటకయి ప్రార్థన చేయుడు. ఆయన ప్రసన్నముఖమును దర్శించిన యెడల, సమస్తతాపత్రయములును శమించును. ధర్మబుద్ధియు, శుభబుద్ధియు ఆర్జించుటకొరకు ఆయనవైపునకే తిరుగుడు. ఆయన ప్రార్థనలను తప్పక సఫలము చేయును. ఆయన భక్తవత్సలుడు, భక్తాభీష్టప్రదాత. ఆయన తన ప్రసాదోదకములతో మనల తప్పక యభిషిక్తులనుగా జేయును. ఆయన మనకేకమాత్రశరణ్యమని పరమగతియని సాధనచేయజేయ మన

చిత్తవృత్తులన్నియు నా మంగళమయుని యిచ్ఛానుసారముగా ప్రవర్తించును. ఆయన యిచ్ఛతో మన యిచ్ఛను కలుపుటయే మోక్షము. అహంకారనాశనమే, స్వార్థరాహిత్యమే, ఈశ్వరేచ్ఛానుసరణమే జీవన్ముక్తి. ఈశ్వరుడు తన ప్రీతిసిద్ధి స్వరూపముగా, బ్రాహ్మధర్మమును మన సమీపమునకు ప్రేరణ చేయనియెడల, మన సన్నిహితబంధువువలె, మన ప్రాణమిత్రునివలె, బ్రాహ్మధర్మము మనల సకల సన్మార్గములయందును నడపని యెడల మన మెంత దురదృష్టవంతులముగా నుండి యుందుము! ఎంతకష్టము ననుభవించియుందుము! మనస్థితి యెంత నరకప్రాయ మయి యుండును! ఒకసారి భావించి చూడుడు. మనము పాపములకు వశులమయి సంసార రూప పంజరమునందు బందీలుగా బంధింపబడి యుందుము. కాని, బ్రాహ్మధర్మముయొక్క ప్రసాదమువలన మన మీశ్వరు నుండి దూరస్థులము కాలేము. క్రమక్రమముగా ఆయన సహవాసమును పొంది బలయుతుల మగుచున్నాము. బ్రాహ్మధర్మము ననుసరించి ఆత్మ బలవంత మగుచున్నది. బ్రాహ్మధర్మము ఆత్మను పవిత్రముగా చేసి ప్రకాశవంత మగుచున్నది. సూర్యుడు తూర్పున నుదయించి భూమండలము నంతను నెట్లు తన దివ్యతేజముతో నింపుచున్నాడో అట్లే ఈ దేశమునం దుదయించిన ఈ బ్రాహ్మధర్మము ధర్మప్రపంచము నంతను తేజస్వంతముగా చేయగలదు. సమగ్రపృథివీమండలమును క్రమక్రమముగా నాక్రమించుకొని తన దివ్యతేజముతో నింపగలదు. ఈ ధర్మమును ఉపేక్షాభావముతో చూచితిమేని

శరీరము కృశించును, మనస్సు వికారము నొందును, ఆత్మ శుష్కించిపోవును. సమస్తానర్థములును వాటిల్లును. పరమపురుషార్థమునుండి భ్రష్టుల మగుదుము. దీనిని మీ రాశ్రయించిన యెడల మీరు దీని బలమువలననే బలవంతు లగుదురు. పృథివియందలి నూరువేలమంది ఖడ్గపాణులయి మీయెదుట నిలువబడినను, మీ రీశ్వరునిచే ననుగ్రహింపబడిన సత్యమను అభేద్య కవచమును తొడిగికొని, సమస్తభయములనుండియు, విపత్తులనుండియు రక్షింపబడుదురు. సమస్తప్రలోభనములను ఎదిరించగలరు. సమస్తదురాచారములను రూపు మాపగలరు. బ్రహ్మబలమే బలము. బ్రహ్మశక్తి వినా లోకమునందు మరియొక శక్తిలేదు. ఆ శక్తి నార్జింప బ్రయత్నింపుడు. మీ రందరును కలిసి, ఏకమనస్కులయి ఈ బ్రాహ్మధర్మమును మహాప్రయత్నముతో సంరక్షించుకొనుడు. అదినిశ్చయముగా మిమ్ము సమస్తసమయములయందును తోడునీడ యయి సంరక్షించును. ఏ బ్రాహ్మధర్మము ఈ పృథివియొక్క ధర్మమో, ఈ యనంత విశ్వముయొక్క ధర్మమో, దానితో మీ హృదయమును పూర్ణము గావించుకొనుడు. మీ సాధుసంకల్పములే, మీ ధర్మకృత్యములే క్రమముగా సమగ్రపృథివీమండలమును అలముకొనును.

ఓ పరమాత్ముడా! ఈ మర్త్యలోకమునందు బ్రాహ్మధర్మము యొక్క ఆవిర్భావము జాజ్వల్యమానముగా నెన్నడు వెలుగగలదు? ఎప్పుడు మా దేశమునుండి, హింస, అసూయ, ద్వేషము మొదలగు సమస్తమలినభావములును దూరీకృతము

లగును! ఎప్పుడు భారతీయు లందరు నీ ప్రేమయందు నిమగ్నులయి, బ్రహ్మధర్మావలంబులయి, ఆప్తకాము లగుదురు? ఓ జగదీశ్వరా! మానవు లందరు భ్రాతృభావముతో నిన్ను తండ్రి యని పిలుచు దిన మెన్నడు సంప్రాప్త మగును! నిర్మలతమము అంతరతమము నగు మా యీ యభీష్టమును నీ వెన్నడు పరిపూర్ణము గావింతువు!

ఓమ్. ఏకమేవాద్వితీయమ్.

---

ఓమ్ తత్సత్,

# మహర్షి మహోపదేశములు

## ౨౯వ ఉపదేశము

శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేత:
స్తౌ సంపరీత్య వివినక్తి ధీరః.

శ్రేయః ప్రేయస్సులు రెండును మనుష్యుని పొందుచున్నవి. ధీరుడు ప్రేయమును విసర్జించి శ్రేయము నే గ్రహించుచున్నాడు. ప్రేయమనగా ఇంద్రియసుఖసంబంధ మయినది. అది మొదట సుఖముగా కనుబడినను, అనుభవించగా అనుభవించగా, తుదకు ఆత్మవినాశము నొందించును. సకలానర్థములకును దారి తీయును. శ్రేయ మనగా ఆధ్యాత్మికసుఖసంబంధమయినది. ఇది ప్రారంభమందు కష్టముగా కానుపించి

సను, తుదకు సుఖముగా పరిణమించును. ఆత్మోన్నతికి తోడు పడును. మోక్షసాధన మగును. పరమపురుషార్థము సిద్ధించును.

మన మెప్పుడు సంసారసముద్రములో పడి కొట్టుకొని పోవుచుంటిమో, యెప్పుడు ప్రేయమునకు వశవర్తుల మయి ఇంద్రియసుఖములయందును, విషయభోగముల యందును నిమగ్నుల మయి ప్రమత్తుల మయి యుంటిమో, అప్పుడు ఎక్కడనుండియో ఒక దివ్యబలము వచ్చెను. దానిబలమువలన నే సంసారప్రవాహమునకు ఎదు రీదగలుగుటకు సమర్థులమయి తిమి. ఎప్పుడు దుఃఖబహుళమగు, కష్టభూయిష్ఠమగు సంసారమునందే మన ఆశలను, మన భారమును, సమర్పించి ప్రేయోమార్గముననే ప్రయాణము చేయుచుంటిమో, అప్పుడు ఎవరు మన చేతులను పట్టుకొని మనల నట్టి దుర్గతి నుండి యుద్ధరించిరి? ఎప్పుడు సమవయస్కు లగు స్నేహితులతో చేరి, ఆమోదప్రమోదములలో ఉన్మత్తుల మయి యుంటిమో, ఎప్పుడు ఈశ్వరమార్గమున ఒక అడుగయినను పెట్టించి, మన ఆత్మలను మేలుకొలుపగల ఒక సాధుపురుషుని ముఖసందర్శన మయినను చేయకుంటిమో, అప్పుడు ఎవరు మనకు సుమధుర మగు ఉపదేశమును చేసి, కల్యాణ మయమగు శ్రేయోమార్గమును ప్రదర్శించియుండిరి? మీలో ప్రతివారును ఎవరిమట్టుకు వారు ఆలోచించి చూచుకొనుడు. మీరు బ్రాహ్మధర్మమును స్వీకరింపక పూర్వము, అటువంటి ఒక సమయము, అటువంటి ఒక అవస్థ మీ జీవితమునందు తటస్థించి యుండెనో, లేదో, విచారించి చూడుడు. ప్రేమ

యొక్క ఆకర్షణము, సంసారసుఖముయొక్క ఆకర్షణము మన సంపూర్ణహృదయమును, మనస్సును, మోహజాలములోఁ బడ వేసినప్పుడు, ఆ అంధకారావృతసమయమునందు, మోహ మనెడు మేఘముచే మన హృదయము ఆచ్ఛన్నమయిన సమయమునందు, మనపయిన ఎవరి దృష్టియు పడుటలేదా? ఆత్మ వినాశకరములగు కార్యములయందు మనము ప్రవృత్తులమయి యున్నప్పుడు, ఈశ్వరు డడ్డుపడి, మనకు సహాయము చేసి యుండలేదా? మనలను కుటిల మగు ప్రేయోమార్గమునుండి తప్పించి, ప్రాణప్రద మగు, జ్యోతిర్మయమగు శ్రేయోమార్గమునకు మరల్పలేదా? క్షణికము లగు సంసారసుఖములే సారవంతము లయిన వని మన మనుకొన్నప్పుడు, మన ప్రవృత్తులన్నియు విషయభోగముల వైపునకే పరుగు లెత్తుచుండిసప్పుడు, మన హృదయమునందలి సమస్తవాంఛలు, సమస్త ప్రేమ, సంసారమునందే సంపూర్ణముగా బద్ధ మయి యుండినప్పుడు, ఈ యాకర్షణములనుండి స్వయముగా పరమేశ్వరుడే తప్పించి మనల నుద్ధరించి యుండలేదా? అప్పు డాయన మన యాత్మలయందు ఐహికసుఖముల విషయమయి ఉదాసీన భావమును జనింపజేసెను. మన మప్పుడు చేతనమును పొంది, మనలో మన మిట్లు ప్రశ్నించుకొంటిమి. నే నెక్కడనుండి వచ్చితిని? ఎక్కడకు పోదును? నే నేమి చేయుచున్నాను? క్షుద్రములు, క్షణభంగురములు నగు విషయసుఖములలోనే నా జీవిత మంతయు గడుపనా? ఇట్టి ప్రశ్నలు నా హృదయమునందు జనించినతోడనే సంసారముయొక్క నిస్సారత కన్నులకు

గట్టినట్లు కానవచ్చెను. ఈశ్వరుడే కరుణించనియెడల, ఆ మోహజాలమునుండి మన మెంతమాత్రమును విముక్తుల మయి యుండము. సమస్తశాస్త్రములు పఠించినను సరే, సాధుసహవాసముతో మన జీవిత మంతయు గడిపినను సరే. వెనుకకు మరల్పబడిన జలస్రోతమువలె, మన హృదయము మాటి మాటికి సంసారము వైపునకే మరలిపోవుచుండును. కేవలము మన బలముమీదనే ఆధారపడి యున్నంతకాలము ఈ దుర్గతినుండి పరిత్రాణము నొందుదు మను ఆశ లేశమయి నను ఉండజాలదు. మన జీవితమునందు ఈశ్వరుని కరుణా హస్తమును దర్శింపగలిగినప్పుడే మన హృదయములయందు ఆశ లంకురించును. ఈశ్వరునివలన మన మేమియు సహాయ మును పొందజాల మని మనము నిరాశ చెందవలసినంత అవస్థ మన కెన్నడును తటస్థింపకుండునుగాక! వీరిని సన్మార్గమున నడి పించుటకు నా తరము గాదని పరమేశ్వరుడే మనలను పరిత్య జించునంతటి దురవస్థలో మన మెన్నడును పడకుందుముగాక! అట్టి స్థితి దుర్భరము. మనల నాయన మన మన బలము పయిననే ఆధారపడు మని విడిచిపెట్టినయెడల, మన మెంత పాపము చేయుచున్నను, మలినపంకములో బడి మునిగిపోవు చున్నను, ఆయన ఉదాసీనభావముతో జూచుచు ఊర కుండినయెడల, మన మీ పాటికి సమస్తబలమును గోల్పోయి, తరణోపాయమును గానక, సంపూర్ణముగా నశించిపోయి యుందుము. కాని, మన ముపాసించు పరమదేవత అట్టి వాడు కాడు. తన సంతానము నెట్టి పాపి యయినను ఉపే

క్షింపడు. మన మెంత అయోగ్యుల మయినను ప్రేమపూర్వ కముగా సమీపించి, అమృత వర్షమును గురిపించును. నవ జీవనము నొసంగును. భయంకరము లగు సంసార తరంగముల మధ్య, ఆయనయే కర్ణధారి యయి, మన జీవితనౌకను నడి పించుచున్నాడు. మన కాయన నిత్యసఖుడు. మనతో కూడ కూడ నుండి సదుపదేశమును చేసి, దుష్కార్యములనుండి విరతి నొందించి, సత్కార్యములను చేయించుచున్నాడు. మన హృదయములయందు ధర్మబుద్ధిని ప్రేరేపించుచున్నాడు. నవశక్తిని ప్రవేశపెట్టుచున్నాడు. ఆయన బలము వలననే బల యుక్తులమై, సంసారములోని సమస్త ప్రలోభనములతో సంగ్రా మము చేయగలుగుచున్నాము. మనము కొంచెమయినను ప్రయత్నము చేసితిమేని, ఆయన దానికి శతగుణములు బలము నొసంగును. మనము ప్రేయోమార్గమును విడిచి, శ్రేయోమార్గము నవలంబించుటకు రవంతయినను ప్రయ త్నించితిమేని, మనయెదుట పర్వతములతో, మహాసముద్ర ములతో, సమానములయిన వేలకొలది ప్రతిబంధకములున్నను ప్రపంచమంతయు మనకు ప్రతికూలముగా నిలిచియున్నను మన కెంతమాత్రమును భయములేదు. బలవంతులకెల్లను బలము నొసంగెడు పరమపురుషుడే మనకు సహాయభూతుడై యున్నాడు. మనము స్వయముగా దుర్బలుల మని భయపడ వలసిన యవసరములేదు. దుర్బలుల కెల్లను బలము నొసంగెడు పరమేశ్వరుడే మన పక్షమున నున్నాడు. ఆయనను విడిచిపెట్టి సంసారమే మన సర్వస్వమని మనము భావించినప్పుడే, మనము

భయము, శోకము, నిరాశలలో జిక్కి సంసారములో మునిగి యుందుము. కాని, సంసారము మన హృదయము నందలి సకల కామ్యములను పూర్ణము చేయజాలదు. మనయావత్తు ప్రేమయు, సంసారమునందే అర్పింతుము. కాని, సంసారము మనకు ప్రతిప్రేమ నర్పింప జాలదు. సుఖ సంపాదనకు, సంసారమే ఆధారమని, ఉపాయమని, మన మనుకొందుము. కాని సంసారసుఖము ఎండమావులవంటిది. అంతకంతకు ఆశలను పెంచుటేగాని, ఆశలను పూర్ణము చేయజాలదు. సంసారసుఖము అమృత మనుకొందుము. కాని అది విషతుల్యము. మనము దుఃఖములతో క్లేశములతో ఆవృతుల మగుచున్నాము. పాపతాపములతో కృశించి పోవుచున్నాము. శరీరము రోగవంత మగు చున్నది. మనస్సు వికలము నొందుచున్నది. అయినను ఏస్థానముచు ఆశ్రయించినయెడల, మనము నిర్భయముగా నుండగలమో, అట్టి సురక్షిత స్థానమును కనుగొన లేక యున్నాము. సకల దుఃఖములనుండి నివృత్తి చేయగల స్థానము సకల భయములనుండి తప్పించగల పరమపదము, పరమేశ్వరుని మంగళచ్ఛాయయే. ఆయన శరణునొందినయెడల, మన కిక దేనివలనను భయము లేదు. ఆయన శరణాగతవత్సలుడు. ఎట్టి పాపినయినను, ఎట్టి దీనునయినను, ఆయన వదలిపెట్టడు. ఈ క్షణమునుండియు, మన మందరమును ఆయనకు శరణాపన్నుల మగుదము. సమస్త భూతములును ఎవనినుండి జవసత్వములను పొందుచున్నవో, ఆయన బలమువలననే బలయుతులమై, నిర్భయులమగుదము. సోదరులారా! శ్రేయఃపథ

మును బరిత్యజింపుడు. శ్రేయఃపథము నవలంబింపుడు. ఈశ్వరుడు తప్పక తోడుపడును. ఆయన బలమే బలము, ఆయన యాశ్రియమునందే మన జీవనము. ఆ ప్రేమసూర్యుని కిరణజాలము మన యాత్మలయందు ప్రజ్వలించినయెడల, మనము నవజీవనము నొందుదుము. ఆయన ప్రకాశమువలన మన హృదయమునందలి సమస్తక్షుద్రభావములును అస్తమించును. సూర్యోదయమయిన వెంటనే చంద్రుడు కళావిహీను డగును. మన హృదయములయందు ఈశ్వరజ్యోతి ప్రకాశించిన యెడల మలినభావములకు క్షుద్రచింతలకు చోటుండదు. అప్పుడు నా శోభ, నా మహత్వము, నా మానాభిమానములు అంతరించును. సూర్యు డస్తమించి గగనమండల మంతయు, అంధకారముతో నలముకొన్నప్పుడు, మిణుగురు పురుగులు సహితము, తమతమ ప్రకాశమును వెల్లడించును. అదేవిధమున హృదయము అజ్ఞానాంధకారముతో నలముకొన్నప్పుడు, ఈశ్వరజ్యోతి సంపూర్ణముగా ఆరిపోయినట్లు కానవచ్చినప్పుడు, నా పేరుప్రతిష్ఠల పయి, నా మరియాదపయి, మహత్వము పయి, నాదృష్టి ప్రసరించును. అప్పుడు ఆ యంధకారరజనియందు, నా స్వల్పశోభ సహితము ప్రకాశించును. హృదయము ఈశ్వరప్రేమతో నిండినయెడల, నాదృష్టి నావైపునకు మరలదు. అప్పు డుండు చింత యిది:—ఏవిధముగా ఆ మహాపురుషుని పూజ జగమంతయు ప్రచారితమగును? ఎట్లు ఆయన మంగళ కిరణములతో సకలహృదయములు అనురంజితములగును? ఎట్లు ఆయన జ్ఞానము, ప్రేమ మొదలగు మంగళ

భావములు సకలస్థానములయందు వ్యాప్తములగును? ఇట్టి చింతలతోనే మనస్సు వ్యాకులపడుచుండును. అప్పుడు నాకు నన్నుగురించిన యాలోచన లుండవు. ఈశ్వరమహిమ నెట్లు మహిమాన్వితముగా చేయగలుగుదును అను నాలోచన యందే నా సమస్తశక్తుల నుపయోగింతును. ఎప్పుడు నన్ను మరచి ఈశ్వరునే చూతునో అప్పు డాయన మహిమతో నా హృదయము నిండిపోవును. ఎప్పుడు ఈశ్వరుని మఱచి నన్నే చూచుకొందునో, అప్పుడు సంసారమునందలి క్షుద్రభావముల తోనే నేను ముగ్ధుడ నగుదును.

ఓ పరమాత్ముడా! మాకు శుభబుద్ధి ననుగ్రహింపుము. ప్రేయోమార్గమునుండి మరలించి శ్రేయోమార్గమునకు తీసి కొని పొమ్ము. మా దుర్బల హృదయములయందు నీ బలమును ప్రవేశపెట్టుము. అధమాధములను సహితము ఉద్ధరింపగల నీ మధురనామము సమగ్రభూమండలమునందును, ప్రచారము చేయగల శక్తిని మా కొసంగుము. మా జీవితములను కృతార్థత నొందింపుము. నీ మహిమను చాటుటకే, మా సంపూర్ణ హృదయము, మనస్సు, సమర్పింతుముగాక! నీవు మాపయి నీ సంపూర్ణానుగ్రహమును ప్రవహింపజేయుము.

ఓం ఏకమే వాద్వితీయమ్

---

ఓమ్ తత్సత్

# మహర్షి మహోపదేశములు

## ౨౫ వ ఉపదేశము

శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేతః, తౌ సంపరీత్య
వివినక్తి ధీరః। తయోః శ్రేయ ఆదదానస్య
సాధు భవతి, హీయతేఽర్థాత్ య ఉ ప్రేయో వృణీతే.

ఈశ్వరుని యెడ భక్తిశ్రద్ధలను వికసింపజేయుట, హృదయపూర్వకముగా పరమాత్మతో అచ్ఛేద్యము, నిగూఢము, నగు యోగమును స్థాపించుకొనుట, ఆయన మార్గము ననుసరించి ఆయనకు హితమయిన కార్యములను చేయుట, ఇది శ్రేయోమార్గము. స్వేచ్ఛాచారి యగుట, ఇంద్రియ సుఖములయందు, విషయభోగములయందు, ప్రమత్తులయి, ధర్మమును ఈశ్వరుని పరిత్యజించి, సాంసారిక మోహములో ముగ్ధుడగుట, ఇది ప్రేయోమార్గము. కల్యాణప్రదమగు శ్రేయము నాశ్రయించిన యెడల, అది మనల నీశ్వర సన్నిధానమునకు తోడుకొనిపోవును. ఇంద్రియసుఖములకు జిక్కి, ప్రేయము ననుసరించిన యెడల, మనము సంసారచక్రములో చిక్కుకొని, దాని మోహజాలములో పడిపోదుము. "అన్యత్ శ్రేయః అన్య దుతైవ ప్రేయః, తే ఉభే నానార్థే పురుషం సినీతః" అన్నట్లు శ్రేయమును

ప్రేయమును, ఇవి రెండును మనుష్యహృదయమును భిన్న భిన్న మార్గములకు ఆకర్షించి తీసికొనిపోవును. శ్రేయము మనలకు పరిపరిధమమున సాన పెట్టబడిన మంగలికత్తియొక్క వాయివలె మహాతీక్ష్ణమయి, దుర్గమమగు ధర్మపథమునందు నడిపించినను తుదకు అమృతనికేతనుని సన్నిధానమునకు తీసికొనిపోవును. మరియు ప్రేయము ప్రారంభముననే నానాప్రలోభనములను ప్రదర్శించి ఈశ్వరునికి, ధర్మమునకు, విరుద్ధమయిన మార్గమున ప్రయాణము చేయించి, తుదకు అగ్నిమయములగు తప్తతైల ప్రవాహములలోనికి తీసికొనివెళ్ళి పడవేయును. ఒక పక్షమున ఇంద్రియసేవ, విషయభోగము, ప్రభుత్వము, అభిమానము, స్వేచ్ఛాచారము. రెండవ పక్షమున ధర్మలాభము, ఆత్మ ప్రసాదము, సాధుభావము, ఈశ్వరుడు, స్వాతంత్ర్యము. మీరు వీనిలో నే మార్గమున ప్రయాణముచేయుట కిష్టపడుదురు? అప్రతిహతమగు ధర్మబల మపేక్షించిన యెడలను, ఆత్మలను దృఢముగాను, ఉన్నతముగాను, బలిష్ఠముగాను, చేసికొన దలచినయెడలను, ఆత్మప్రసాదమును పొందుట కిచ్ఛయింపుడు. మన తండ్రియగు నీశ్వరు నాలింగనము చేసికొనవలె ననెడి యాశ మీ హృదయమునందు జనించినయెడల, మీరు శ్రేయో మార్గము నవలంబింపుడు. అది మన హృదయమునందలి కుటిల గ్రంథుల నెల్ల శిథిలము గావించి, వాని బంధనమునుండి మిమ్ము విముక్తులను జేసి, ఆ సుందరమంగళపురుషుని యొక్క అనంతప్రసారిత మగు ఒడిలోనికి తీసికొనిపోయి చేర్చును. శ్రేయము నవలంబించినయెడల, అమూల్యమగు ధర్మరత్న

ములు పొందనగును. ఈశ్వరుని ప్రసన్నవదనమును దర్శింప వచ్చును. ఆయన యొడియందు విశ్రాంతి నొంది, అందువలన కలిగెడు విమల బ్రహ్మానందము ననుభవింపవచ్చును. శ్రేయో మార్గమే మనుష్యు లనుసరింపవలసిన మార్గము. అదే దేవత లనుసరించు మార్గము. శ్రేయోమార్గమే మన మనంతకాలము ప్రయాణము చేయవలసిన మార్గము. శ్రేయమునకే మన హృదయమునందు స్థానము నిచ్చి, ప్రేయమును దూరముగా తరిమివేతము. ఓ బ్రాహ్మయువకులారా! జాగ్రత్తపడుడు. యౌవనారంభమునందే మీరు బాగుగ విచారించి మరీ అడుగు పెట్టుడు. ఇప్పుడు మీ జ్ఞాననేత్రము తేజస్వంతముగా ప్రకాశించు చున్నది. మీ శరీరము, మనస్సు ఉత్సాహబలముచే బలిష్ఠము లయియున్నవి. ఈ తరుణవయస్సులో మీరు తృణాచ్ఛాదిత, తమోవృత, కూపసదృశ ప్రేయోమార్గమున పడకుందురు గాక! వినుడు. అదిగో శ్రేయము మిమ్మాహ్వానించుచున్నది. "రండు! మిమ్ము నేను జ్యోతిర్మయ బ్రహ్మధామమునకు తీసి కొని పోవుదును" అని పిలుచుచున్నది. మన హృదయము నందు శ్రేయః ప్రేయములకు రెండింటికిని ఘోరమయిన సంగ్రామము జరుగుచున్నది. మన మా సమరభూమి యందు వాసము చేయుచున్నాము. ఒక వైపున ప్రేయము మన రెండు కాళ్లను పట్టుకొని బలవంతముగా లాగుకొనిపోయి, సంసార సముద్రమునందు ముంచ జూచు చున్నది. రెండవ పక్షమున మాతృప్రేమతో నిండిన శ్రేయము మన రెండు చేతులు పట్టు కొని, బతిమాలి ప్రేమపూర్వకముగా తీసికొనిపోయి, ఆ

యమృతనికేతనుని చేర్పజూచుచున్నది. లోపలవిషము పెట్టుకొని, పయికి మధురవాక్యములు పలుకు ప్రేయము అడ్డము వచ్చి, "శతాయుషః పుత్రపౌత్రాన్ వృణీష్వ, బహూన్ పశూన్ హస్తి హిరణ్య మశ్వాన్." మీరు పూర్ణాయుర్దాయము గల పుత్రులను, పౌత్రులను, ప్రపౌత్రులను, కోరుకొనుడు. ఏనుగులు, గుఱ్ఱములు, రథములు వరింపుడు. బంగారు, మణి మాణిక్యములు రాసులు రాసులుగా మీకొఱకు సిద్ధము చేయబడియున్నవి. మీరు నా మార్గమున రండు. సుగంధయుతు డగు గంధవహుడు వీవనలు వీచి, మీ శరీరమును చల్లబఱచును. మీ రమ్య హర్మ్యములయందు, రాత్రింబగళ్ళు, నృత్యగీతములు, హాస్యపరిహాసాదిసంతోషజనకము లగు సకల కార్యములును, నిరంతరము జరుగుచుండును. మీ రనుభవించు ఇంద్రియసుఖములకు మేర యుండదు. మీ చిత్తమెప్పుడును ఆమోదప్రమోదములతో నిండియుండునట్లు సమస్తోపాయములును కల్పింపబడును. మర్త్యలోకములో దుర్లభు లగు అప్సరసలు, రంభామేనకాది దేవతాకన్యలను మించిన గాంధర్వస్త్రీలు, మీకు పరిచారికలుగా నుందురు. మీరు సువిశాలరాష్ట్రములకు ప్రభువు లగుదురు. మీ వైభవమును జూచి సమస్తజనులు మీకు పాదాక్రాంతు లగుదురు. మీ కీర్తి దశదిశల గానము చేయబడును. నా యుపదేశమును వినుడు. నా సేవ నంగీకరింపుడు. మీకు భూమండలాధిపత్యము లభించును. మీరు చిరంజీవు లగుదురు" అని గంభీరధ్వనితో ఘోషించును. కాని, ధీరుడగు సాధుయువకుడు, వాజశ్రవుని

పుత్రుఁడగు నచికేతునివలె, ప్రేయముచెప్పెడు అనర్థక మోహ వాక్యములను వినియు, గంభీరమహాసాగరమువలె, తరంగ శూన్యమగు మహాసముద్రము వలె, హృదయమునం దెంత మాత్రమును చాంచల్యము నొందక, "సర్వేంద్రియాణాం జర యంతి తేజః" అన్నట్లు నీవు నాకు ప్రదర్శించు ప్రలోభనము లన్నియు, స్వల్పకాలములోనే నా సకలేంద్రియములను జీర్ణము గావించి, అచిరకాలములోనే వాని తేజము నంతను నశింపజేయును. అంతకుఁడు నా పార్శ్వముననే దాగి యున్నాఁడు. ఈపన్నాత్రి మవకాశము చిక్కినను, నా ధన మును, ప్రాణమును, సకలమును హరించివేయుటకు సంసిద్ధుఁడై యున్నాఁడు. నీ గుఱ్ఱములు, నీ రథములు, నీ నృత్యగీత ములు, నీ సుందరస్త్రీలు నీకే యుంచుకొనుము. నీ వేమి నా కియ్యఁగలవో, వానివలన నా కెన్నఁడును తృప్తి కలుగ జాలదు. "న వి త్తేన తర్పణీయో మనుష్యః" అన్నట్లు ఐశ్వర్యము మానవుని తృప్తి నొందింపజాలదు. నే నే విధమయిన సంసార ప్రలోభనములకును లొంగను. అస్థిరములు, క్షణభంగుర ములు నగు పదార్థములు నా చిత్తము నాకర్షింపజాలవు. నేను చిరకాలానుభవమువలన తెలిసికొంటిని. సంసారము నా కిది వర కెన్నఁడును నిజమయిన సౌఖ్యము నీయలేదు. ఎప్పుడును శోకము, చింత, నన్ను బాధించుచునే యుండెను. భవిష్య త్కాలమునందును నాకు శాంతి నియ్యజాలదని నాకు నిశ్చ యముగా తెలిసినది. కావున, నేను నీ ప్రలోభన వాక్య ములకు మోసపోయి, సంసారముయొక్క కుటిలమార్గము

నందు పడనొల్లను. దేనిని ప్రేమించినయెడల సమస్తమును ప్రేమించగలనో, దేనివలన నా హృదయమునందు సమగ్ర ప్రేమ వ్యాపించునో, దేనివలన అక్షయసుఖము లభించునో, దేనివలన శాశ్వత బ్రహ్మానందము సమకూరునో, అట్టి అమూల్యమగు ధనము నీ దగ్గర నున్నయెడల, దానిని నా కిచ్చి నా మనోవ్యాకులతను మాన్పి, నా హృదయమునకు శాంతి కలిగింపుము. నేను నా జీవితకాలమందంతయు, నీ పాదములకు సేవ జేయుచు నీకు దాసుడనయి పడియుందును,'' అని ఆ ధీరుడు ప్రత్యుత్తర మిచ్చెను. ఈ ప్రశ్నకు ప్రేయము మౌనముద్ర వహించి, ఆ ధీరుని వదలి, తనదారిని పోవును. అప్పుడు ఒంటరిగా నుండు ఆ సాధు యువకుడు నలుదిశలను అంధకారమునే దర్శించి, నిశ్చేష్టుడయ్యెను. విషయప్రలోభనములు అతనిని విడిచిపోయెను. కాని అతని హృదయ మింకను శూన్యముగా నుండెను. అభావ విమోచనము కాలేదు. అతడు పార్థివసుఖముయొక్కయు, స్వర్గీయ సుఖముయొక్కయు, అభావముచే విషాదసాగరము నందు నిమగ్నుడయ్యెను. సంసారము శ్మశానతుల్యమయ్యెను. ఇది జీవితములో నొక భయానకావస్థ. ఈయవస్థయందు సంసారసుఖ మొంతమాత్రమును రుచింపజాలదు. ఈశ్వరానందముయొక్క యభిరుచియు గలుగలేదు. ఈశ్వరుని కొరకు హృదయమునం దొక గంభీరమయిన అభావము బోధ మగుచుండెను. కాని ఆ అంతరఅభావ మెట్లు విమోచన మగునో, దాని కుపాయ మేమియు కానరాదయ్యెను.

హృదయము తృష్ణార్తమగు లేడివలె వ్యాకులవంత మయ్యెను. సంసారదవానలముచే శరీరము దగ్ధమగుచుండెను. ఈ శోకదవానలముయొక్క దుఃఖమునుండి పరిత్రాణము నొందు నిమిత్తము వ్యాకులహృదయముతో, కనపడినవారి నెల్లను ఉపాయ మడుగుచుండెను. ఎవనిదగ్గరనుండియు, శాంతిప్రదము, సంతోషజనకము నగు ప్రత్యుత్తరము పొంద డయ్యెను. ఇట్టి యవస్థలో నడి, ఎప్పుడు సాధుయువకుడు విలపించుచుండెనో, ఎప్పుడతడు అసహాయుడయి జీవనసఖునికొరకు అన్వేషణము చేయుచుండెనో, అప్పుడు మంగళోద్దేశములు గల శ్రేయము శుభ్రవస్త్రధారిణియయి, శాంతిరసామృతకలశము చేత బూని అతని సమక్షమున ప్రత్యక్షమయి, ఉపశమన వాక్యముల నూరడించెను. "నీ వేల శోకసాగరమునందు మునిగియున్నావు. ఏల విషాదాగ్నిచే దగ్ధము నొందుచున్నావు? శాంతివిహీనుడవయి ఈ యరణ్యమధ్యమున నేల తిరుగుచున్నావు? ఎవని ప్రేమసుధతో ఈ సంసారము మధుమయ మగుచున్నదో, అతని ప్రేమస్వరూపమును మంగళమూర్తిని దర్శింపుము. దుఃఖసంతప్తము లగు అశ్రుధారలను ప్రేమాశ్రుధారలుగా, ఆనందాశ్రుధారలుగా మార్చివేసికొనుము. ఎవనిని ప్రేమించినయెడల, సమస్తప్రేమయు పరిసమాప్తి నొందునో, ఏ ప్రేమకు వినాశక్షయములు లేవో, అట్టిప్రేమ నార్జింపుము. ఎవనితో యోగము సంప్రాప్తమయినయెడల, ఆ యోగమున కిక వియోగ మెన్నడును కలుగదో, అట్టియోగము సాధింపుము. ఆయన ప్రేమయందు నిమగ్నుడవయి, నీ హృదయ

మును చల్లబరచుకొనుము. లెమ్ము, మోహనిద్రనుండి మేల్కొనుము. నా మార్గము నవలంబింపుము. నేను నిన్నా ప్రేమమయుని అమృతక్రోడమునందు చేర్పగలను” అని మృదుమధుర వాక్కుల నూరడించును. శ్రీయముయొక్క ప్రేమపూర్ణములు, మృతసంజీవనములు నగు ఈ వాక్యములను విని, ఆయువకుని మనస్సు కరగెను. అప్పు డతడు ససంభ్రమముగా శ్రేయము నడిగెను. “నీ వెవరవు? ఎక్కనుండి వచ్చితివి? ఏమి చేసినయెడల, ఎక్కడకు వెళ్ళినయెడల, నా యీ దుస్సహదుఃఖ ముపశమించును? ఎవని ప్రేమనీరముచే నా యీ శుష్కహృదయము రసవంతమయి చల్లబడగలదు?” అని ప్రశ్నించెను. అప్పు డాయనతో శ్రేయము కరుణారస ముట్టిపడునట్లు చెప్పసాగెను. “ఎవడు మహాత్ముడో, ఎవనినుండి సమస్తభూతములు ఉదయించుచున్నవో, ఎవడు సమస్తభూతములకు సంరక్షకుడో, ఐహిక జీవనానంతరము ఎవని యొడియందు సమస్తభూతములు చేరుచున్నవో, ఎవడు ప్రేమసముద్రుడో, పరిశుద్ధమూర్తియో, జ్ఞానస్వరూపుడో, అట్టి అద్వైతపరబ్రహ్మమును దర్శింపుము. అతనికొఱకు భూమ్యాకాశములు వెదకనక్కరలేదు. అతడు నీ హృదయమునందే విరాజిల్లుచున్నాడు. నీ పరిమిత ఆత్మయందే, అపరిమితు డగు ఆ యమృతపురుషుడు ప్రకాశించుచున్నాడు. వ్యాకులహృదయముతో, శోకపూరితమానసముతో, ఆయన దర్శనముకొఱకు ప్రార్థింపుము. ఆయన నీ యెదుట జ్యోతిర్మయమగు తన మంగళస్వరూపమును తప్పక ప్రకాశింపజేయును. ధర్మముయొక్క సరళమార్గమును నీకు

కనబరచును. మన మహాత్ములు ధర్మమార్గము సానపెట్టబడిన మంగలికత్తియొక్క వాయివలె దుర్గమమని చెప్పియుండిరి. అయినను ఈశ్వరానుగ్రహము గలవారికి, ఆ దుర్గమపథము సుగమమగును ధర్మము ననుసరింపదలచినయెడల, సుఖ దుఃఖాదిద్వంద్వములను ఉదాసీనభావముతో చూడవలయును. ధర్మము సుఖమువలనను వృద్ధినొందును, దుఃఖమువలనను వృద్ధి నొందును. ధర్మము సంపదయందును ఉన్నతినొందును, విప త్తులయందును ఉన్నతి నొందును విపత్పరంపరలలో జిక్కు కొని నిరాశుడగువాని హృదయమునందు ఆశల నంకురింపజేసి రక్షించునదియు ధర్మమే, ఐశ్వర్యవంతుని గర్వభంజనము గావించి నమ్రభావమును నెలకొల్పి రక్షించునదియు ధర్మమే. ఈ పృథివి మన గమ్యస్థానము కాదు. ఇది మన పరీక్షాస్థానము. క్రమశిక్ష నలవరచుస్థానము. ఇక్కడ ధర్మముకొరకు దుఃఖము సహించుకొనవలసి యున్నది. విపత్తుల నాలింగనము చేసికొన వలసియున్నది. త్యాగమును స్వీకరింప వలసియున్నది. ఇది యేది యన నేల? సమయమునుబట్టి ఈశ్వరాభిప్రాయము ననుస రించి, ధర్మముకొరకు నీ సర్వస్వమును, నీ ప్రాణమును సహితము నిస్సందేహముగా, సంతోషపూర్వకముగా, బలిదానముగా నర్పింప వలసియుండును. సుఖము కలుగునను నాశతో ధర్మ మాచరింప ప్రయత్నించుట కుటిలత, మోసము. నేను నీకు సుఖమే సమకూర్తునని ఆశపెట్టజాలను. ప్రేయమువలె నేను నీకు మిథ్యాప్రలోభనములు ప్రదర్శించి, లేనిపోని ఆశలను కల్పించను. సుఖముసందును ధర్మము ఉన్నతినొందు ననుమాట

నిజమే. కాని, ధర్మముయొక్క బహుమానము సదా సుఖమే కాజాలదు. దేవతలచే సహితము సేవింపదగిన ధర్మమునకు శాశ్వతానందపదవి సమకూర్చగల ధర్మమునకు, అనిత్యము, క్షణికమునగు సాంసారికసుఖ మెన్నడును బహుమతి కాజాలదు. ఏ సుఖము ధనధాన్యములపయిన ఆధారపడియుండునో, ఏ సుఖము రక్తమాంసములపయిన, స్నాయుసిరలపయిన ఆధారపడియుండునో, ఏ సుఖము ఇతరులను మోసము చేసియు పొందనగునో, అది ధర్మమువలన వచ్చెడు బహుమాన మెన్నడును కాజాలదు. ధర్మముయొక్కబహుమానము ధర్మమే. ధర్మముయొక్కబహుమానము ఆత్మప్రసాదము, మనశ్శాంతి. ధర్మముయొక్కబహుమానము స్వయముగా నీశ్వరుడే. నీ హృదయమునందలి ప్రేమను ప్రజ్వలింపజేసి, నీ హృదయేశ్వరుని ప్రత్యక్షము చేసికొనుము. క్షుద్రభావములను పరిత్యజించి, ఉదారభావములను భావింపుము. స్వయముగా నీకొరకేమియు నుంచుకొనకుము. సమస్తమును ఆయనకే సమర్పింపుము. ఇప్పుడే ఆయనను దర్శించి కృతార్థుడవు కమ్ము'' అని మృదుమధురవాక్యములతో పలుకును. మంగళమయ మగు శ్రేయముయొక్క ఈ నిగూఢహితకరవాక్యములను విని, ఆ సాధుయువకుడు పరమశరణ్యు డగు పరమేశ్వరునికి శరణాపన్ను డయ్యెను. ఆయనను తన హృదయమునందు సాక్షాత్కరింప జేసికొని, కృతార్థు డయ్యెను. అప్పు డతని యొకట, సంసారము అపూర్వలావణ్యయుత మగు నొక నూతన కల్యాణతమమూర్తిని ధరించెను. ఆయన శూన్యహృదయము పూర్ణ

మయ్యెను. అతడు ప్రాణస్వరూపు డగు పరమేశ్వరునియందే, తన ప్రాణముల నర్పించెను. మృత్యుహస్తమునుండి పరిత్రాణము నొంది, అమృతత్వము నొందెను. ఇదేవిధమున, ఎవరెవరు శ్రేయమునకు పశవర్తులై ఈశ్వరునికొరకు సర్వస్వము నర్పింతురో, వా రందరు అమృతత్వమునొంది ధన్యు లయ్యెదరు. సోదరులారా! మనమును శ్రేయోమార్గము నవలంబించి, మన జీవితములను సార్థకపరచుకొన ప్రయత్నింతము. సర్వదయాపరు డయిన పరమేశ్వరుడు మనప్రయత్నముల సఫలము గావించుగాత!

ఓమ్ ఏకమేవాద్వితీయమ్.

---

ఓమ్ తత్సత్,

# మ హ ర్షి మ హో ప దే శ ము లు

---

## ౨౭ వ ఉ ప దే శ ము

అమృతస్య పరం సేతుం దగ్ధేంధన మివానలమ్.

ఈశ్వరుడు అమృతసాగరమునకు గట్టు వంటి వాడు. కాని, అత డమృత సాగరమునకు సేతు వని చెప్పినంత మాత్రమున, ఆయనను గురించిన సంపూర్ణభావము బోధపడదు. అత డమృతనికేతనుడు. అతడు స్వయముగా అమృతుడే, అమృతమే. ఈ సమాజమునుండి ఏ విధముగా ఈశ్వరునిగురించిన

స్తోత్రవందనములు మన మహేశ్వరసమక్షమునకు పంపు చున్నామో, అదేవిధముగా, అతడును ఈ సమాజమందిరము నందు నలువైపులనుండియు, అమృతమును ధారాపాతముగా వర్షింపుచున్నాడు. మనము పగ లంతయు త్రాగిన విషయ సుఖములనెడు గరళముచలని బాధయొక్క ఉపశమనార్థము, ఒక బిందుమాత్రామృత మయినను మన హృదయమునందు స్థానము నొందినయెడల, మనము ధన్యులము. ఇప్పు డాయన అమృత వారిని నిరంతరధారగా వర్షింపజేయుచున్నాడు. మనము మన హృదయకలశమును పవిత్రము గావించుకొని, ఎంత యమృతమును ధారణ చేయగలమో, అంతను సంచ యము చేసికొందము. మన మిక్కడకు వచ్చియు, జడములవలె మందులమయి పడియుంటిమేని, ఇట్టి స్తోత్రవందనముల మధ్య ఇట్టి సాధుసంగమునందు, ఇట్టి జాజ్వల్యమాన మగు ఈశ్వరా విర్భావసమయమున, క్షణమాత్ర మయినను, ఆ యమృత వారిని మన హృదయములయందు ధారణ చేయలేకపోతిమేని, ఇటువంటి ప్రేమవారి వర్షింపుచున్నను, మన మాయనకు ఒక బిందుమాత్రప్రతిప్రేమనయినను, సమర్పింపలేకపోతి మేని, మన మెవరియాశ్రయమునందు అనంతకాలము జీవింప వలసియున్నదో, అటువంటి సుందరుడు, నిరవద్యుడు, నిరంజనుడు అగు పరమేశ్వరుని అనుగ్రహసంపాదనము నిమిత్తమయి, మన మేమి ప్రయత్నము చేయుచున్నాము? ఆయన మన లను ప్రేమపూర్వకముగా నాలింగనము చేసికొనుచున్నాడు. మనమును ఆయనను ప్రేమతో నాలింగనము చేసికొందము.

ఇంతకంటె అధికమయిన సౌభాగ్యము మన కేమి కావలసి యున్నది? మన మిందుకొఱకే గదా మానవజన్మ మెత్తితిమి. మన మంతరమును ప్రేమపూర్ణహృదయములతో మన యావ ద్వ్యాపకమును ఆయన హస్తమునందు సమర్పించి జన్మసాఫల్యము నొందుదము. మీ రొకసారి భావించి చూడుడు. ఏ సుందర పురుషునియొక్క ఆలింగనపాశమునందు బంధింపబడుటకు మన హృదయము సర్వదా వ్యాకులపడుచుండునో, ఎవనియొక్క క్షణమాత్ర అదర్శనమువలన మన శరీరము శుష్కించి పోవునో, ఆత్మ వికారము నొందునో ఆ పరమపురుషుడే మనలను సదా ప్రేమపూర్ణదృష్టితో చూచుచున్నాడు. మన మెంత సౌభాగ్యవంతులము! కేవలము చూచుటమాత్రమే కాదు. అతడు మనలను సర్వకాలసర్వావస్థలయందును ఆలింగనము చేసికొనియున్నాడు. ఎప్పుడు మన ప్రేమ ఆయనవైపునకు వ్యాపించునో అప్పుడే ఆయన ప్రేమాలింగనమును మనము తెలిసికొనగలము. మరియు మనము ఈ మర్త్యలోకమునుండి దేవలోకమునకును, దేవలోకమునుండి బ్రహ్మలోకమునకును ప్రయాణము చేసినకొలది, మనయెడల ఆయనకు గల ప్రేమ మరింత ఉజ్వలమయి ప్రకాశించును. ఆయన మనలను మరింత గాఢతరమయిన ఆలింగనపాశమునందు నిబద్ధులనుగా జేయును. మనము ను ఆయనను గాఢతర ఆలింగన పాశములందు నిబద్ధునిగా చేయుదము. ఇట్టి జీవనప్రదమగు ఆశయే లేనియెడల, మన జీవనమెంత నీరసమగును? చూడుడు, ప్రత్యక్షముగా చూడుడు. ఈ సమాజమునందు, ఈ భక్తబృందముయొక్క ప్రేమోజ్జ్వల

ముఖపద్మములయందు, ఆయన యుజ్వలమూర్తి యెట్లు ప్రకాశించుచున్నదో దర్శింపుడు. ఆయన జ్ఞానజ్యోతి సర్వత్ర వ్యాపించియున్నది. బాహ్యమునం దాయన జ్యోతియే. అంతరమునం దాయన జ్యోతియే. స్వప్రకాశమగు ఆ శుభ్రజ్యోతి ముందర, మెఱుపుతీగెలయొక్క కాంతి ప్రకాశించదు. సూర్యుని ప్రభయు కళావిహీన మగును. ఆ గంభీరజ్యోతికి ఆది లేదు. అంతము లేదు, అది ఛాయావిరహిత మగు దివ్య జ్యోతి. నీడలేని నిండు వెలుగు. ఆ జ్యోతియొక్క ఒక్క విస్ఫులింగమే, ఒక్క కిరణజ్వాలయే సమస్తజగత్తును జాజ్వల్యమానముగా ప్రకాశింపజేయుచున్నది. అతడు మండుచున్న దారువులనుండి వెడలు అగ్నిజ్వాలవలె, దేదీప్యమానముగా ప్రకాశించుచున్నాడని శ్రుతులు ఘోషించుచున్నవి. అతనిని గురించి "దగ్ధేంధన మివానలమ్" అని చెప్పుచున్నవి. కాష్ఠమునందు అగ్ని ప్రవేశించి, బాహ్యమును అంతరమును దగ్ధముచేసి దాని జ్వాల లెట్లు ఊర్ధ్వముఖముగా వ్యాపించునో, అట్లే ఈ జగత్తుయొక్క అంతర్బాహ్యములయందు, అణువు అణువునందును జాజ్వల్యమానముగా వెలుగుచున్న పరమాత్మ స్వరూపాగ్ని భూలోకమునుండి ద్యులోకముచకును, ద్యులోకమునుండి అనంతాకాశమునకును వ్యాపించి, అఖిల విశ్వమును పరివేష్టించి సర్వవ్యాప్తమయి యున్నది. ఆయనయొక్క దేదీప్యమాన స్వరూపమును ఇక్కడనే ప్రత్యక్షము చేసికొనడు. ఇక్కడనే ఆయన దర్శనము లభించు నను నాశ లేని యెడల, ఇక ముందు ఆశ యెక్కడిది? ఇటువంటి పవిత్ర

స్థానమునందు అజ్ఞాననిద్రనుండి మేల్కొని, ఇటువంటి సాధు సంగమునందు కూరుచుండి, ఇప్పుడయినను ఆయన ప్రకాశ మును సూర్యప్రకాశమువలె మన హృదయమునందు దర్శింప లేనియెడల, ఈ జీవితమువలని లాభ మేమి? జీవితము వృథా. ధన మాన ఖ్యాతులు వృథా. సమస్తమును వృథా. ఓ సాధు యువకులారా! మీ హృదయమునం దొకసారి ఆయనను పొందవలయు నను నభిలాష జనించినయెడల, మీ హృద యము పాషాణతుల్యమయినను, ఈశ్వరానుగ్రహమువలన, అది శిరీషకుసుమకోమల మగును. ఏ దుశ్చింతయు మీ హృద యమునందు స్థానమును పొందకుండునుగాక! మీ హృద యము సంశయరహితమగు గాక! ప్రేయోమార్గమును విడిచి శ్రేయోమార్గమున ప్రయాణము చేయుడు. ఈశ్వరు డే మార్గమున నియంత యయి యుండునో, ఆ మార్గము నవలం బింపుడు. ఆయనకు శరణాపన్నులు కండు.

ఓ పరమాత్ముడా! నీవే మా సహాయసంపత్తి. నీవే మా ప్రియస్నేహితుడవు. నీవే మా తల్లివి, తండ్రివి. నీవు మా ప్రేమను నీవైపున కున్నతి నొందించుము మా సమస్త భావములను నీ మంగళ భావముల ననుసరింపజేయుము. నీ నుండియే మేము సకలశక్తులను పొందితిమి నీకు హిత మయిన కార్యములు చేయుటయందే, ఆ సమస్తశక్తులను విని యోగింతుముగాక! మా కార్యక్షేత్రము లే దిక్కున నున్నను, ఆ దిక్కున నీ యనిమిషనేత్రమును మేము దర్శింపగలుగుదుము గాక! ఓ పరమాత్ముడా! నీవు మమ్ము నీ సత్పథమున నడి

పించుకొని పొమ్ము. మా జ్ఞాననేత్రము నెదుట ప్రత్యక్షము కమ్ము. ఇదే మా ప్రార్థన. ఇంతకంటె నిన్నేమే మేమని ప్రార్థింపము ?

ఓమ్ ఏకమేవాద్వితీయమ్.

---

ఓమ్ తత్సత్

# మహర్షి మహోపదేశములు

## ౨౭ వ ఉపదేశము

స వృక్ష కాలాకృతిభిః పరోఽన్యో
యస్మాత్ ప్రపంచః పరివర్తతేఽయం।
ధర్మావహం పాపనుదం భగేశం
జ్ఞాత్వాత్మస్థ మమృతం విశ్వధామ
విశ్వస్యైకం పరివేష్టితారం
జ్ఞానం శివం శాన్తి మత్యంత మేతి.

అతఁడు దేశకాలములకతీతుఁడు, అయినను దేశకాలములలోనుండి, ఈ యనంతవిశ్వమును పరిపాలించుచున్నాఁడు. అతఁడు ధర్మమునకాధారభూతుఁడు. పాపవిమోచకుఁడు. ఐశ్వర్యప్రదాత. అందరి యాత్మలయందును ఉండువాఁడు. అమృతుఁడు. విశ్వాశ్రయుఁడు. సర్వమంగళుఁడు. సమస్త విశ్వమును పరివేష్టించి యుండువాఁడు. ఆయనను తెలిసికొని, మానవులు

పరమశాంతిని పొందుచున్నారు. ద్యులోక భూలోకములు, దేవమనుష్యగణములు, పశుపక్షులు, ఆయన నిశ్వాసమువలననే నిశ్వాసమును విడుచుచున్నవి. ఆయనయందే ఈ యనంత బ్రహ్మాండము సంచరించుచున్నది. అతడందరికిని రాజు. అతడు రాజాధిరాజు. త్రిభువనపాలకుడు. అతడు కేవలము జడ జగత్తునకు మాత్రమే రాజు కాడు. అతడు ధర్మరాజ్యమునకును రాజు. అతడు మన శరీరమున కెట్లు సుఖమును సమకూర్చుచున్నాడో, అదే విధమున మన ఆత్మను సహితము పోషించుచున్నాడు. ధర్మమూర్తి యగు పరమేశ్వరుడు "సత్యస్య సత్యం" సత్యమునకు సత్యము. "సత్యస్య పరమం నిధానం" సత్యమునకు పరమనిధానము. ఆయన యాజ్ఞ ననుసరించియే, ఆయన యాశ్రయమునం దుండియే, ఈ జగత్తు సకలజీవ రాసులకును మంగళమును సమకూర్చుచున్నది. అతడు మనలను పాపతాపములనుండి ఉద్ధరించి, అమృతనికేతనమునకు తీసికొని పోవుచున్నాడు. మన మీ ప్రపంచమునందు, కష్టసముద్రమునందు మునిగి, ఐశ్వర్యశాలి యగు ఒక ప్రభువుతో మొరపెట్టు కొనినయెడల, మనల నతడు ఆ ఘోరవిపత్తు నుండి ఉద్ధరింపవచ్చును. కాని, మనలను పాపమునుండి పరిత్రాణము నొందింపగలవా రెవరు ? పాపమునుండి యుద్ధరించుటకు మ రెవ్వరికిని సాధ్యము కాదు. ధర్మమూర్తి, పాపనుదుడు నగు పరమేశ్వరు డొక్కడే మనలను పాపమునుండి యుద్ధరింప గలవాడు. ఆ ధర్మమూర్తి ఆశ్రయమునం దుండియే, మనము ధర్మమును నాచ

రించుచున్నాము. ఆయన యాశ్రయమునందే, మనము పశుభావము నతిక్రమించి, దేవభావమును పొందుచున్నాము. మన మాయన యాజ్ఞలను మీరి, ఎప్పుడు కుటిలచింతలకు మనహృదయమునందు స్థానమిత్తుమో, అప్పు డాయన మనలను ఉచితదండన నొసంగి శిక్షించును. అతడు వజ్రాయుధముపు పూని, మనహృదయమును శతధా సహస్రధా ఖండించును. కానిశిక్షయందును ఆయన నిరుపమానమయిన ప్రేమయే ప్రకాశించుచున్నది. కరుణామయుడగు మన తండ్రి మనకు స్వాతంత్ర్యము నిచ్చియు మనలను విడిచియుండలేదు. నిరంతరమును మనతో కూడ కూడనే యున్నాడు. మనము దారి తప్పి, పాపపంకముతో నిండిన సరస్సునందు పడి, మునిగి పోదుమేమో యని, క్షుద్ర సంసార లోభ మోహములయందు పడి, ఉద్ధరించువారు లేక, శోకింతుమేమో యని, దీనబాంధవుడగు నాతడు తన అమోఘసాహాయ్యమును అందించుటకు నిరంతరమును కనిపెట్టుకొని యున్నాడు. మనమెప్పుడు అతడు నిషేధించిన మార్గమునందు అడుగు పెట్టుదుమో, తత్క్షణమే, అతడు మన హృదయమునందు మనోవేదనారూప మగు వజ్రాయుధమును చొప్పించి, మన మనస్సును కలత నొందించును. మనమప్పుడు అంతర్యామి యగు ఆ విధాతృహస్తమును చూడ గలుగుదుము. తల్లి ఎట్లు శిశువును చేయి పట్టుకొని అడుగులు వేయించి, నడక నేర్పునో, అట్లే ఈశ్వరుడును మన హృదయమునందుండి దివ్యమార్గమునందు నడిపించుచున్నాడు. మనము ధర్మసోపానముల నెక్కి, అమృతపదవిని సమీపించిన

కొలదిని, ఆయన ప్రేమముఖమును దర్శింపగలుగుచున్నాము. ఆయన మనకు బాహ్యమునందు లేడు. సదా మన హృదయమునందే కాపురమున్నాడు. ఆయన మన హృదయేశ్వరుడు. ఆయన మన హృదయమునందే లేనియెడల, మనము రహస్యముగా ఒక నిర్జనారణ్యమున, మేఘాచ్ఛన్నమయి అంధకారావృతమయిన ఒక అర్ధరాత్రి, పాపకార్యము నాచరించినను, మన హృదయమునందు బాణము గ్రుచ్చుకొనినట్లు, ఏల ఒక అనిర్వాచనీయమగు హృదయసంతాపము జనించును? మనము సహింపరాని హృదయవేదనతో బాధనొందుచు, బాణము గ్రుచ్చుకొనిన లేడి వలె, రక్షకుని కొఱకు నలువైపుల నిరీక్షించుచున్నప్పుడు, మన యెదుట, యెత్తబడిన వజ్రాయుధమును చేత బూని, ఎవరు భయంకరమూర్తి ప్రకాశించునో, అతడే మన ప్రియ జనకుడు. అప్పుడు సహితము, ఆయనప్రేమను మన మనుభవింపకుండ జాలము. ఎప్పుడాయనదండన ననుభవించి, ఆయన యెదుట విచారింతుమో, ఎప్పుడు పాపమునుండి విముక్తులమయి క్రమక్రమముగా, ఆత్మప్రసాదమును, మనశ్శాంతిని, పొందుదుమో, అప్పుడాయన ప్రేమను తెలిసికొని, కృతజ్ఞతాపూర్వకముగా, ఆయన పాదములకు సాష్టాంగ దండ ప్రణామములు సమర్పింతుము. మనము ఘోరపాపాత్ములమయినను ఈశ్వరానుగ్రహముచే పాపబాధనుండి విముక్తులము కాగలుగుచున్నాము. ఈ మర్త్యలోకమునందు అవిధేయుడగు పుత్రుని ఇంటినుండి తరిమివేసి, తండ్రి, అతనిని తిరిగి కంటచూడడు, వెంట పలుకరించడు. కాని, ఈశ్వరుడెన్నడయిన తన పుత్రుని

ఎంత అవిధేయు డయినను, ఎంత పాపాత్ము డయినను, విడిచి పెట్టి యూరకుండునా? వీ డవిధేయుడు, పాపి, ద్రోహి, వీడు పరిత్యజింప దగినవాడు అని ఈశ్వరు డనుకొనునంత పాపి లోకమునం దుండునా ? ఎన్నటికిని ఉండడు. ఆయన ఘోరతర మగు మహాపాపుల లోహమయహృదయకవాటములను భేదించుకొని లోపల ప్రవేశించి, తగినరీతిని వేయువిధముల దండించి, తుదకు ఆ పాపిని తిరిగి తన యొడిలోనికి చేర్చుకొనును. అతడు భయంకరాకారమును దాల్చును. పలువిధముల దండించును. మనోవిచారరూప మగు కత్తెరతో పాపుల హృదయములను కత్తిరించి, పావనులుగా జేయును. మనము మన యిచ్ఛాపూర్వకముగా పాపమార్గమును పరిత్యజించి, ఆయన అమృతఆశ్రయమును చేరుదము. మన హృదయము నుండి పాపపంకము కడిగివేయబడని యెడల, మలిన దర్పణమునందు ప్రతిబింబ మెట్లు కానరాదో, అట్లే మన యాత్మయందును ఈశ్వరస్వరూపము ప్రకాశింపదు. కనుకనే ఆయన ముందుగా ఉచితదండనను విధించి మన పాప పంకమును దూరముచేయును. తరువాత తన ప్రసన్నముఖమును ప్రదర్శించి మన మాయనను మోహించి ప్రేమించునట్లు చేసికొనును. అతడు పాపాత్ముల యొక్కయు, పుణ్యాత్ములయొక్కయు, సమస్త మానవుల హృదయములయందును అధివసించి, వారు తమ పరమపురుషార్థమును సాధించునట్లు చేయ ప్రయత్నించుచుండును. ఆయన పుణ్యాత్ముల హృదయములయందు ఆత్మప్రసాదన మనియెడు అమృతవారిని వర్షించి అంతకంతకు

ఉత్సాహభరితులనుగా జేసి, సత్కార్యశీలురను జేయు చుండును. వారిని సోపానమునుండి సోపానమున కెక్కించి, అనంతోన్నతిపథమున తీసికొనిపోవుచుండును. అట్లే పాపాత్ములకు కష్టము తరువాత కష్టమును కలిపించి, దుర్భిక్షాది క్లేశములలో ముంచి, పవిత్రులను గావించి, తుదకు తన యమృతక్రోడమునందు కూరుచుండబెట్టుకొనును. పాపవిమోచకుడు, మోక్షప్రదాత, కేవలము పరమేశ్వరు డొక్కడే. మనము వేలు, లక్షలు పాపకృత్యముల నాచరించి, ఈ వసుంధరకు భారము నిచ్చుచు, ఘోరపాపుల మయి యున్నను, ఆయన యనుగ్రహమునకయి పార్థించినయెడల, ఆయన అనుతాప రూపదావాగ్నిని మన హృదయమునందు రవుల్కొల్పి, మనల నేడిపించి యేడిపించి, తుదకు సమస్త పాపకృత్యముల నుండియు విరతులనుగా జేయును. ఈశ్వరుడు మనలను పాపము నుండి విముక్తులను జేయుటయేగాక, మన హృదయమునందు, ఆత్మప్రసాదరూపమున నవతరించి, హృదయశాంతిని ప్రసాదించును. ఈశ్వరుడు కరుణామయుడగు తండ్రి యన్నమాట వాస్తవమే. మనము అనుతాపము నొందినయెడల, శాంతి వారిని వర్షించి, మనల నూరడించు ననుమాటయు వాస్తవమే. కాని, ఆ యనుతాపము, ఆ యాత్మగ్లాని, ఎన్నడును వాంఛనీయములు కావు. అవి హృదయమునందలి రక్తమును శుష్కింపచేయును. కపటవేషధారి, కఠినహృదయుడు, ఘోరసంసార తాపత్రయనిమగ్నుడు అయిన మానవుని హృదయము నందు అట్టి యనుతాపాగ్ని జనించినను జనించుగాక! ఉత్కట

వికారరోగపీడితుడగు మనుష్యునికి గరళము త్రాగించినయెడల సారవిహీనములయిన నరములయందు, నూతనపటుత్వ మంకు రించి, కొంతవరకు రోగనివారణమయి, చైతన్యోదయ మగు నట్లే ఈ పరితాపాగ్నియును, పాపాత్ముల పాషాణహృదయము నందు ప్రవేశము నొందినయెడల, వారిని అజ్ఞానయుత మగు జడత్వమునుండి మేలుకొల్పి నవజీవనము నొసంగును. మంగళ మయుడగు పరమేశ్వరుని ఆదేశములకు విరుద్ధముగా, మన మేకార్యమును చేయకుందుముగాక! సర్వతోభావముగా ఆయన యాజ్ఞలనే పాలింతుముగాక! ఆయన యాదేశించు ఉపదేశము లన్నియు కేవలము మన సౌభాగ్యము కొరకే. కాని, మనము బుద్ధిహీనతచే కృతఘ్నులమయి ఆయన నియ మములయొక్క అంతరార్థమును గ్రహింపజాలకున్నాము. ఆయన మన మంగళముకొరకే సమస్తధర్మనియమములను సంస్థాపించి యుండగా, మనము తెలిసియు, గ్రహించియు, ఆయన శుభాభిప్రాయములకు ప్రతిబంధకములు కల్పించు చున్నాము. పిచ్చివారివలె మన యనిష్టమును మనమే సాధించు కొనుచున్నాము. మన నెత్తిమీద మనమే ఖడ్గాఘాతము కావించుకొనుచున్నాము. ఈశ్వరనిర్దిష్టమగు ధర్మపథమునుండి రేఖామాత్రమయినను బహిర్గతులు కాకుండునట్లు సావధానులు కండు. కాని ప్రమాదమున మోహపరవశులయి, ఎప్పుడయి నను ఆయన ధర్మసేతువు నుల్లంఘించిన యెడల, మీ యప రాధముల నొప్పుకొని, ఆయన పాదపద్మములయందు సాష్టాంగ పడి, క్షమాభిక్షను వేడుకొనుడు. ఆయన రాజ్యమునందు అప

రాధనము చేసి, మ రెక్కడకు పారిపోగలము? గిరిగుహలయందు నిర్జనారణ్యములయందు, సముద్రగర్భములయందు ఇహపర లోకములయందు, సకలస్థానములయందును ఆయన సింహాసనమే ప్రతిష్ఠింపబడి యున్నది. ఆయన కంట పడకుండ దాగి యుండగల స్థానము త్రిలోకములయందును ఎక్కడను లేదు. ఆయన నేత్రము, ముఖము, పాదములు, అనంత విశ్వవ్యాప్తములు. ఆయన నుండి మనను మరుగుపఱచగలిగిన చోటు లేదు. ఆయన ఈ యనంతవిశ్వమునందు సంపూర్ణముగా నిండి యున్నాడు. ఆయనకు భయపడి మన మెక్కడకు పారిపోయి రక్షణ నొందగలము? రక్షణయే పొందదలచినయెడల, కేవలము ఆయనకే శరణాపన్నులు కావలయును. ఆయన శరణాగతవత్సలుడు. శరణాగతుడగు భక్తు నెన్నడును విడిచి పెట్టడు. పాపతాపములనుండి విముక్తి నొందించి, కృతార్థునిగా చేయును. కరుణామయుడు, పవిత్రమూర్తి యగు పరమపితయొక్క ప్రసన్న ముఖమును దర్శింపగోరితిరేని మీ సంపూర్ణహృదయములతో, నిండుమనస్సుతో, ఆయన యాదేశములను పాలింపుడు. మీ హృదయములను పరిశుద్ధము గావించుకొనుడు. ఆత్మ పరీక్ష చేసికొనుడు. అహోరాత్రములు మీ ప్రవర్తనను దిద్దుకొనుటకు ప్రయత్నింపుడు. రాత్రింబగళ్ళు ఆయనను భక్తితో నుపాసింపుడు. నిరంతరము ఆయనకు హితమయిన కార్యములు చేయుటయందు మీ జీవితమును గడపుడు. ప్రమాదవశమున నెప్పుడయిన ప్రలోభనములయందు పడి ధర్మభ్రష్టులయిన యెడల, మాటికి మాటికి ఆయన పాదములను మీకన్నీటి ధార

లతో కడిగి, మీ యపరాధములను క్షమింపుమని వేడుకొనుడు. ఆయన మీ చేతులను పట్టుకొని, పాపపంకమునుండి మిమ్ముద్ధరించి, దేవతార్హమగు పుణ్యపదవికి మిమ్ము గొనిపోవును. ఈశ్వరుడు జీవాత్మలకు రోగనివారకుడు. మన మెప్పుడు పాప రోగములచే వికృతదశ నొంది, ఆత్మస్వాతంత్ర్యమును గోలుపోయి, అజ్ఞానాంధులమయి, అసత్కార్యములను చేయ ప్రారంభింతుమో, అప్పుడే ఆయన మనల ననేక విధముల దండించి, తన మార్గమునకు త్రిప్పుకొనుటకు ప్రయత్నించును. వీలయినప్పు డెల్లను, సమయము చూచి, మన హృదయ కలశమునందు ఒక్కొక్క బిందువుచొప్పున అమృతమును చిలుకుచుండును. అదృష్టవశమున ఆ బిందుమాత్రామృతము చేతనే, మనము పూర్వపుదురవస్థనుండి పరిత్రాణము నొంద వచ్చును. ఇట్లు క్రమక్రమముగా మన హృదయమునందు అమృతప్రసార మయినకొలదిని, పాపములతో పోరాడి ఈ సంసారముయొక్క కంటకమార్గములనుండి ప్రయాణము చేసి, ఆయన యమృతనికేతనమునకు చేరగలుగుదుము. ఇట్లు ప్రయాణము చేయుచున్నప్పుడు సహితము, భ్రాంతియుతుల మయి, మోహపరవశులమై, అప్పుడప్పుడు కాలు జారి పడి నప్పటికిని, అప్పుడు సహితము, అతడు మనలను విడువక, సదా సహాయభూతుడయి, మనము దుర్గతిపాలు కాకుండ రక్షించును. ఆయన మంగళమయుడగు మన తండ్రి, మనకు శత్రువు కాడు. మన సుఖదుఃఖములయందు ఉదాసీనభావమును వహించి, యూరకుండడు. ఆయన ఒక వైపున స్వర్గమును, మరియొక

వైపున నరకమును నిర్మాణము చేసి, మనను ఉభయమునకును మధ్యభాగమున నిలువబెట్టి, "మీ కిష్ట మున్న యెడల, స్వర్గమునకు బోవుడు, లేనియెడల, నరకమునకు బోవుడు" అని చెప్పడు. మన మున్నతిమార్గమున ప్రయాణము చేయుచు, ఆయన యాజ్ఞల నుల్లంఘించి, మధ్యమధ్య ఎన్నెన్ని వక్రమార్గముల యందు ప్రయాణము చేసినను, చిట్టచివరకు, మన మందరమును ఆయన మంగళచ్ఛాయయందు చేరి, విశ్రాంతి నొందగలుగునట్లు, ఆయన యొడియందు ఆశ్రయమును పొంది, భూలోకము నుండి దేవలోకమునకును, దేవలోకమునుండి మరియొక దేవలోకమునకును, అనంతపథమున ప్రయాణము చేయుచు, అనంతోన్నతి నొందగలుగునట్లు, ఆయన సర్వవిధముల విధానము చేయుచున్నాడు. కరుణామయుడగు నీశ్వరుని రాజ్యమునందు శాశ్వతనరకము లేదు. ఆతడు కేవలము శిక్షించు నుద్దేశముతోనే ఎవరికిని శిక్ష విధింపడు. ఆయన న్యాయమే, ఆయన దయ. ఆయన దయయే, ఆయన న్యాయము. ఆయన దండన కేవలము మనలను సత్పథమునకు మరలించుటకు పన్నబడిన ఉపాయము మాత్రమే. ఆయన సుఖప్రదాత, మంగళదాత, మోక్షప్రదాత. ఆయన యనుగ్రహము వలననే అనంతజీవనము నొంది, ఉచ్చైస్స్వరముతో మన మాయనమహిమను కొనియాడ గలుగుచున్నాము. చూడుడు, ఈశ్వరు డెంత కరుణాళుడో! మనము ఘోరపాపాత్ములమయి, జడీభూతులమయి యున్నను ఆయన మనలను సమస్తపాపములనుండి విముక్తులను గావింప సంసిద్ధుడయి యున్నాడు. రండు, ఆయన యనుగ్రహము నొంది,

మన మందిరమును కలసి, ఆయన పాదపద్మములయందు మన నవవికసిత, భక్తి సౌరభపూరిత, హృదయ పద్మముల నర్పింతము. ఆయన పాదతలచ్ఛాయయందు, మన తాపత్రయతప్త గాత్రములను చల్లబరచుకొందము. సంసారదవానలముచే మన యాత్మలు దహించుకొని పోవుచున్నవి. ప్రేమసుధానిధియగు మనతండ్రిని వ్యాకుల హృదయములతో ప్రార్థింతము. ఆయన మన హృదయములయందు ఆత్మప్రసాదరూపశీతల వారిని వర్షించును. రండు, ఇప్పుడే ఆయన కరుణామృత స్రోతము నందు స్నానముచేసి, భక్తివసనధారుల మయి, మనహృదయపు పళ్ళెరములలో ప్రేమపుష్పహారముల నుంచి ఆయనకు సమర్పింతము. ప్రసన్నచిత్తముతో ఆయన వానిని గ్రహించును.

ఓమ్ ఏకమేవాద్వితీయమ్.

---

# మహర్షి మహోపదేశములు

## ౨౮ వ ఉపదేశము

యథాకారీ యథాచారీ తథా భవతి ।
సాధుకారీ సాధు ర్భవతి, పాపకారీ పాపో భవతి ।
పుణ్యః పుణ్యేన కర్మణా భవతి, పాపః పాపేన.

బ్రహ్మపరాయణు లగు ఓ బ్రాహ్మభ్రాతలారా! మీరు దేనిని లక్ష్యమునం దుంచుకొని, బ్రాహ్మధర్మము

వవలంబించుచున్నారు? ఎందుకొరకు ఈశ్వరునికి శరణాపన్ను లయినారు? సంసారమునందలి విపత్తులనుండియు, పాపతాపములనుండియు, విముక్తులగుటకే కదా! సంసారముయొక్క పాపతాపములనుండియు, బద్ధభావమునుండియు పరిత్రాణము నొందుటకును, ప్రేమస్వరూపుడగు పరమేశ్వరుని పొంది, ఆయన ప్రేమతో మన యాత్మలకు ప్రసన్నము గావించుకొనుటకును, శుద్ధ బుద్ధ ముక్తస్వరూపుడగు ఆయన యాశ్రయమునందు చేరి, ముక్తి నొందుటకును మన మీ పరమపవిత్ర బ్రాహ్మధర్మమును గ్రహించితిమి. పరమేశ్వరుడు పాపవిమోచకుడు, అక్షయసుఖప్రదాత, ముక్తిదాత. ఆయనకు శరణాపన్నుల మయి ఘోరతరపాపములనుండి, సంసారమోహపాశముల నుండి ఉద్ధరింపబడుదుము. ఏకమాత్రగతి యగు పరమేశ్వరుని యందు ఆత్మసమర్పణము గావించి, మన యాత్మలను దినదినాభివృద్ధి నొందించుకొందము. ఏ దినమున మనము ప్రేమతో బ్రాహ్మధర్మమును గ్రహించియుంటిమో, ఆ దినమునుండియు మన మభ్యున్నతి నొందుచున్నాము. అనంతకాలమువరకు ఆయనకు సమీపస్థుల మగుచుందుము. పరమేశ్వరునితో మన కొకసారి యోగము సంప్రాప్తమయినయెడల, ప్రస్తుతము వేడి నిట్టూర్పులతో నున్న ఈ సంకుచితహృదయములే విశాలము లయి, సుశీతలములయి, ఆయనచే శాసింపబడు మనోహర రాజ్యములుగా మారిపోవును. మన యాత్మ ఆయన యమృత నికేతన మగును. దీని యందే ఆయన ప్రీతిపూర్వకముగా వసించును. మన మాయన యనుగ్రహముచే మన యాత్మలయందలి

పాపమాలిన్యమును ఎంతవరకు కడిగి వేసికొనగలమో, అంత విస్తారముగా ఆయన శక్తిని మనము స్పష్టముగా ప్రత్యక్షముగా ననుభవింపగలము. ఇప్పుడే మీరొకసారి, అంతర్దృష్టితో చూడుడు. ఈ బ్రాహ్మసమాజమునందు చేరి ఈశ్వరుని మీరెంత వరకు ధారణ చేయగలిగితిరో, మీయాత్మల నెంతవరకు అభివృద్ధి నొందించుకొంటిరో, ఒకసారి ఆత్మపరీక్ష చేసికొని చూడుడు. ఇప్పుడే మీ యాత్మల నభ్యున్నతి నొందించుకొని, పరమాత్మతోడి యోగము నార్జించుకొనుడు. ఈశ్వరునుండి మన మెవ్వరును ఎన్నడును విముక్తులము గాము. మనకును ఆయనకును మధ్య నివ్వరిముల్లు మాత్రపు ఎడమయినను లేదు, నిశ్చయమే. పరమేశ్వరుడు అందరి హృదయములయందును వాసము చేయుచున్నాడు. ఎవ రొకసారి ఆయనతోడి సంబంధమును నిబద్ధము గావించుకొందురో, వారు ఈశ్వరునితో పొందిన ఆ యోగమున కెన్నడును విచ్ఛేద ముండదు, అంత ముండదు. గగనమండలమునందలి గ్రహతారకలు లోపించవచ్చును. కాని, జీవాత్మ పరమాత్మలకు కలిగిన యోగమునకు మాత్ర మెన్నడును విచ్యుతి లేదు. ఆయనతో మనకనంతయోగము. పాపపంకము ఎప్పుడు హృదయము నుండి తొలగిపోవునో, ఎప్పుడు మంగళభావము ఆత్మయం దావిర్భవించునో, ఎప్పుడు ఆయన మహదిచ్ఛతో మన యిచ్ఛ సమ్మేళనము నొందునో, అప్పుడే మనము తెలిసికొనగలము. మన కాయనతో సంప్రాప్తమయిన యోగము అఖండ యోగము, దాని కెక వికల్ప ముండదు, విచ్యుతి లేదు

అని అనుభవపూర్వకముగా గ్రహింపగలము. ఆయన తోడి యోగమువలన సంప్రాప్తమయిన అమృతము నాస్వాదన చేసి, మనము చిరకాలము మృత్యుభయమునుండి విముక్తుల మగుదుము. దేవతలచేత సహితము వాంఛింపదగిన ఆ యోగామృతమును పానము చేసి, అనంతజీవితము నొంది, అంత కంతకు దృఢమనస్కులము, బలిష్ఠహృదయులము నయి, ఆ రోజు కారోజు ఆయనను సమీపించుచుందుము.

కాని, అయ్యో, వా రెంత నిర్భాగ్యులు! ఎవరు కేవలము ప్రకృతికిని ప్రవృత్తులకును దాసులయి, సంసారముయొక్క విపన్మార్గమునందు అడుగిడుచున్నారో, ఎవరు ఈ సంసారములోని విషయముల వలననే మోహపరవశు లయి, ఈశ్వర ముఖావలోకనము చేయ నొల్లరో, వా రెంత భాగ్యహీనులు! వా రీశ్వరునికి శరణాపన్నులు గాక పాపాచరణమునందే ముగ్ధులగుటచే, వారి స్వాభావిక పవిత్రత ఇంధనపోషణము లేని అగ్నిహోత్రమువలె క్రమక్రమముగా నంతరించును. వారు భయముచే, క్లేశములచే, ఆత్మగ్లానిచే, సర్వదా శంకాన్వితులయి భీతి నొందుచుందురు. వారు తమ పాపప్రవృత్తులను, చరితార్థత నొందించుకొనుటకే సదా ప్రయత్నించుచుందురు. వారి కెంత సేపును తమ దుష్ప్రవృత్తు లెట్లు ఉద్దీపనము నొందును, పాపవిషయము లన్నియు ఎట్లు హస్తగతములగును, అవిచ్ఛిన్నముగా విషయసుఖనిమగ్నులగుటెట్లు, ఐహికసుఖము లన్నియు చూరగొను టెట్లు, అనునదే ఆలోచన. దానియందే వారికి తదేకధ్యానము. అదే వారికి జన్మఫలము, పరమపురు

ప్రార్థము. పాపములు వాంఛింపదగినవి కావు, విసర్జింపదగినవి. వాని మోహపాశములనుండి ఎట్లు తప్పించుకొనగలము అని ఒకసారియయినను వారాలోచింపనొల్లరు. వారి ప్రకారముగా పాపమునందే నివసించుచు, పాపాచరణమే చేయుచు ఈశ్వరు డొసంగిన తమ బుద్ధిని గోల్పోదురు. క్రమక్రమముగా వికారమునొందిన వారిబుద్ధి వారి కిట్లుపదేశించును. "పాపాచరణము చేయుటకు శంకించుట పిఱికివాని లక్షణము. ధర్మాధర్మములు, పరలోకము, మోక్షము అనునవి భ్రాంతులు. అర్థహీనములగు మాటలు. సాధ్యమయినంతవరకు ఇంద్రియములను చరితార్థత నొందించుకొనుటయే ధర్మము. మృత్యువే జీవనముయొక్క అంత్యదశ. మరణానంతరజీవిత మనునది కల్ల. ఇవి మతాభిమానుల పిచ్చియూహలు" అని యుపదేశించును. వారి దుర్బుద్ధి ఉపదేశించెడు ఈదురుపదేశములను విని విని, ధర్మము, పరలోకము అనునవి లేకుండిననే బాగుండును అని వారనుకొందురు. పరలోకమునుండియు, ధర్మమునుండియు దాగుకొనుటకు వారు ప్రయత్నింతురు. కిరాతునిచేతరుమబడిన లేడివలె వారు తుదకు భయాక్రాంతులయి, ధర్మమును, పరలోకమును, తేరిపారి చూడలేక కన్నులు మూసికొందురు. వారు వద్దన్నకొలదిని, ధర్మము, పరలోకము కన్నులకు గట్టినట్లు ప్రత్యక్షమయి, అంతకంతకు వారిని వేధించును. వారు పాపముచే, తాపముచే, ఆత్మగ్లానిచే నిస్సారహృదయులయి, సమీపించుచున్న మృత్యుభయముచే గడగడ వణకసాగుదురు. ఐహికమునందే ఈశ్వరునికి శరణాపన్నులు కాని వారికి, జీవించియుండగానే పశ్చా

త్తప్తచిత్తములతో అసన్మార్గమునుండి మరలి, సన్మార్గమున ప్రవేశింపని పాపాత్ములకు, ఇహలోకమునందు సహింపరాని మనోవ్యధ ప్రత్యక్షమే. మరణానంతరము పరలోకమునందును, బాణముచే కొట్టబడిన హృదయము గలవానివలె, తగులబడుచున్న శరీరము గలవానివలె నరకబాధ గాక, మరేముండును? ఓ సాధుపురుషులారా! మీ రీశ్వరునికి శరణాపన్నులు కండు. మృత్యువు వచ్చి మిమ్ము మ్రింగివేయక మునుపే, జ్ఞానతేజము మీ హృదయమునందు ఆరిపోకమునుపే పశ్చాత్తప్త హృదయులయి, ఆ దీనబాంధవుని పాదములకడ చేరి, మిమ్ము పవిత్రులనుగా జేయుమని, కన్నీటిధారలతో ఆయనను ప్రార్థింపుడు. ఆయన మిమ్ముల పావనులను గావించును. పాపకార్యము లొనరించి, పాపాసక్తులయి కుతర్కములతో వితండవాదములు చేయుచు, మిమ్మును మీరే మోసపుచ్చుకొనకుడు. మరణానంతరజీవితమును గురించి ఇప్పుడశ్రద్ధ చేసి ముందు కలుగబోవు దుర్గతినిగురించి కళ్ళు మూసుకొని, అంధప్రాయులు కాకుడు. సరళహృదయులయి నిష్కల్మషహృదయముతో, వ్యాకులచిత్తముతో పరమేశ్వరుని సమీపింపుడు. పవిత్రబ్రహ్మధర్మమును మీ జీవితములచే ప్రచారము చేయుడు. బ్రహ్మపరాయణులు కండు. ఆయన మిమ్ము పావనులనుగా జేయును. ఆయన సాన్నిధ్యానుభవ మాత్రముచేతనే మీ పాపములు పటాపంచలగును. మీరు పుణ్యపదవి నధిష్ఠింతురు. ఐహికయాత్రానంతరము, పరలోకమున దేవతలతోపాటు, మీరును ఉచ్చైస్స్వరముతో

ఆయన యనంతకళ్యాణగుణములను గానముచేయుచు, ఆయన మహిమను సహస్రముఖముల చాటగలుగుదురు. ఈ క్షణము నందే ఆయన శరణు వేడుడు. మీ యంతరంగమును పరీక్షించుకొని అందలి దుశ్చింతలను తుడుమాడి స్వార్థపరత్వమును పోనడచి, ఆయనకు హితమయిన కార్యములు చేయుచు జీవితమును గడుపుడు. ఇహలోకజీవనమే మానవుని పరమగతి యని యెంచి స్వేచ్ఛాప్రవృత్తులు గాకుడు. ఇంద్రియలోలురు, స్వేచ్ఛాచారులు, పాపశీలురు, ఐహికమునందు పాపభారముచే కుగ్రింగి, పరమునందు ఊహింపరాని మనోవ్యథనొందుదురు.

ఓ బ్రాహ్మసోదరులారా! మీ రొకసారి ఆలోచించి చూడుడు. లోకమునందు ఎంతమంది పాపకృత్యములయందు నిమగ్నులయి, ఇంద్రియములను చరితార్థత నొందించుటయే పరమధర్మమని యెంచి, పాపశీలురయి, ఆధ్యాత్మికముగా మృతప్రాయు లగుచున్నారు! మీ రట్టి వారితో పోల్చుకొని చూచుకొన్న యెడల, మీ రెట్టి యున్నతదశలో నున్నారో, ఒకసారి భావించి చూడుడు. మీ రీశ్వరానుగ్రహమువలన బ్రహ్మపరాయణు లయి, బ్రహ్మానందామృతరసమును పానము చేయుచున్నారు. మీరు మీకు లభించిన ఈ యున్నతపదవిని తెలిసికొన్న యెడల, పాపాసక్తులయి ఆత్మసుఖమును గుర్తెఱుగని దురదృష్టవంతులగు మీ సోదరుల దుర్దశను తొలగించి వారిని నరకబాధనుండి యుద్ధరించుటకు ప్రయత్నింపుడు. మీ యుపదేశవాక్యములు విన్న బహుమందిలో అత్యల్ప

సంఖ్యాకు లయినను, అజ్ఞాననిద్రనుండి మేల్కొనిన యెడల, తుదకొక్క మానవమాత్రుడయినను, పరమేశ్వరుని కభిముఖుడయిన యెడల, మీరు ధన్యులు. మీ సహవాసముచే వారి హృదయములయందు ఈశ్వరభక్తి, మానవసేవాసక్తి, అంకురింపవచ్చును. మీ జీవితమునందొక్క పాపాత్ముని విషయసుఖములనుండి మరలించి పరమేశ్వరుని వైపునకు త్రిప్పి సముద్ధరింపగలిగిన యెడల, మీ జీవితము సార్థకమయిన దని యెంచుకొనుడు. అయ్యో, చూడుడు! మన నగరరాజములయందు, నలుపార్శ్వములను ఎందరెందరు మందభాగ్యులు, కృపాపాత్రులు, మన పరమపితయొక్క దుర్బలసంతానము పాపాచరణమువలని బాధ నుపశమింప జేసికొనుటకు, మనస్సాక్షి పెట్టెడు చీవాట్లనుండి తప్పించుకొనుటకు, రాక్షసపానార్హమయిన సురారూప గరళమును పానము చేసి ప్రమత్తులయి, సురాపానజనితహృదయదౌర్బల్యాది సకలరోగములచే కృశించుచు, అమృతోదకమును చవిగొనజాలక, క్షుధార్తులయి, తృష్ణార్తులయి, నిలువ నీడ లేక, వారి పంచల, వీరి పంచల అల్లాడుచున్నారు. భావించి చూడుడు. భారతీయులు సనాతన బ్రాహ్మధర్మమునందు విశ్వాసమును, భక్తిశ్రద్ధలను, గోలుపోయిన నాటినుండియు, ఎందరెందరు ఆధ్యాత్మికజ్ఞానదూరులయి, ఆత్మవినాశము నొందుచున్నారు! దేవలోకతుల్యమగు పురాతనభరతఖండము, ప్రత్యక్షరాక్షసభూమివలె ఎట్లు ధర్మశూన్యమయినదో భావించి చూడుడు. ప్రాచీన మహాత్ముల నాటి సత్యానురక్తి, సత్యాన్వేషణము, సత్యానుష్ఠా

నము, ఎట్లు నామమాత్రావశిష్టము లయినవి! మన దేశమునకు సంప్రాప్తమయిన ఈ దుర్దశను తలచుకొనిన యెడల, దేశ భక్తిగల ఏ భారతీయుని హృదయము జలదరించదు? కన్నీరు కాలువ లయి పారదు?

సోదరులారా! ఎవ రింకను బ్రహ్మధర్మ కల్పవృక్ష చ్ఛాయ యందు విశ్రాంతి నొంది, బ్రహ్మానంద రసానుభవమునకు దూరు లయి యున్నారో, అట్టి దురదృష్టవంతుల కందరకు, పవిత్ర బ్రహ్మధర్మమునం దభిరుచిని కలిగించుటకు మీ శక్త్యనుసారము ప్రయత్నింపుడు. బ్రాహ్మధర్మముయొక్క మూలసత్యము ఈ పృథివియొక్క ఒక చివరనుండి మరియొక చివరవరకు ప్రచారము చేయుటకు మీ శరీరమును, మనస్సును సర్వస్వమును ధారపోయుడు. కొందరు ప్రవక్తలయి, భావోన్మత్తులయి, అగ్నిమయవాక్యములను వర్షింపజేసి, సూదంటురాలవలె, జనసామాన్యముయొక్క హృదయముల నాకర్షింపుడు. కొందరు సునిపుణులగు గ్రంథకారులయి, బ్రహ్మధర్మసత్యముల సజ్జనహృదయములయందు చిత్రింపుడు. కొందరు పరివ్రాజకు లయి, కృషికులవలె, కూలివాండ్రవలె, సామాన్య జీవనము చేయుచు, ఈశ్వరునికొఱకు, బ్రహ్మధర్మవ్యాపనము కొఱకు సంసారసుఖముల పరిత్యజింపుడు. ఇంటింట, గుమ్మము గుమ్మము దగ్గర, బ్రహ్మధర్మపతాకము నెగుర వేయుడు; బ్రహ్మనామమును గానము చేయుడు. బ్రహ్మధర్మ కోమల భావబీజముల సకలమానవహృదయములయందును వెదజల్లుడు. అజ్ఞానాంధకారమునందు మునిగియున్న లోకమునకు

తొలుదొల్త బ్రాహ్మధర్మమును ఘోషించిన పుణ్యభూమి యందు మరల బ్రాహ్మధర్మము ప్రచారము చేయవలసిన యవసరము తటస్థించినది. ధర్మసంస్థాపనము కొఱకు మీ ప్రాణ ధనముల నర్పింపుడు. ధర్మకవచమును తొడిగి, సత్యఖడ్గమును పూని, సత్యసంగ్రామము సల్ప సంసిద్ధులు కండు. సకలమానవ కోటితోను ఐక్యభావము నొంది, ఈశ్వరాభిప్రాయమును నెఱవేర్పుడు. ఉపనిషత్ప్రతిపాదిత బ్రాహ్మధర్మము మీ మూల మున పునరుద్ధరణ నొంది, భూమండలవ్యాప్త మగునుగాక ! ఓ జగదీశ్వరా! ఈ ధర్మసంరంభమునందు నీవే మా కేకమాత్ర సహాయుడవు. సత్యమే జయించునుగాక! అనృత మోడి పోవునుగాక ?

ఓమ్ ఏకమేవాద్వితీయమ్.

# మావద్ద లభించు గ్రంథములు.

| | | |
|---|---|---|
| 1. | రాజర్షి రామమోహనరాయ్ చరిత్ర | 0—12—0 |
| 2. | మహర్షి దేవేంద్రనాథ ఠాకూరు చరిత్ర | 0—12—0 |
| 2. | జ్ఞానదీపిక | 1— 0—0 |
| 4. | భక్తసీతారామయ్యచరిత్ర | 0— 4— |
| 5. | శాంతినికేతనము (రవీంద్రనాథఠాగూరుగారి ధర్మోపన్యాసములు) | 2— 8—0 |
| 6. | మహర్షిమహోపదేశములు | 2— 8—0 |
| 7. | పిల్లల పండుగ (కథలు) | 1— 4—0 |
| 8. | విశ్వకవి రవిబాబుచరిత్ర | 2— 8—0 |

# శాంతినిలయగ్రంథమాల.

ప్రకాశకుడు:— ఆకురాతి చలమయ్య, కాకినాడ.

